# ఎర్రజెండాలు

(తెలంగాణా గెరిల్లాయోధుల జీవితగాధలు)

మూడవ భాగం



## గంగినేని వెంకటేశ్వరరావు



జయంతి పబ్లికేషన్స్
ఏలూరురోడ్ . విజయవాడ-2



## అంకితం

విశాలాంధ్ర ప్రతిఘటనోద్యమంలో
అస్తమించిన ఆంధ్ర గెరిల్లా వీరులకు—

## సూచిక:

# వీరుని డైరీ

ఇప్పుడొక మహావీరుని డైరీలోంచి అక్కడో పేజీ, ఇక్కడో పేజీ ఏరి, కోరి విడతీసి ఒకచోట కూరుస్తున్నా.

ఇది ఆయన రాసిన డైరీ అనేకంటే ఆయన ఆత్మ రాసుకున్న డైరీ అనడం న్యాయం, వాస్తవం.

పేరు: పోటు రామనాథం. వూరు: కొక్కిరేణి, మునగాల పరగణా. వయస్సు: 16 సం॥లు. వృత్తి: విద్యార్థి: రెండోఫారం. తల్లి వుంది. తండ్రిలేడు, అన్నా, చెల్లి, అక్కాయి వున్నారు. మధ్యతరగతి రైతు కుటుంబం.

రూపురేఖలు: పచ్చని, ఎరుపు, బక్కపల్చని శరీరం, కోలముఖం, పాలుకారే చెక్కిళ్ళు దొండపండులాంటి పెదిమలు, సన్నబియ్యంవంటి పళ్ళు, నూనూగు మీసాలుకూడా రాని యవ్వనం, జీవితం తన అరిచేయి అంటేట్టు ఒక్క అనుభవం అయినా నుదిటిమీద అద్దని పసితనం.

* * *

ఇవాళ పొద్దుగూకులు మోట తోలి వచ్చాను. ఒళ్ళంతా విరగగొట్టినట్టుంది. కళ్ళు మూసుకుపోతున్నాయి. కాళ్ళు తెగపీకుతున్నాయి. నాలురోజుల్నించి నిద్ర లేదాయె! ఎన్నితోళ్ళేసినా ఆ పాకుతోట తడిస్తేనా? వానలు లేక నేల నెరయలిచ్చి పోయింది. దానికితోడు రోళ్ళు పగిలే ఎండయూ

అవు ఎండలు! నిన్నంతా నీళ్ళుకట్టి కోడికూతవేళ లేసి, పోయి పొద్దస్తమానము ఎద్దులు నేను రెక్కలు ముక్కలు చేసుకున్నా-ఇంకా ఒక యెకరం నేల తడిపొడిగా వుంది.

ఇహ కట్టపొలాలు ఎక్కడివక్కడే బీడుపడ్డాయి! ఒంటరిగాణ్ణి-అదీ కుర్రవాణ్ణి-ఎన్నిటికని వురకను! ఏపని అని చేయను! ఈ జీతగాళ్ళు, కూలీలు-ఎద్దు వెంట ముల్లుగర్ర పట్టుకొని వున్నట్టు వెంటుంటే కాని-ఆ చేసే కాస్తపనిఅయినా సరిగా చేయరు. ఒక అరక గట్టుకొని నేనూ, నా వెనక రెండో అరక తోలుకొని జీతగాడు-ఎంత దున్నినా అవందే! ఇంటా బయట చాకిరి చేయలేక అమ్మ సతమతమవుతూంది! పక్కణ్ణి-ఎంత శ్రద్ధగా, తెలివిగా చాకచక్యంగా చేస్తే మాత్రం బండెడు సంసారం లాగడం సులభమా! ఎక్కడేసిన గొంగడి అక్కడే వుంటే ఆశ్చర్యమా!

అన్నయ్య కాస్త చేదోడు వాదోడుగావుంటే నేనింత బరువు మోయాల్సి వచ్చేదికాదు. అమ్మ అన్ని అవస్తలు పడాల్సిన అవసరముండేదీ కాదు. ఆమె ఎంత నెత్తిన నోరు పెట్టికొట్టుకున్నా అన్నయ్య ఆలకిస్తేనా! వట్టి పనిదొంగ! నలుగురూ నవ్వేది కానడు! తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటాడు! బండమనిషి! తిరిగి రమ్మంటే నాలుగు బజార్లు చుట్టూ పదివూళ్ళూ 'టింగురంగా' అంటూ తిరిగొస్తాడు.

మొన్న వాగొడ్డుచేను దంతెలు తోలి, చందేల పొడ్లో ఎద్దల కట్టేసి, వుప్పేసి ఎద్దలకు నీళ్ళుపెట్టి, జీతగాణ్ణి మేతకు పంపి నేను యింట్లోకి పోయా. గుమ్మందాటి ఒక అడుగు వేసానో లేదో అమ్మ, అన్నయ్య పెద్దంగా కేక లేసు

కోపకం వినపడ్డది. భయపడ్డా. ఆందోళనతో ఆత్రంగా ఇంట్లోకి పురికాను.

"నే నెటనాన్న దేశాలమీద పోతాలె! మీరే వుండండి! నా కంత పౌరుషం లేదనుకున్నారా? నాకు మీకంటే రోషం వుంది! చీము నెత్తురున్నయ్! ఇహ ఈ దరిద్రపు కొంపలో పచ్చి మంచినీళ్ళు త్రాగితే వట్టు" అన్నయ్య గొంతు దుడుకుగా, తీవ్రంగా వినపడుతూంది.

"నాయనా బాగాబతికినవాళ్ళం, రచ్చకెక్కించొద్దు. నెమ్మదిగా మాట్లాడు. అన్నం తిను. తరవాత నిదానంగా మాట్లాడుకోవచ్చు. నేను మాత్రం తప్పేమన్నాను? యింటికి పెద్దాడివి నీ విట్టా తిరిగితే నల్గురేమంటారు-నీవే చెప్పు? పెళ్ళీడుకు ఎదిగిన ఆడపిల్లల గతేమవుతుంది? ఆ పసికందు చదువుకుంటాన్నో దేవుడా అని మొత్తుకుంటుంటే అరక కొయ్యకు, అడ్డమైన చాకిరికి వెడితే-వాడెందుకు పనికొస్తాడు? వూళ్ళో వాళ్ళంతా నిన్ను దేశదిమ్మరి అంటుంటే-రేపు యిచ్చేవాళ్ళు పుచ్చుకునే వాళ్ళు ఎట్టా వస్తారు? మనం ఏనాడూ ఎరగని-యిట్టా వూళ్లూ, మందిళ్లూ పట్టుకొని తిరగడం ఏం బావుంది?..." అంటూంది ఆర్ద్రంగా. ఆ వేదనతో అమ్మ-అన్నముందు, అన్న తినే అన్నం పళ్ళెంముందు కూచొని.

అమ్మ వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నయ్య రెండు చేతులు పుచ్చుకొని బ్రతిమలాడుతూంది. "నల్గురిలో నవ్వుల పాలు చెయ్యకు నాయనా. నిమ్మళంగా మాటాడు. నిండింట్లో పెద్దకొడుకు అలగటం, అన్నంమీదినుంచి లేచిపోవడం ఎంతో

అశుభం. నా మాట విను. నీయిష్ట ప్రకారం వుండు. అన్నం తిను మా బాబు కదూ! నీవు నామాట వినకపోతే ఎవరింటారు? ఈ యిల్లు నీవు చూసుకోకపోతే ఎవరు చూస్తారు? పోయి ఏ స్వర్గానున్నాడో మీ నాన్న నీమీద ఎన్ని ఆశలు పెట్టుకొని బ్రతికాడు?" అని ఆప్యాయతతో అన్నయ్య జుత్తూ, నుదురూ, గడ్డం నిమురుతూ అమ్మ ఆయన్ను మంచం మీద కూచోబెట్టబోతూంది.

ఆయన విసుగ్గా, విముఖంగా, కోపంగా చిందులు తొక్కుతున్నాడు. "మీకూ నాకూ పొంతన కుదరదు! మీ యిష్టం వచ్చినట్టు మీరుండండి! నేనీ ఇంటివేపు చూడను! నా దారి ఏదో నే చూసుకుంటాను! ఏం, నే బతకలేనను కున్నారా? మహా బాగా బతుకుతాను! ఇంటాళ్ళకీ, బయటాళ్ళకీ చులకనయ్యాను. అదీ చూస్తా నేనెట్లా బ్రతకలేనో?" అంటూ అన్నయ్య అమ్మను విదిలించుకొని, విసురుగా బయటికెళ్ళబోతున్నాడు. అమ్మ అడ్డంనిలబడి ప్రాధేయపడుతూంది. చేతులు పట్టుకుని బ్రతిమలాడుతూంది. కన్నీరుతో ఆయన హృదయం కరిగిస్తూంది.

"ఇప్పుడొద్దు నాయనా. ఈ రాత్రిపూట ఎక్కడికి పోతావు? రేపు పోదువుకాని, ఈ పూట యింట్లో వుండు. నేనేది చెప్పినా నీ మేలు కోరే కదా! అమ్మను సుఖపెట్టాల్సిందిపోయి అష్టకష్టాలు పెట్టేది చాలక, కళ్ళముందు కనపడకుండా కానని సీమలుపోయి కడుపులో చిచ్చు పెడతానంటావా? నిన్నిక ఒక్కమాట అంటే అప్పుడడుగు. నీ యిష్టం వచ్చినట్టు వుండు. ఇష్టం వచ్చినప్పుడు ఇంటికి రా. అన్నం

తిను. కావల్సింది తీసుకో. పేరు ప్రఖ్యాతులున్న బంధువుల్లో నాకు తలవంపులు తీసుకరాకూకు" అంటూంది.

"ఇప్పుడు పన్నేం చేయమంటావు?" శాస్త్ర శాంతంగా అన్నయ్య.

"ఇంట్లో వుండు" ఆనందంతో అమ్మ.

"అయితే వాణ్ణి చదువుకు పంపుతానంటావా?"

"నీవు ఇంట్లో వుండి పని అంతా చూస్తానంటే పంపిద్దాం. వాడెన్నోసార్లు చదువుకుంటానని అడిగాడు. చేసే వాళ్ళు లేక ఐదో తరగతిలోనే చాలించి పనికిపెట్టిన సంగతి నీకు తెలియందిరా? వాడు బి. ఏ. దాకా చదివితే మనం గొప్పగా చెప్పుకోవచ్చు. మనకి ఏం లేకుండా వుంది గనక? వాడు తెలివయినవాడు. ఏ ధ్యాసా లేకుండా చదువుతాడు. వాడు పొలంపని చేస్తుంటే వూళ్ళో వాళ్ళంతా ముక్కుమీద వేలు పెట్టుకొని మెచ్చుకుంటున్నారు. నీకు యిష్టమయితే వాణ్ణి చదువుకు పంపిద్దాం, వాడు చదివి పెద్దవాడై పెద్ద వుద్యోగం సంపాదిస్తే, మనకు ఎంతో అండగా వుంటాడు. ఎంతో కీర్తి తెస్తాడు. మంచి సంబంధం వస్తుంది. వాడికి చదువే ఆస్తి. మన ఆస్తి అంతా స్థిర - చరాస్తి నీ కిస్తాను. ఏమంటావు నాయనా?"

"నేను మాత్రం వద్దన్నానా, తప్పకుండా తమ్ముణ్ణి చదివిద్దాం" అన్నయ్య బాగా కరిగి.

"ఇంటిభారం అంతా నీవే భరించాలి నాయనా" అమ్మ ఆవేశంతో.

"తప్పకుండా."

ఈ వాక్యం పూర్తిగా వినీ, వినకుండానే ఎడ్లదొడ్లోకి పరుగెత్తాను. ఇంతసేపు అమ్మా, అన్నయ్య సంభాషణ గుమ్మంలో వుండే విన్నాను. నాకు చదవాలని - చదివి పెద్ద డాక్టర్ను అయి చుట్టూ గ్రామాలలో ఒక వెలుగు వెలిగించాలనీ-కాలేజీ గరల్ను పెళ్ళి చేసుకోవాలని - ఎంతో ఆశ వుంది. చాలా కాలం కుతూహలపడ్డాను. కలలు కన్నాను. కాని ఇంటి పరిస్థితి చూసింతర్వాత చదువుకు స్వస్తిచెప్పాను! అన్నయ్య పని చేయకుండా తిరుగుతుంటే-నేను ఒకవేళ చదువు కావాలని పట్టుపడితే అమ్మ పని ఏమవుతుందని కాడి మేడి పుచ్చుకొని వ్యవసాయం చేస్తున్నా. అన్నయ్య వప్పుకున్నాడు. తప్పకుండా బడికి పంపిస్తారు. చదువుతాను, డాక్టర్ను అవుతాను!

ఈ చిన్నపిల్లలంతా పెద్దవాళ్ళయి "డాక్టరు రామనాథంగారి" దగ్గర చేతులు కట్టుకుని వరుసల్లో నిలబడి భక్తితో మందు పుచ్చుకుంటారు! ప్రజలంతా పూలల్లో పెట్టి పూజిస్తారు!! అబ్బ! ఎప్పుడొస్తుందా రోజు! ఎంత సుదినం!!!

* * *

చదువు-ఎలా చదవడం???

పోయినయేడు ఫస్టుఫారం ఫస్టుగా ప్యాసయ్యాను. ఇహ ఈ సెకండుఫారం ప్యాసవుతాననే ఆశ నిరాశగా కన పడుతూంది!

ఎలా చదవడం? ఎందుకు చదవడం? ఎవరికోసం చదవడం?

ఇల్లు దగ్ధమయి నెత్తిమీద కూలుతుంటే, ఇంట్లో వున్న తల్లినీ, చెల్లినీ రాక్షసులు చెప్పరాని చెరలు పెడుతుంటే, దాచుకున్న సర్వస్వం దోచుకపోతుంటే చదువెలా సాగుతుంది?

రజాకార్లు—నిజంగా నరరూప రాక్షసులు!

నిత్యం రజాకార్లు చేసే హత్యలు, లూటీలు, అవమానాలు, మానభంగాలు, గృహదహనాలు—చూడలేక, వినలేక కళ్ళుపోతున్నాయి; చెవులు చిల్లులుపడుతున్నాయి! ఎలాగయినా ఈ దుర్మార్గం తుడిచేసేయాలి!! ఈ దారుణాన్ని దారుణంగా గొంతు నులమాలి!

నిజాం ప్రభుత్వం రజాకార్లకు ఆయుధాలిచ్చి, మిలిటరీని అండగా పంపించి, పాలుపోసి పెంచి ప్రజలమీదికి వుసికొల్పుతూంది!

ప్రజలు అరిచేతిలో ప్రాణాలు పెట్టుకుని బ్రతుకుతున్నారు. దుర్భరమైన జీవిత గుహలో విచిత్ర హింసలు పడుతున్నారు. కడుపులో మండే ఆకలి, హృదయంలో రగలే ద్వేషం, రక్తంలో మరిగే అభిమానం, బొమికల్లో కనలే కసి, కళ్ళల్లో వెలిగే మానవత్వం—ప్రజల్ని నిరంకుశత్వాన్ని ప్రతిఘటించమని ఉద్బోధిస్తున్నాయి! మృత్యువును శపించే జనావళి—మీది కురికొచ్చే మరణం తలకొట్టను రణపతాక నెత్తింది!

అప్పుడే ప్రజలు గెరిల్లా దళాలుగా ఏర్పడ్డారు! దోపిడీలు చేస్తూన్న రజాకార్లను తన్ని ఆయుధాలు లాక్కుంటున్నారు! గెరిల్లా దళాలు ప్రభుత్వం వెన్ను కుమ్మి,

నడవలేకుండా నేలకూల్చి, క్రుంగి, కృశించి, కుళ్ళిపోయేట్లు చేశాయి! రజాకారు, మిలటరీ క్యాంపులు, రోడ్లు, పట్టణాలు దాటి రావడంలేదు! ప్రజలు తెలుసుకుంటే కాందేముంది? అదీకాక, ఈ ప్రతిఘటనోద్యమాన్ని కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించి నడుపుతూంది!

ఇప్పటికి పదిసార్లు గెరిల్లా దళాలలో చేరడానికి ప్రయత్నించాను! ఫలితం లేకుండా వుంది. జెగ్గాడెంలో ట్రైనింగు తీసుకుంటున్న దళాలలో చేర్చుకోమని కమాండర్ను ఎన్నోవిధాల బ్రతిమలాడాను. ఆయన వింటేనా! ససేమిరా నిన్ను చేర్చుకోనంటాడు!

"అదేమిటండీ, అలా తిరస్కరిస్తారు? నా వంతు త్యాగం, కార్యక్రమం నేను చేయొద్దా? యువకుల్ని యుద్ధ వీరులుగా మార్చాల్సిన కమ్యూనిస్టులే ఇలా 'వద్దు వద్దు' అని మమ్మల్ని వెళ్ళగొడుతుంటే, ఇహ మేం విప్లవానికి ఎలా తోడ్పడగలం?" అడిగాను నిష్కర్షగా ఒకరోజు- చాలసార్లు నామాట పెడచెవిని పెట్టిన కమాండర్ను.

"తీసుకోవడానికి మరేం అభ్యంతరం లేదండీ. మీరు మరీ పసితనంలో వున్నారని చెప్పానుగదా! చిన్న కుర్రవాళ్లు దళాల్లో చేరితే_ఆ కష్టాలు, బాధలు, శత్రుదాళ్లు భరించలేరు! మీరు కొన్నాళ్ళు బయటవుండి దళాలకు సహాయం చేయనుంటే..."

"నేను వప్పుకోవడం లేదంటూరు. నిజంగానే నేను బయటవుండి పనిచేయడానికి సమ్మతించను. ఇల్లు తగలబడుతుంటే పెద్దాళ్ళు మాత్రమే వచ్చి ఆర్పాలని మీరు శాసనం

చేస్తుంది! మానవ జీవితిపై సపశక్తి క్రూరంగా హింసిస్తున్న మృగాలను తుదముట్టించేవాడు చిన్నా పెద్దా అనిచూస్తారా! ఎవరి శక్తికొలది వాళ్ళు ఈ వన్యమృగాలను హతంచేసి, పైన తట్టకు మట్టిపోయాలి కాని, పిన్నా పెద్దలమధ్య గీతల గీసి కూర్చుంటే విప్లవం సాగుతుందా! నన్ను తప్పకుండా దళాలలోకి తీసుకోవాల్సిందే" అని చెప్పాను- తెలిసిన తెలివంతా ఏకరువుపెట్టి, చాల తెలిసిన వాడికిమల్లే ముఖంపెట్టి.

"మీరు చెప్పేది వాస్తవమే. కాని దళాలు కొన్ని నిబంధనలు, నియమావళి, సిద్ధాంతాలు, సూత్రాలకు కట్టుబడివుంటాయి" అన్నాడు దళకమాండరు కొంచెం మెత్తబడి, ఆలోచనల్లో కిందు మీదవుతూ.

"నన్ను చేర్చుకోకూడదని మీ నియమావళిలో వుందా?"

"అది కాదు......"

"పిల్లల్ని చేర్చుకోకూడదని అని అంటారు. అంతేనా?"

"చేర్చుకోవచ్చు. వయస్సూ, స్థాయి, వర్గ దృక్పథం, పోరాట దీక్ష చూసి చేర్చుకుంటాం."

"నా వయస్సుతో పట్టింపు లేకపోతే మీరు తతిమ్మా లక్షణాలు పరీక్షించుకోవచ్చు."

"మీ కసలు పార్టీతో సంబంధం ఇంతవరకు లేదనే విషయం ముందు జ్ఞాపకం వుంచుకోండి."

"లేదు. కాని నాకీ నిరంకుశ ప్రభుత్వం అంటే పట్ట

రాని ద్వేషం, అసహ్యం వున్నాయి. ఈ బూజుపట్టిన నిజాం ప్రభుత్వాన్ని పడదోసి, ప్రజాప్రభుత్వం స్థాపించను పోరాడే ప్రతిఘటనోద్యమంమీద అపారమైన గౌరవం, ప్రేమ వున్నాయి. ఈ ప్రతిఘటనోద్యమాన్ని నడిపే పార్టీ మీద విశ్వాసం, భక్తిప్రపత్తులున్నాయి. విప్లవానికి ఆత్మార్పణ చేయాలనే కుతూహలం వుంది. ఎన్ని కష్టాలు వచ్చినా ఎత్తిన జండా దించని పట్టుదల, ధైర్యం, నిశ్చయం వున్నాయి. ఇంతకంటె మరేమన్నా కావలిస్తే మీరు చెప్పండి చేస్తాను" అన్నాను గుక్క తిప్పుకోకుండా. వినే కామ్రేడ్స్ ముఖాల మీద సానుభూతి పుష్కలంగా తొణికేట్టు.

"అయితే పార్టీ ఆజ్ఞలు, కార్యక్రమం బయటుండే కొంతకాలం ఆచరించండి. శత్రువుదృష్టి మీమీద పడేదాకా బయటుండి దళాలకు తిండి, రక్షణ, వార్తలు, సారస్వతం మందు-ఇత్యాదులు సహాయం చేస్తూండండి అప్పుడు పార్టీకి మీమీద ఒక అభిప్రాయం యేర్పడటానికి వీలుంటుంది. బాధ్యతలు యెలా నిర్వహించాలో మీకు తెలుస్తుంది. మీరెలా నిర్వహిస్తారో మేం చూడటానికి వీలుంటుంది. ఏమంటారు?" అడిగాడు సూటిగా కమాండరు నా కళ్ళల్లోకి గుచ్చుకునేట్టు చూస్తూ-

"మీరేమయినా చెప్పండి, విటాను నన్ను మాత్రం బయట వుంచేపని మాత్రం చేయొద్దు. నేను ఆయుధం పట్టుకుని, ప్రథమ శ్రేణిలో వుండి శత్రుమూకను తుత్తునియలు చేయాలి. అందాక నాకు నిద్రుండదు. నా సోదరులు గుండె లొడ్డి పోరాడుతుంటే నేను చూస్తూ వూరుకోలేను. శత్రు

తుపాకీగుళ్ళన్నీ - చెరువంతటి నా వక్షంగుండే మంచినీళ్ళ ప్రాయంగా భరించాలి. నా చేతిలో ఆయుధం వున్నంత కాలం, నా బొందిలో ఆయువున్నంతసేపూ నా సోదర ప్రజలూ, ఎర్ర సైనికులు చావడానికి వీలు లేదు. నన్ను గెరిల్లాగా తీసుకోండి" అన్నాను వుద్వేగంతో, తీక్షణంగా.

"మీరు ఆవేశంతో మాట్లాడుతున్నారు."

"లేదు లేదు. చాలాకాలం ఆలోచించే, ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చే చెవుతున్నా."

"సరే మిమ్మల్ని దళంలోకి తీసుకుంటాం. ముందు ఆయుధం ఇవ్వం. కొన్నాళ్ళు దళంతోపాటు వుండండి. ఎప్పుడు పార్టీ అవసరమనుకుంటే మీకు ఆయుధం యిచ్చి, పోరాట కార్యక్రమం యిస్తుంది."

"ఆఁ అలానే చేయండి. అ తక్కంటే నేను కోరేదేమీ లేదు" అంటూ ఆనందంతో పార్టీ ఆజ్ఞను అంగీకరించి ఇంటికి వచ్చాను. రోజూ దళాలుచేసే ట్రైనింగు చూసి, ఇంటికివచ్చి నేనూ అది అక్షరాల అభ్యాసం చేస్తున్నా. నాకు ఏమి చేతకాదనుకుంటుంది పార్టీ. కాని నిజానికి నాకు చాల గెరిల్లా శిక్షణ అలవడింది. నన్నే గెరిల్లాగా తీసుకొని, నాకే ఆయుధం యిస్తేనా-ఎన్ని అద్భుతాలు, విజయాలు చేస్తాను! సంపాదిస్తాను!

* * *

నాల్గు నెలల్నుంచి దళంలో తిరుగుతున్నా, ఎన్నాళ్ళ నుంచో యెదురు చూస్తూన్న, తపస్సు చేస్తూన్న మహదవకాశం యివాళే లభించింది. ఒక స్వాతంత్ర్య సమర సైని

కన్నీ ఆయుధం లేకుండా వుంచడం - నిజంగా కళ్ళు కెంపూ తోడేయడమే.

పరగణాలో మధ్యాహ్నం క్రిష్ణవద్దున దళం ఏనెల్లో వుంది. నాల్గు రోజులున్నించి నిద్ర లేదు. బాగా అలిసి, నీరస పడివున్నాం. అందరం గోగుకాడల్లాగా వాడి, నిద్రతో తూలి వళ్ళుమరచి ఎక్కడ పడ్డవాళ్ళం అక్కడేపడి గాఢనిద్రలో వున్నాం. చుట్టూ దట్టంగా రెల్లుపొదలు, గడ్డితుప్పలు, వాగులు, వంకలు' వడ్డు, నిలువులోతు కయ్యలు. అడుగు దూరానున్న మనిషి కనబడడు.

"ఠాం ఠాం ఠాం...ఠాం ఠాం ఠాం ఠాం......"

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్......"

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......"

"హెయ్ హెయ్...... లంజకొడకల్లారా! ఆయుధాలు అవతల పడేసి లొంగిపోండి"

"పోలీస్! కామ్రేడ్స్ పోలీస్" అంటూ గావుకేకలు పెడుతూ లేచాడు - తాను మైమరచి నిద్రపోయిన సెంట్రీ కామ్రేడ్. లేచిచూస్తే చూట్టూతా మిల్టరీ చిక్కగా కమ్ముకొని వత్తుకొని పైకివస్తూంది. తుపాకీ గుళ్ళు కుంభపోత పోస్తూన్నాయి.

"హడావిడి పడకుండా మొహరు కాల్పులు చేయండి కామ్రేడ్స్! కాలుస్తూ శత్రువ్యూహం గండికొట్టి అంతా ఒక వేపే తప్పుకుందాం. జాగ్రత్త! చెల్లాచెదురుగా వెళ్ళొద్దు! మైదానంవేపు పరుగెత్తవద్దు! శత్రువు మాటుపెట్టివున్నాడు" అంటూ కమాండరు గర్జిస్తున్నాడు.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్......"
"ఠన్ ఠన్ ఠన్ ఠన్ ఠన్ ఠన్......"
"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......"
"ఠాం...ఠాం...ఠమ్...ఠాం...ఠమ్"

ఇరువేపులా కాల్పులు ప్రళయ ప్రళయంగా సాగుతూన్నాయి. శత్రువు రక్షణ స్థానాలలో వుండి జోరుగా కాలుస్తున్నాడు. వాళ్ళు మందముండికి పైగా వున్నారు. ఆధునిక ఆయుధాలు పిచ్చిపిచ్చిగా ప్రయోగిస్తున్నారు. దళం ఎటు గండి కొడదామనుకున్నా వీలులేకుండా వుంది. కమాండరు ఆలోచన చిక్కుల్లో చిక్కుకొని బయటపడే మార్గం పరిశోధిస్తున్నాడు.

నా చేతిలో ఆయుధం లేదు. దగాచేసి ద్రోహంవల్ల దాడిచేసిన శత్రువుకు బుద్ధిచెప్పడానికి నా చేతులు ఆరాటపడుతున్నాయి. హృదయం పొంగెత్తుతూంది. కాని ఫలితమేముంది! నాకు పార్టీ ఇంకా ఆయుధం ప్రసాదించలేదు. తోటి కామ్రేడ్స్‌తో బోర్లపడుకున్నా, వాళ్ళతోపాటు లేస్తున్నా, తప్పుకుంటున్నా, బోర్లపడుకొని పాకుతున్నా.

"కామ్రేడ్ రామనాథం! నువ్వాయన ఆయుధం తీసుకొని పోరాటాని కుపక్రమించు ఆయన చేతులు వణుకుతున్నాయి చూడు, సిగ్గుచేటు! శత్రువుముందు - యుద్ధరంగములో - వణికిపోయే కమ్యూనిస్టు చరిత్రలో ఎక్కడా లేదు. ఇవా వృద్ధుడు. ఈ పెద్దమనిషి బోల్షివిక్ చరిత్రకు కళంకం తెచ్చాడు. హూ! ముందు ఆయన ఆయుధం తీసుకోండి. అది రైఫిలు! జాగ్రత్తగా చూడండి" అని కమాండరు

క్రోధంతో మండిపడుతూ. పిడుగులు వర్షిస్తున్నట్టు నన్ను సంబోధిస్తుంటే - ఒక్క క్షణం నిర్ఘాంతపోయి చూశాను. పక్కన ఒక కామ్రేడ్ శత్రుతుపాకి గుళ్ళ తీవ్రతకు, బ్రెన్ గుళ్ళ ధ్వనికి జడిసి చేతులు వణుకుతున్నాయి. గురిపెట్టి కాల్చలేకపోతున్నాడు. చటుక్కున ఆయన ఆయుధం లాక్కున్నాను. ఆనందపారవశ్యంతో ఆయుధం గురిపెట్టాను. కమాండరు ఆజ్ఞ పరిపాలించాను.

"కామ్రేడ్స్! ఇహమీరు తప్పుకోండి! నేను కాలుస్తున్నాను. నా దెబ్బకు శత్రువు తట్టుకోవడం కల్ల!" అని ఆవేశంతో, నేను గండి కొడుతున్నాను. గర్వంతో బొబ్బలెట్టాను. ఒక్కసారి రైఫిలు ముద్దు పెట్టుకున్నా. నిలువెల్లా ఆర్ద్రంగా నిమిరాను.

"ఠన్ ఠన్ ఠన్ ఠన్ ఠన్ ఠన్ ఠన్......" నా ఆయుధం, కాదు నా రెండుచేతులు కసితీరా శత్రువు గుండె మీద నిప్పుముద్దలు అచ్చుకొడుతున్నాయి. నిజాం మిల్ట్రీ బేజారెత్తి పోతూంది.

"హా...ఆఁ...అచ్చా...మరగయా"
"హా...ఊఁ...ఆఁ...చచ్చా..."
"ఆఁ...ఊఁ...చ...చ్చా..."

"చస్తున్నా......కట్టుకట్టండి...దాహం..." నిజాం కుక్కలు మొరుగుతున్నాయి. మరణమూల్గులు పెడుతున్నాయి. ఒకటి కాదు, రెండు కాదు, ఎనమండుగురు నిజాం మిల్ట్రీ కుక్కల్ని నా ఆయుధం బలితీసుకుంది. నా చేతిమీదుగా గండికొట్టి, దళాన్ని తప్పించాను.

కామ్రేడ్స్‌ంతా ఎత్తి, ఎగరేసి, కౌగలించుకొని, ప్రశంసించి, జయజయధ్వానాలు చేసి-నే సాధించిన తొలివిజయం ఆకాశం కెత్తారు. అభినందించారు.

నా ఆయుధం శుభ్రంగా తుడిచి గర్వంగా, గొప్పగా చూసి, ముసి, నా పక్కలో ఈ రాత్రంతా వుంచుకున్నా. ఇహ ఆయుధం నా అవయవాల్లో ప్రధానావయవం అవుతుంది.

* * *

మొన్ని మధ్యదాకా బోడెప్పుడి శేషయ్య దళంలో సభ్యుడిగా వున్నా, ఆయన నా అభివృద్ధికి యెంతో తోడ్పడ్డాడు. దెబ్బతీయడంలో, దెబ్బ తప్పుకోవడంలో సిద్ధహస్తుణ్ణయ్యాను.

యూనియన్ సైన్యాలు నిజాం మిల్ట్రీదాష్టం, దౌర్జన్యం దోపిడి మరిపిస్తున్నాయి. ఘోరాతిఘోరంగా ప్రజల్ని హింసిస్తున్నారు. పార్టీని వెంటాడి వేధిస్తున్నారు. దళాల మీద నిత్యం వేలసంఖ్యలో మిల్ట్రీదాళ్ళు చేస్తూంది.

పదిరోజుల క్రితం అమ్మదగ్గర కెళ్ళివచ్చాను. ఆ మెకు నామీద అమిత ప్రేమ. చిన్నకొడుకు నవటా నేమో! నాకోసం బ్రతుకుతూంది. పార్టీ దళాలంటే అయిష్టమయినా, నామీది వ్యామోహంతో పార్టీపని మెచ్చుకుంటూంది. పార్టీ మీద ప్రేమ ప్రవర్ధమానమవుతూంది. నన్ను మొదట దళాలువదిలి రమ్మని హితబోధ చేసినా, నేను కలగచేసుకొనేప్పటికి "బ్రహ్మాండం తలక్రిందులయినా పార్టీని వదిలి పెట్టొద్దు" అని ఆశీర్వదించింది. పిచ్చితల్లి! అక్కాయికి కొడుకు! చెల్లికి పెళ్ళిచేస్తానంది! ఇప్పుడే వద్దన్నా. విప్లవం జయిస్తుంది.

అప్పుడు ఆమెను ఒక గెరిల్లా వీరుకిచ్చి పెళ్ళిచేయాలి! ఇల్లు అంతా ఆగమయిపోయింది. పొలం బీళ్ళుపడ్డాయి. ఆవులు, ఎద్దులు చూసేవాళ్ళులేక అమ్మ అమ్మింది. విచారించాల్సిన విషయం యేమంటే అన్నయ్య పెద్ద కాంగ్రెసు నాయకుడయి కూర్చున్నాడు. నాయకుడయితే నయం, కాంగ్రెసు వలంటీరు కమాండరు.

మా మామ వకడున్నాడు - వక్కంతుల మట్టయ్యని, పచ్చి రౌడీ, దొంగ, దోపిడీదారు, వ్యభిచారి, భూస్వామి, మిల్ట్రీని వెంటవేసుకొని ప్రజలమీద దాడ్లు, దోపిడ్లు చేస్తుంటే ప్రజలు పట్టుకొని విచారించి మృత్యుశిక్ష వేశారు. దానికి మా అన్నయ్య పార్టీమీద కత్తికట్టి కసితీర్చుకోడానికి కాంగ్రెసు తీర్థం, మతం పుచ్చుకొని వలంటీరు శిబిరం నడుపుతున్నాడు. పార్టీ కామ్రేడ్స్‌ను పట్టుకొని చిత్రహింసలు పెడుతున్నాడు కొందర్ని కాల్చివేశాడుకూడా. అన్నయ్య హుజూరునగరు తాలూకాలో పార్టీ శత్రువయ్యాడు వీలయినంత త్వరలో వెళ్ళి ఆయన సంగతి తాడో పేడో తేల్చుకోవాలి.

పార్టీ నన్ను దళకమాండరుగా తీసుకుంది. ఉత్తర మధిర ప్రాంతం పంపించారు. నిన్ననే ఇక్కడికి వచ్చాను.

పుస్తకాలు బాగా చదువుతున్నా. మార్క్సిజం అంటే ఏమిటి? మార్క్సిస్టు మూలసూత్రాలు, మావోసియాంగ్ నూతన ప్రజాస్వామికం, స్టాలిన్ జీవితం చదివాను. రక్తాక్షరాలుకూడ చదివాను. ఎంతో బాగుంది. ఫ్యూజిక్ చాల గొప్పవాడు. నిజానికి ఫ్యూజిక్ కంటే తెలంగాణా గెరిల్లాలు

గొప్పవాళ్ళు. ఎంచేతంటే సెంట్రలు కమిటీ సభ్యుడు, కేంద్ర పార్టీ పత్రిక సంపాదకుడు-ఫ్యూజిక్ అంత త్యాగంచేశాడని విన్నప్పుడు ఆశ్చర్యం లేదు. ఏ శాస్త్ర పార్టీతో, ప్రపంచంతో సంబంధంలేని, చదువురాని తరతరాలు బానిసజీవితం గడిపిన తెలంగాణా రైతులు, యువతీ-యువకులు పార్టీ నాయకత్వాన పోరాటం సాగిస్తున్నారు. యూనియన్ ప్రభుత్వాని గగ్గోలు పెడుతున్నారు. చిక్కిన గెరిల్లా కండలు తరుగుతున్నా, ముక్కలు ముక్కలుగా నరుకుతున్నా, కిరసనాయిలుతో గుడ్డపేలికలు తడిపి, వంటిమీదేసి తగలపెడుతున్నా, ఒక్కొక్కరోజు ఒక్కొక్క శరీరభాగం తీసిపారేస్తున్నా-చావకుండా కాలుస్తున్నా ఎవరూ ఒక్క రహస్యం చెప్పడంలేదు. వీరులుగా పోరాడి మరణిస్తున్నారు. ఈ గెరిల్లా వీరులు ముందు తరాలకు చరిత్రప్రసిద్ధ వీరులవుతారు. మార్గదర్శకులవుతారు.

చిట్టగాంగ్ విప్లవవీరులు, గదర్ వీరులు చదివాను. భారత చరిత్రంతా తిరగేస్తే యిప్పుడు జరిగే తెలంగాణా విప్లవానికి మహత్తర భవిష్యత్తు-చరిత్ర వున్నాయనిపిస్తుంది. ఇంతవరకూ భారత చరిత్రలో యెప్పుడో ప్రజలు-రైతులు, కూలీలు సంఘటితమయి ఒక వ్యూహంతో, ఎత్తుగడలతో, పాలసీతో, పద్ధతితో, సుశిక్షణతో, కార్మికపార్టీ నాయకత్వంతో ప్రజాస్వామిక ప్రభుత్వం కావాలి, దున్నేవాడికే భూమి చెందాలి, వంటినిండా బట్టవుండాలి. కడుపునిండా తిండికావాలి అని ఆయుధాలుపట్టి పోరాటం చేయలేదు.

ఇప్పుడు చేస్తున్నారు. సాధిస్తున్నారు. జయిస్తున్నారు. ఈ ఘట్టాన్ని చరిత్ర స్వర్ణాక్షరాలతో రాస్తుంది. ఇంకా చాల పుస్తకాలు చదివాను. ఇంగ్లీషుకూడా కొంచెం నేర్చుకుంటున్నా.

దళ కామ్రేడ్సుకు నామీద అచంచల విశ్వాసం. అనవసరంగా వాళ్ళ ప్రాణాలతో చెలగాట మాడననీ, నాకంటె వాళ్ళ జీవితాలు, సుఖాలు ప్రధానంగా చూస్తాననీ, నేను ప్లానువేసి పంపించే పని, చేసే దాడి తప్పక విజయవంత మవుతుందని వాళ్ళ నమ్మకం.

యూనియన్ మిల్టరీ దాళ్ళన్ని తిప్పికొట్టాం. ఇటువేపు ఎక్కడా మిల్టరీ క్యాంపులనుంచి కాలు కదపటంలేదు. నా పేరు విని కలవరిస్తున్నారట! నా దళం కళ్ళల్లో కనపడుతుందట.

* * *

ఇప్పుడు నన్ను జోను కమిటీ కార్యదర్శిగా తీసుకున్నారు. రోజు రోజుకి బాధ్యతలు, భారాలు పెరుగుతున్నాయి!

వూళ్ళల్లో దోచి, ప్రజల్ని మిల్టరీచేత విపరీతంగా హింసించి కమ్మంలో కాపరంపెట్టిన భూస్వామి ప్రకాశరావు మొన్న ఏనుకూరు వచ్చాడు. ముప్ఫయిమంది మిల్టరీకూడా వుంది వార్త అందగానే వక్కణ్ణే స్టెన్ పుచ్చుకొని వెళ్ళా. వాణ్ణి పూర్తిచేసి వచ్చాను. నేను వచ్చానని తెలియగానే మిల్టరీ కిక్కురుమనకుండా వూరుకుంది.

ఈ ప్రాంతం దెబ్బతీయాలని తిమ్మారావుపేటలో

ప్రభుత్వం క్యాంపు పెట్టింది. క్యాంపు పెట్టిన మరునాడు సాయంత్రం వంటరిగానే వెళ్ళి సుబేదారును ఖతం చేసి వచ్చాను.

ఈమధ్య నన్ను పట్టుకోను ప్రభుత్వం దాళ్ళు ఉధృతం చేసింది. చాలాసార్లు మా దళాన్ని చుట్టివేశారు. కాని క్షేమంగా తప్పుకున్నాం.

యూనియన్ సైన్యాల మహోధృతదాళ్ళవల్ల దళాల దైనందిన జీవితం దుర్భరంగా వుంది. అడవుల్లో వున్న నీటి వనరులు, మడుగుల దగ్గర కాపలాలు పెట్టారు. గూడేలు తగలెట్టి కోయప్రజల్ని క్యాంపుల కిందకి తీసుకపోయారు. దళాలవేపు మనిషి మెదలకుండా చేశారు. ఎక్కణ్ణుంచీ సహాయం, సప్లయిలు రాకుండా దిగ్బంధం చేశారు.

నేను స్నానంచేసి రెండు నెలలు దాటింది. వున్న జత బట్టలు వుతుక్కోక నెలకుపైనయింది. కారం, నెయ్యి, మసాలా బియ్యపన్నం, కూరలుమాని నాలుగు నెలలయింది. పది, పదిహేను రోజుల కొకసారి యే పిడికెడు విప్పువువ్వో, అడివి జీడిపప్పో, చారెడు గుటకలో తన కాలం వెళ్ళ దీయాల్సి వచ్చింది. కామ్రేడ్స్ ఈ దుస్సహాజీవితంతో కుంగిపోతున్నారు. అనేకమంది విచిత్రమయిన జబ్బులకు గురి అయి మంచం బట్టారు. ఈ దారిద్రానికి తోడు జబ్బుపడితే ఇహ వేరే నరకం చూడాల్సిన అవసరం లేదు.

చంద్రుకొండ దగ్గర మా దళాన్ని మిలటరీ చుట్టువేసింది. క్షేమంగా తప్పుకున్నాం.

బిండాలపాడు నాకు బాగా తెలిసిన గ్రామం. ఆ

ఊరిని రజాకార్లు నానా హింసలు పెట్టారు. మళ్ళీ యిప్పుడు యూనియన్ సైన్యాలు తగలబెట్టి, అందర్నీ క్యాంపుల దగ్గరకు తోలుకపోయి హింసిస్తున్నారు. పదిమంది స్త్రీ పురుషులు దళాలలోకి వచ్చారు. మొన్న ఆ ఊరిమీద దాడి చేసి వస్తున్న పదిహేనుమంది మిల్టరీని యెదుర్కొన్నాను. తక్షణం ముగ్గురు చచ్చారు. కొంత ఆత్మకు తృప్తి కలిగింది.

నిన్నరాత్రి వెన్నెల్లో, అరణ్యంలో పడుకునివున్నాం. మిర్యాలగూడెం తాలూకా కొరియరు వచ్చాడు. ఆకలి, నిద్ర ఒకదానికొకటి బద్ధ శత్రువులు. అంచేతే నిద్రపట్టక అటూ యిటూ అర్ధరాత్రి దాకా దొర్లుతున్నాం.

"మీకు రామయ్య తెలుసాండీ?" అతను ప్రశ్నించాడు నిద్రపోను ప్రయత్నించేవాడూ ఫలితం కనపడక.

"ఏ రామయ్యా?" అడిగాను తెలియక. ఆకలితో పేగులు మెలితిరుగుతూ అరుస్తుంటే వింటూ-అంత చక్కని పాలవంటి వెన్నెల నాకు వెగటుగానే వుంది. దీని గురించి కవుల వర్ణనలు, గాయకుల సంగీతాలు-నేను కన్నవీ, విన్నవీ అబద్ధాలుగా అగుపడ్డాయి.

"పోలు రామయ్య"

"ఏ తాలూకా?"

"మునగాల పరగణా, కొక్కిరేణి. ఇప్పుడు మిర్యాలగూడెం, హుజూరునగరు తాలూకాలలో పనిచేస్తున్నాడు"

"ఏం పని?"

"పార్టీ పని"

"బాగా పనిచేస్తున్నాడా?"

"బాగా ఏమిటి? బ్రహ్మాండంగా పనిచేస్తున్నాడు. కాంగ్రెసువల టీర్లను చి నలుగుర్ని పార్టీలోకి తీసుకొచ్చాడు. రైఫిలు పుచ్చుకొని తాను వచ్చాడు. ఇప్పుడు పెద్ద కమాండరయ్యాడు. ప్రజలకు ఆయనంటే అమిత గౌరవం. ప్రభుత్వానికి విపరీత హడలు."

"మంచిది"

"మీకేమవుతాడు?"

"మా అన్నయ్య"

"అట్టా చెప్పరూ! నేను ముందే అనుకున్నా! ఇద్దరూ ఇద్దరే. వీరాధివీరులు! మీకు సాటి మీరే..." అంటూ ఆయనేదో పొగడుతున్నాడు.

ఐదారు నెలలక్రితం మా అన్నయ్యను కలుసుకొని, మాట్లాడి, చర్చించి, పార్టీ పాలసీ, ప్రపంచ పరిస్థితి వివరించి, పార్టీలోకి రమ్మని కోరాను. పార్టీలోకి వచ్చాడు. పనిచేస్తున్నాడు. ఆయన నమ్మితే చాలు కొండలు పిండిచేసే శక్తివంతుడు! ఒకటి విశ్వసించాడా దానికోసం ఎన్ని కష్టాలయినా పడతాడు. ఎంత త్యాగమయినా చేస్తాడు. ఇవాళ నాకు సుఖమయిన నిద్రపడుతుంది. మనస్సు నిర్మలాకాశంలా వుంది. అక్కడో నక్షత్రం, ఇక్కడో నక్షత్రంలా స్వచ్ఛమైన ఆలోచనలు మెరుస్తూన్నాయి. కాంగ్రెసు విద్రోహిగా వుండి నాకు అగౌరవం, అప్రతిష్ట తెచ్చే అన్నయ్య పార్టీలోకి వచ్చి ప్రజల్ని, పార్టీని నాయకత్వం వహించి నడుపుతున్నాడు. అంతకంటే కావల్సిందేముంది!

* * *

నేను నిర్మించిన వృక్షం శాఖోపశాఖలై బ్రహ్మాండంగా విస్తరిస్తోంది. ప్రజలు వేలాదివేలు సత్యం పార్టీ వేపు మొగ్గుతున్నారు. ప్రభుత్వం నిమిష నిమిషం ప్రజలకు వందలాది మైళ్ళ దూరమవుతూంది.

మిలటరీ, నేను యీమధ్య యెన్నోసార్లు ముఖాముఖి పోరాడాం. వాళ్ళు నష్టపడ్డారు. కాని నన్నుగాని, నా దళంలో ఒక్క కామ్రేడ్‌నుగాని కనీసం గాయపరచ లేకపోయారు. దీంతో ప్రభుత్వం తల తిరిగిపోయింది. ప్రజల్లో మరీ తేలిక, చులకన అయిపోయింది. నన్ను పట్టుకోను, చంపను వేసిన వ్యుహాలు, వ్యూహాలు అన్నీ చిత్తుచిత్తుగా ఛేదించాను. ఛేదిస్తాను.

మధ్యాహ్నం కోరియరు రాములున్ను తీసికొని సూరారం పార్టీ సభ్యుల్ని కల్సుకోను, సెల్ సమావేశం చూసిరాను వెళ్ళాను. పార్టీ సభ్యులు, ప్రజలు చాలమంది వచ్చారు. చాలకాలమయింది నన్ను వాళ్ళు చూడక. అంతా చిన్నా, పెద్దా సంబరపడుతూ చుట్టూ చేరారు. పరధ్యానంగా మాట్లాడుకుంటున్నాం.

"అబ్బా......ఆఁ......ఎవడురా అంత ద్రోహానికి పాల్పడ్డది" అని కేకలేస్తున్నా నెత్తురుమడుగులోపడి విలవిలా తన్నుకుంటూ.

"ఏం దుర్బుద్ధి పుట్టిందిరా దౌర్భాగ్యుల్లారా, దేవుడు లాంటి ఆయన్ను పండు పూళ్ళో, వీధిలో చంపుతారా?" అని పెద్దలు, ప్రజలు కేకలేస్తున్నారు.

అవును. అటుచూస్తే వెనకనుంచి వచ్చి నన్ను గొడ్డ

లిలో నరికిన ఐదుగురు లంబాడీలు వున్నారు. నా భుజం తెగింది. నా గొంతు పోయింది. పంపు చేసినట్టు ర క్తం చింది కొడుతూంది. ఆయుధం లాక్కున్నారు. కోరియర్ను కూడ నరికారు. ఆయన కాళ్ళు తెగిపడ్డాయి. ప్రజలు, పార్టీ సభ్యులు ఆ రాక్షసుల భయంకర వికార రూపాలు, వికటాట్టహాసం చూసి భీతావహంతో అటూ ఇటూ ఉరుకులెడుతూ ఆక్రందన చేస్తున్నారు. పెద్దలు, పిన్నలు, స్త్రీలు కళ్ళ నీళ్ళు కుక్కుకుంటున్నారు. ప్రభుత్వం నన్ను ఎలానూ బాహాబాహీ పోరాటంలో పట్టుకోలేక, జయించలేక ఈ ఐదుగురు లంబాడీలకు భూములు, డబ్బు పుష్కలంగా ఇచ్చి- ఈ విద్రోహానికి పురికొల్పింది.

నా వంట్లో ర క్తమంతా కల్లం వెడల్పు నేల తడిపి ముడుగు చేసింది. ఇహ నేను చనిపోతున్నా. కోరియరు రాములు చావకుండా నరికారు. ఆయన హృదయం ఎంత వ్యధపడుతుందో పాపం! ఎన్నెన్నో కలలు కన్నాడు! అమానుషమైన చావు చస్తున్నాడు.

నేను సంతోషంగా చనిపోతున్నా! వెళ్ళొస్తా - నా పంచప్రాణాలయిన ప్రజలారా, పార్టీ నాయకత్వాన ముందుకు సాగండి. విప్లవం జయిస్తుంది! భవిష్యత్తు మీది! మీ కోసం దండిగా, మంచిరోజులు యెదురు చూస్తున్నాయి. ఈ ద్రోహులు, వాళ్ళ ప్రభుత్వం తప్పకుండా యిదే శిక్ష అనుభవిస్తారు! నా ధర్మాన్ని నిర్వర్తించి పోతున్నాం. మీ విద్యుక్త ధర్మాన్ని మీరు చేయండి! ఎత్తిన జండా దించకుండా సాగండి!



# రష్యా దళం

లింగయ్య బుద్ధి వక్రించింది. చెవి నిల్లుగట్టుకొని సందుపట్ల అదే మాటంటూంది. అందుకే కన్నతల్లి కన్నీళ్ళు కుక్కుకుంటూంది. అయినవాళ్ళంతా ఆడిపోస్తున్నారు. తన యీడువాళ్ళంతా ఆశ్చర్యపడుతున్నారు.

లింగయ్య కొత్తపుంతల తొక్కుతున్నాడు. తనకే స్పష్టంగా తెలీని ఈ బీరకాయ చిక్కు త్రోవలో తడబడుతున్నాడు. కాళ్ళు వేలాడేస్తున్నాడు. అడపా, దడపా కళ్ళు తేలేసి చూస్తాడు. ఎంచేతో ఎవరికీ అర్థం కావడంలేదు. కాని కొన్నాళ్ళక్రితం కొత్తపురుగులు లింగయ్యతల్లో చేరి, కాస్త చోటుచేసి, కుదురుపడి, గూడుకట్టి అప్పుడప్పుడు లుకలుకలాడి, చటపట తొలుస్తున్నాయి. వాటి కదలిక లింగయ్యను చాలదూరం — తెలీని తీరాలకు, కోరికలకు, ఆలోచనలకు, ఆవేదనలకు, ఆశలకు అందీ అందకుండా తీసికెళ్తుంది.

అలా అని చేసే పని అశ్రద్ధగా, పరధ్యానంగా చేస్తున్నాడ టానికి వీలులేదు. ఎప్పటికిమల్లే జమీందారు గుంపెడావులను అతిశ్రద్ధగా కాస్తున్నాడు. పొద్దస్తమానమూ ఆవుల్ని చెలికల కంచెలు, బాగా గడ్డిపట్టిన గుట్టలు, బీళ్ళు తిప్పి తిప్పి మేపి యింటికి తోలుకొచ్చి లేగలను పాలకిడిసి, పాలు తీసి, బగిగొడ్ల దొడ్లోకిపోయి, వాటికి మేతేసి, పాలు

పిండి, జమీందారుకు నీళ్ళు కాచి తోడి, వళ్ళు రుద్ది, పక్క-
వేసి, వళ్ళు పట్టి ఆయన పడుకున్న తర్వాత, ఇక నిద్రపోయా-
డని ధృవపరచుకొని, తనూ నీళ్ళు పోసుకొని, అడుగు బడుగు
అన్నం తిని పడుకుంటాడు. మళ్ళీ చుక్క పొడవంగానే
లేచి ఎద్దులకు మేతేసి, ఆవులకొట్లో, బరిగొడ్ల దొడ్లో
పేడంతా తీసి, కసువూడిచ్చి యెత్తిపోసి, కాస్త సద్దిబువ్వ
తిని కావిడేసుకొని యింట్లో పట్టే ఎనభై కావిళ్ళ నీళ్ళుపోసి,
పొలంపోయి యెద్దుమోత గడ్డి పీక్కొచ్చి, యింట్లో పడేసి,
సద్ది కట్టుకొని, అన్నం వేళప్పుడు ఆవుల ఇనుసుకొనిపోతాడు.

ఇదంతా యిప్పుడూ తు. చ. తప్పకుండా చేస్తు-
న్నాడు. వచ్చిన తంటాల్లా ఒక కోరిక దగ్గరే. రాత్రి పని
అంతా చేసి వూళ్ళో కొత్తగా పెట్టిన రాత్రిపాఠశాల కెళ్ళి
చదువుతానంటాడు. నాలుగయిదుసార్లు వెళ్ళాడుకూడా.
ఈ పనంటే జమీందారుకు తలనొప్పి. దీనికితోడు లింగయ్య
రైతుసంఘం వాళ్ళ మీటింగులు రెండు మూటి కెళ్ళాడు.
సంఘం వాళ్ళతో తిరగాలనే అభిలాష యెక్కువయింది.
చదవాలని, చదివి దేశసేవ చేయాలని కుతూహల పడు-
తున్నాడు. జమీందారు నయాన, భయాన చెప్పిచూశాడు.
హెచ్చరించాడు. ఈ రాత్రి చదువులు, సంఘం వాళ్ళతో
స్నేహాలు పనికిరావని గట్టిగా మందలించాడు. లింగయ్యకు
యజమాని అనవసరంగా యెందుకు ఆగ్రహిస్తున్నాడో,
ఎంచేత తాను చదివి బాగుపడకూడదో అర్థం కావడంలేదు.

ఆయనముందు జడిసి 'సరే' నన్నట్టు తల వూపినా, తన పని యధాతథంగా చాటుమాటున సాగిస్తున్నాడు.

దీంతో జమీందారు సిప్పాలు తొక్కిన కోతయ్యాడు. కాకేం చేస్తాడు? అలగాజనం అదుపు ఆజ్ఞ లేకుండా సంచరిస్తే వూరుకుంటాడా? యిష్ట మొచ్చినట్టు వ్యవహరిస్తుంటే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాడా? రైలుబండికి ఎద్దుల కడతారో దున్నపోతుల కడతారో అని అనుకునే దరిద్రులు చదివితే పట్టపగ్గాలుంటాయా? గొడ్లు కాసి, గొడ్లలాగా తిని తిరిగి బ్రతికే లింగాయి చదివితే—ఇహ గానుగెద్దులాగా పని చేస్తాడా? వీడు చేయకపోతే వీడి తాత ఎవడు గొడ్లు కాస్తాడు? నీళ్ళు పోస్తాడు? పక్క లేస్తాడు? వీణ్ణి యిట్టా వదిలిపెడితే తతిమ్మా జీతగాళ్ళు నెత్తినెక్కి కూర్చోరా! వూళ్ళో కూలి జనం కళ్ళు నెత్తికెక్కవా? తాను ఆడినంత ఆట, పాడినంత పాటగా వున్న వూళ్ళో చిచ్చు పెడుతున్నారా? తన కెదురు మాట్లాడేవాళ్ళు, తన్ను వ్యతిరేకించేవాళ్ళు లేని వూళ్ళో ముసలం పుడితే చూస్తూ వూరుకుంటాడా? వూరుకోదలచ లేదు. ఈ పీడను ఆరంభంలోనే విరగడ చేసుకోకపోతే చాల ముప్పు వచ్చేట్టుందనుకున్నాడు. రాత్రి పాఠశాల తీసేయాలని పంతంపట్టి వూళ్ళో పెద్దల్ని కూడగట్టి తీసిపారేయించాడు. లింగయ్యను యెక్కడి కెళ్ళొద్దని పట్టుపట్టాడు. మూకీభావంగా వుంటే రెండుసార్లు తగలసిచ్చాడు. కాని లింగయ్య ధోరణి మార్గం మార్చుకోలేదు.

"ఏంరా గాడిదా, గుట్టుగా చెప్పినట్టు విని వుంటా నంటావా, అడ్డమయిన గాడిదలతో తిరిగి వూరేగుతా

నంటావా?" అడిగాడు జమీందారు లింగయ్యను గదిలోకి పిలిచి, పొద్దుగూకులు గొడ్లు కాసి, అలిసివున్నాడు లింగయ్య. ఇంకా బాగా చీకటి పడలేదు. అంతా పడుకోలేదు.

"నేనేం చేస్తున్నా దొరా?"

"గొడ్లు కాసే గొల్ల వెధవకు చదువెందుకు? సంఘం ఎందుకు?"

"కాత్త అచ్చరం ముక్కొత్తే నయం కదూ దొరా"

"ఏడ్చావ్ బోడివెధవ, నోరు మూసి చెప్పినట్టు వింటావా లేదా?"

"వినక యాడకి పోతా దొరా"

"చదువుకు పోవుకదూ?"

"............"

"సంఘంతో సంబంధం వదులుకుంటావా?"

"............"

"ఏంరా మాట్లాడవు గాడిదకొడకా! పళ్ళు రాలాలా ఏం? తాట నిలువునా వలుస్తాను జాగ్రత్త! ముందు అడిగే దానికి జవాబు చెప్పు?"

"రెండు ముక్కలు......నేర్చుకుంటా దొరా"

"వీల్లేదు. నువ్వు చదివితే మాటింటావురా? ఎవడు గొడ్లు కాస్తాడు? ఇంట్లో పని యెవడు చేస్తాడు?" అంటూనే లింగయ్యను పొన్నుల కర్రతో దబదబ బాదుతున్నాడు.

"అబ్బా......ఆ......కొట్టబాకు దొరా"

"చెప్పినట్టు విను."

"వుండు దొరా...కొట్టకు దొరా..పున్నెం వుంటుంది వూరుకో దొరా" అంటూ లింగయ్య ఆక్రందన చేస్తున్నాడు.

"అయినా చూస్తా, ఎవడు అడ్డంవస్తాడో? నీ వళ్ళు వలిసి ఎండేస్తాను. ధాన్యంకొట్లో పడేసి మూతేస్తాను...ఏ నీ అబ్బ అడ్డంవస్తాడో చూస్తా..." అని చిందులు తొక్కుతూ జమీందారు పిచ్చిపిచ్చిగా లింగయ్యను బాదుతున్నాడు. లింగయ్య కిందపడి విలవిలలాడుతున్నాడు. తలుపులేశాడు. బయటికి కేకలు వినపడకుండా కిటికీలు మూశాడు. నిజానికి లింగయ్య చెయ్యి చేసుకుంటే జమీందారు ఒక్క క్షణంలో వూపిరిదుస్తాడు. ఆజానుబాహుడు, సింహబలుడయిన లింగయ్యముందు జమీందారు సింహంముందు చెవులపిల్లి. కాని యజమాని అంటే భయం, గౌరవం, బానిసమన స్తత్వం ఆయన్ను జమీందారు కాళ్ళు చుట్టుకొని విపరీతంగా దెబ్బలు తినేట్టు చేస్తున్నాయి.

లింగయ్య ఇంటికి జమీందారుపోయి తల్లిని నిర్బంధపెట్టాడు. ఆమెకు ఒక్కగాను ఒక్క కొడుకు. ఆ గర్భదరిద్రురాలు కొడుకు తెస్తే చారెడు గంజి తాగుతుంది. లేకపోతే కష్టమనుకోకుండా పస్తుపడుకుంటుంది. జమీందారును వ్యతిరేకించాడు కొడుకు అని విన్నప్పుడు నిర్ఘాంతపోయింది. గుండె లాగినంతపని అయింది. ఎలానయినా కొడుకును మంచి మార్గంలో పెడతాను, కక్ష వహించొద్దని జమీందారుకాళ్లు పట్టుకొని ప్రార్థించింది. కాని జమీందారు క్రోధం కరగలేదు.

లింగయ్య రెండురోజులు జమీందారు దెబ్బలతో మంచంపట్టాడు. లేవలేనిస్థితిలోనే పచ్చివుండువంటి దేహంతో,

గాయాలతో గొడ్డు తోలుకొని వెడుతున్నాడు. జ్వరం తీవ్రంగా వస్తూంది. తల్లి వచ్చి యేడిచి అనేక విధాల జమీందారు తీసిన గోతిలోనే కూర్చొని పైనపోసే మట్టి దిబ్బలు భరించమని చెప్పిపోయింది. ఆయన మనసు అంగీకరించలేదు వారి వాదనలు, పద్ధతులు చాల బాధపెట్టాయి. రహస్యంగా చదువుతూనే వున్నాడు. సంఘంతో సంబంధం కొనసాగిస్తూనే వున్నాడు.

ఒకరోజు జమీందారు బీట్లో, జమీందారు గొడ్లు కాస్తూన్న లింగయ్యను పోలీసులు వచ్చి అరెస్టుచేసి, చేతులకు సంకెళ్ళు వేసి తీసుకపోతున్నారు.

"ఏందబ్బీ నన్ను పట్టుకున్నారు?"— వింతగా అడిగాడు లింగయ్య.

"జమీందారుగారు నీమీద దొమ్మికేసు పెట్టారు"

"మా దొరా?!" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును. మీ దొరే" నవ్వుతూ వెకిలిగా పోలీసుల సమాధానం.

"ఏం తప్పు చేసిని?"

"ఇంట్లో దొంగతనం"

"నేనా?"

"నువ్వే" ఊపు చరిచి లింగయ్యకు చెప్పాడు ఒక పోలీసు వెగటాళిగా నవ్వుతూ, చూపుల సూదులతో గుచ్చుతూ

"ఏంది అన్యాయంగా అంటారు?"

"పదవోయి అక్కడ చెపుదువు కాని"

"యాడకి?"

"సూర్యాపేటలో"

"అమ్మో సూర్యాపేట! బస్తీకిపోతే మళ్ళీ బతికొస్తానా?"

"జైలుకు తీసుకుపోతున్నాం"

"అంటే?"

"కొట్లో పెడతాం"

"అమ్మో......" అంతలావు లింగయ్య పోలీసుల్ని చూడగానే, బస్తీకి తీసుకపోతున్నారని వినగానే పిల్లి అయ్యాడు. అందులో బాగా నవిసి, నలిగి వున్నాడు. దెబ్బలు, జ్వరంమూలంగా తగ్గిపోయాడు. పోలీసులు ఈడ్చుకొనిపోయ్యారు. ఊరిబయటకు పోయేప్పటికి, తన మిత్రుల్ని నలుగుర్ని పట్టుకొచ్చారు యింకొంతమంది పోలీసులు.

ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్న నందుపట్ల యువకుల్ని పోలీసులు పట్టుకెళ్తుంటే — పోలీసుల్ని వూరిబయటిదాకా మందహాసం చేస్తూ జమీందారు సాగనంపుతున్నాడు.

## II

వెనకటి కొకనాడు వంట్లో బాగలేక యినుము యజమాని పని కొంచెం అశ్రద్ధ చేసిందట. ఆయనకు పట్టరాని కోపం వచ్చి పట్టుకతన్నాడు. "ఇలాంటి వాళ్ళను చాల మందిని చూశాను. మహా పెట్టి పోషించేవాడికిమల్లే పైన పడి తంతున్నావే! అయితే నే నసలే నీమాట వినను, నీవని

చేయను. నేను భిక్షించానా అదుపులో పెట్టటానికి నీ తాత తరంకాదు" అన్నట్టు చూసి, నవ్వి, ఇనుము అవహేళన చేసి వదిగి పడుకుంది. ఈ ప్రవర్తనతో యజమాని వళ్ళు జెర్రులు పాకాయి. కన్నూ మిన్నూ కానకుండా క్రోధం కళ్ళు కప్పివేసింది. అభిమానం, అహంకారం దెబ్బతిని, యజమానిని పురి ఎక్కించాయి.

తక్షణం రెండు బళ్ళ బొగ్గులు తెచ్చి, కొలిమి పెట్టి యజమాని ఇనుమును హింసిస్తున్నాడు. ఘోరాతిఘోరంగా హింసిస్తున్నాడు. కొలిమిలో ఇనుము ముచ్చెమటలు పోసేట్టు తల్లడిల్లుతూంది. దాహం అడిగితే ఇవ్వలేదు. దయచూపించమంటే ఎగిరిపడ్డాడు. పై చర్మం మాడి వూడిపోయింది. లోపలి వళ్ళు ఎర్రగా వుడుకుతూంది. కాలి-కాలి తెల్లగా మండుతూ, మారుతుంది. మణుగు సమ్మెట తీసుకొని తెల్లగా కాలే యినుము మీద కింద, పైనా తిరగేసి, బోర్లేసి అలిసి పోతూ మంచినీళ్ళు తాగుతూ, రొప్పుతూ బాది-బాది వదిలెట్టాడు. మరునాడు తీరా చూస్తే ఏకు మేకయి కూర్చుంది. చూడగానే యజమాని జడిసాడు. నిర్విణ్ణుడయ్యాడు. నిన్నటికంటే ధృఢంగా, బలంగా, భారీగా అందమైన ఉక్కుముద్దయింది. తట్టాబుట్ట సర్దుకొని వెళ్ళిపోతూంది. ఒక్కొక్క అడుగు వేస్తూ ఉంటే నిలువెడు గుంత పడుతూంది.

ఇదే పని లింగయ్య విషయంలో జరిగింది. నిండా ముంచారు. చలికాస్తా వదలింది. జమీందారు కరుస్తాయన్న నీళ్ళు కరిచాయి. నీళ్ళలో పీకుతాయన్న పాములు పట్టి పీకాయి. కప్పలు నానబెట్టి నమిలాయి. పీతలు చప్పరిం

చాయి. కాని లింగయ్య చలించలేదు. వాటితో శరీరం వజ్రకాయమయింది. ఒక నెల లాకప్‌లో పెట్టిన హింసా, బాధా, జైల్లో పడ్డ యాతనా - ఆయన్ను ధృడసంకల్పుణ్ణి చేశాయి. హృదయంలో రగిలే రవ్వను జ్యోతిచేసి ధగధగ వెలిగించాయి.

ఇంటికి రాగానే లింగయ్య రహస్య జీవితానకెళ్ళాడు. కేంద్ర ఆర్గనైజరుదగ్గర కొరియరు బాధ్యత నిర్వహిస్తున్నాడు. ఏ ఊళ్ళో ఎంత దురాక్రమణ భూమివుందీ, ఎవరు ప్రజల్ని పీడిస్తూంది. ప్రజలే సమస్యలతో సతమతమవుతోందీ తెలుసుకొని వస్తాడు. పార్టీకి పరిస్థితి వివరించి పరిష్కరించమంటాడు.

లింగయ్య సేవ, త్యాగం, దీక్షలు చుట్టూ పది ఊళ్ళ ప్రజలకు ఆదర్శాలయ్యాయి. అకుంఠిత దీక్షతో పార్టీ ప్రచారం చేస్తూన్న లింగయ్యను దళంలోకి తీసుకున్నారు. ఆయన కోరిక కొండెక్కింది. ఆయనకు దళంలో వుండి, ఆయుధం పట్టి పోరాడాలనేది జీవిత లక్ష్యం. ఆ ఆశ ఇవాళ కాలికి తగిలింది.

అప్పుడు వందమంది కామ్రేడ్స్‌తో కంపెనీ దళాలుండేవి. ఆ కంపెనీ దళంలో త్వరలోనే ఒక గ్రూపుకమాండరయ్యాడు.

ఎప్పుడూ దళం, దళం క్షేమం, ప్రజలు, ప్రజల ఇబ్బందుల గురించి అహర్నిశాలు ఆలోచిస్తుంటాడు. దళం రక్షణకు ఎవరూహించని జాగ్రత్తలు తీసుకుంటాడు. తిండి, మందు, విశ్రాంతి విషయంలో ఎంతో శ్రద్ధవహిస్తాడు.

నిద్రలోకూడ తన సహచరుల, ప్రజల క్షేమాన్ని గురించి కలవరిస్తుండేవాడు.

కొంచెం తీరిక దొరికితే చాలు పుస్తకం ముందేసి కూర్చుంటాడు. చదువంటే తగని ప్రేమ. ఇప్పటిప్పుడే అక్షరాలుకూడ పలికి, కాస్త పుస్తకం చదువుతున్నాడు.

ఆయనకు నిద్రాహారాలున్నాయా లేదా అని అందరూ ఆశ్చర్యపడుతుండేవారు. విశ్రాంతి కావాలని కోరడు. ఎంత పని అయినా, బరువైనా ముందు వెనక చూడకుండా నెత్తినేసుకొని చేస్తాడు. పార్టీ పని అంటే ఆయన మేను పొంగుతుంది. ఎంత ఎక్కువ పనిచేస్తే అంత తొరగా విప్లవం సమాప్తమవుతుందంటాడు.

గురి కాల్చడంలో ఎంతో నేర్పు సంపాదించాడు. గురికి కావలసిన లక్షణాలలో ధైర్యం, సమయస్ఫూర్తి, నిశ్చలత ప్రధానమైనవి. రంగంలో తొణుకూ బెణుకూ లేకుండా నీళ్ళు చెలగాటంగా కాలుస్తాడు. ఎంత నిబ్బరం ధైర్యం, నిర్మల మనస్సు, దృఢనిశ్చయం వుంటే రంగంలో శత్రువును అంతగా ఆట ఆడించవచ్చు. క్షేమంగా తప్పుకో వచ్చు. ఇది ఆయన చేస్తాడు. అందుకే పార్టీ, ప్రజలకు ఆయనంటే అంత గౌరవం, ప్రేమ, వాత్సల్యం. అంచేతే శత్రువు కాళ్ళు చల్లబడి గజగజ వణికేది.

ఆయనలో ప్రచ్ఛన్నంగా అణిగిమణిగి వున్న ఒక బ్రహ్మాండ శక్తి పార్టీ చైతన్యంతో బ్రహ్మాండంగా విజృంభిస్తుంది.

* * *

"కమ్యూనిస్టు పార్టీ"
"జిందాబాద్"
"రైతు సంఘానికి"
"జై"
"కూలి సంఘానికి"
"జై"
"రజాకార్ల దురాగతాలు"
"నశించాలి"
"దున్నేవానికి"
"భూమి"
"కూలి"
"హెచ్చించాలి"
"జీతాలు"
"పెంచాలి"
"విప్లవం"
"వర్ధిల్లాలి!"
"ఎర్ర జండా"
"జిందాబాద్"
"జమీందార్ల జబర్దస్తీ"
"నశించాలి!"
"ప్రభుత్వ నిర్బంధ విధానం"
"నశించాలి"

నినాదాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. నినాదాలిస్తూ, కదంతొక్కుతూ, పాడుతూ, లెఫ్ట్—రైట్ మార్చి

చేస్తూ సాగిపోతూన్న ఆ యిరవై మంది యువకుల్ని మద్దిరాల ప్రజలు ఆపి అభినందిస్తున్నారు. ఆ యువకులంతా ఒకే సైజులో, డ్రెస్‌తో, భుజాన రైఫిళ్ళతో వున్న సైనికులు. ముఖంమీద హాసరేఖ తొణికింది. ప్రతి ప్రాణీ సంతోషంతో చివురించింది. ఇంటింటిముందూ ఆ యువకుల్ని ఆపి కాళ్ళకు పది కడవల నీళ్లు వారు పోసి, ముఖాన కుంకుమ పెట్టి, హారతిచ్చి, కొబ్బరికాయలు కొట్టి, దణ్ణంపెట్టి పోతున్నారు. ఘోషానుంచి ఎన్నడూ బయటికి రాని స్త్రీలు కూడ బయటకు వచ్చి వారిని పూజించి నమస్కరించి పోతున్నారు.

అన్నంవేళ కావడంతో మద్దిరాల ప్రజలు యెవరి పనిలో వాళ్ళు నిమగ్నులయ్యారు కాసేపట్లో వూరు తిరణాలయింది. పొలాలనుంచీ, బీళ్ళనుంచీ, దుక్కలదగ్గర నుంచీ, దొడ్లవద్దనుంచీ యువతీ-యువకులు, పెద్దలు, పిన్నలు సంబరాలు పడుతూ వురుకు పరుగులతో వస్తున్నారు.

"ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా
కూలీల గొంతులో కొనవూపిరుంటేను
పేదరైతూమేన వేడిరక్తముంటే
ఎగరాలి ఎగరాలి మన ఎర్ర జెండా......"

మద్దిరాలంతా ఏకంగా కదిలింది. ఊరు వుదధిలా పొంగింది. ప్రజలంతా-స్త్రీలు, పురుషులు, పిల్లలు బారులు తీరి వరుసల్లో నిలబడి ఆ యువకులతో వూరేగింపు చేస్తున్నారు. పాడుతున్నారు. నినాదాలిస్తున్నారు. కేకలు, బొబ్బలు పెడుతున్నారు. జయధ్వానం చేస్తున్నారు. అన్నిటి

కంటే ముఖ్యమయింది, ఎప్పుడూ మద్దిరాల ప్రజలకు కరువయిన తృప్తి, నిండయిన నవ్వు అందరి వదనాల ఆడుకుంటూంది.

"సోదరీ సోదరులారా!

లింగన్నను గురించి మీకు ఎక్కువ చెప్పాల్సిన అవసరం లేదు. ఈ చుట్టూ ప్రాంతంలో ఎక్కడ భూమి పంపిణీ జరిగిందన్నా ఆయన చేతిచలువే. ఎవరు కంటినిండా నిద్రపోతున్నారు. కడుపునిండా తిండి తింటున్నారన్నా— ఆయన పెట్టిన భిక్షే. ఆయన మనకు దేవుడులాంటివాడు. మన కళ్ళు తెరిచాడు. మనకు అండగా నిలిచే పార్టీని చూపించాడు. మనకు నీడనిచ్చే జండా చేతికిచ్చాడు. దండిగా భూమి ప్రసాదించాడు. నిజాం ప్రభుత్వ రాక్షసుల్నుంచి రక్షణ కల్పించాడు. ఇదే ఆయన దళం! దీన్నే రష్యా దళం అంటారు. సూర్యాపేట, మానుకోట తాలూకాల్లో ప్రభుత్వం ఈ దళాన్ని చూసే భయపడి, గుండెలు జారి రష్యానుంచి దిగుమతి అయిన కమ్యూనిస్టు దళం అమ్మో అని ప్రచారం చేస్తున్నారు. ఒక్కసారి మీ తరపున అజేయమైన మహా వీరులను, మన తండ్రివంటి లింగన్నను అభినందిస్తున్నాను. లింగన్నను మాట్లాడవలసిందిగా కోరుతున్నాను. కమ్యూనిస్టు పార్టీకి జై" అంటూ గ్రామపెద్ద బహిరంగసభలో లింగయ్యను, ఆ యువకుల్ని ప్రజకు పరిచయంచేసి కూర్చున్నాడు.

లింగయ్య మాట్లాడటానికి లేవగానే ప్రజలంతా జయ జయ ధ్వానాలు చేశారు.

# III

ఎలక్షను అయిపోయింది. కాంగ్రెసు నాయకులు ప్రభుత్వం వెలగబెడుతున్నారు. కాంగ్రెసు[illegible] ప్రజల్ని, పార్టీని చెప్పరాని యాతనలు, చెరలు, హింసలు, అవస్థలు పెడుతున్నారు.

పొద్దు గూకింది. కాని ఇంకా చిక్కగా, తారులాగా పొంగిపొరలుతున్న గాఢాంధకారం రామాపురాన్ని ముంచెత్తలేదు. రైతులు, కూలీలు పూర్తిగా పొలాలనుంచి ఇళ్ళు చేరలేదు. గోచిపాతలేసి దరిద్ర సంతతి వీధుల్లో కేరింతలు కొడుతూంది.

ఇంతలో ఒకరు ఊరు లేచిపోయేట్లు "మన లింగన్న రచ్చాదళం వత్తుంది. అంతా రారర్రో, రచ్చబండకాడ మీటింగు చెపుతరు రండిరో" అని పొలికేకపెట్టారు. ఊరంతా శివమెక్కినట్లు ఆవేశంతో ఊగిపోయింది. ఆనందంతో పులకించింది. సంతృప్తిగా హృదయం స్పందించింది.

"బోలో స్వతంత్ర భారత్ కు"
"జై"
"కమ్యూనిస్టుపార్టీకి"
"జై"
"ఎర్రజండాకు"
"జై"
"విప్లవం"

"వర్ధిల్లాలి"
"దళాలు"
"వర్ధిల్లాలి"
"యూనియన్ మిలిటరీ జులుం"
"నశించాలి"

నినాదాలు, మార్చింగ్ సాంగ్, కేకలతో రామాపురం గోడలు మ్రోగుతూ లయ కలుపుతున్నాయి. పిల్లలు గంతు లేస్తూ నృత్యభంగిమలు రూపొందిస్తున్నారు.

"జై జై అరుణపతాకకు జై
వేగ రావోయ్ కార్మికా
వేగ రావోయ్ కర్షకా......"

అంతా పాట అందుకున్నారు. లింగన్న దళంతో పొరు గూళ్ళనుంచి ప్రజలు కలిసివచ్చారు. రామాపురం ప్రజలు ఎదురెళ్ళి తీసికొచ్చారు. ఊరుమీద వూరు పడ్డట్టుంది. ప్రజ లంతా కోలాహలం చేస్తూన్నారు. గొప్పగా ఊరేగింపు చేసి బ్రహ్మాండమయిన బహిరంగసభ ఏర్పాటు చేశారు. పెట్రో మాక్సులైట్లు చీకటి చెరుపుతున్నాయి.

లింగయ్య రైఫిలు మరో కామ్రేడ్‌కు అందించి వేలాది సంఖ్యలో వున్న ప్రజల్ని వుద్దేశించి వుపన్యాసం ఆరం భించాడు.

"సోదరీ సోదరులారా! రైతుకూలీ పెద్దలారా! రజా కార్లుపోతే మన కష్టాలు గట్టెక్కుతాయనుకున్నాం. అంచేతే రజాకార్లను, నిజాం మిల్టరీని అనన్య త్యాగాలుచేసి ఎదిరించి పోరాడాం. యూనియన్ సైన్యాలు నిజాం నవాబును గద్దె

దించుతాయని, రజాకార్లనుండి ప్రజల్ని విముక్తి చేస్తాయనే ఆశతో ఆహ్వానించాం. కాని ఆచరణలో అందుకు భిన్నంగా జరుగుతూంది. నిజాం నవాబును రాజప్రముఖును చేశారు. పారిపోయిన జమీందార్లను, దోపిడీదార్లను, పటేల్, పట్వారీలను పీడకులను మళ్ళా ఊళ్ళల్లోకి తీసుకొచ్చి ప్రజలు పంచుకున్న భూములు బలవంతగా అప్పజెప్పుతున్నారు. ప్రజలు భూములు యివ్వనంగీకరించకపోతే దౌర్జన్యం చేస్తున్నారు. ప్రజల్ని పశువులకంటే హీనంగా కాల్చిపారేస్తున్నారు. వచ్చి రావడంతోనే పార్టీ మీద దాడి ప్రారంభించారు. ఊళ్ళల్లో విపరీతంగా దోపిళ్ళు, దౌర్జన్యాలు, లూటీలు చేస్తున్నారు. పోయిన కౌలి, లెవీ, దోపిడి, పన్నుల పరంపర మళ్ళా తెచ్చి పెడుతున్నారు. కనక మనం ఈ దౌర్జన్యం, దురాగతం, దౌష్ట్యం తుదముట్టించాలి. వీర తెలంగాణా అన్యాయం, అక్రమం సహించదని ఎలుగెత్తి చాటాలి! ప్రజలు పరశురాములై పార్టీ నాయకత్వాన ప్రతిఘటనోద్యమాన్ని ప్రబ్రహ్మాండంగా సాగించండి .....'' అంటూ లింగయ్య ముగించాడు. తర్వాత మరో యిద్దరు కామ్రేడ్స్ మాట్లాడారు. కరతాళ ధ్వనులతో, నినాదాలతో సభ ముగిసింది.

యూనియన్ సైన్యాల దాళ్ళు తీవ్రమయ్యాయి. ప్రజలెంతమంది వున్నారో లెక్క చూసి సైనికులంతమందిదిగారా అన్నట్లు ఎక్కడ చూచినా మిల్టరీయే! తెలంగాణాంతా పెద్ద మిల్టరీ కేంద్రమయింది. ముఖ్యంగా లింగయ్య కోసం, లింగయ్య దళంకోసం వేట అధికమయింది. ఆయన మానుకోట తాలూకాలో దళకమాండరుగా వుంటున్నాడు. సుబ్బర

వేడు ఫిర్కా, సూర్యాపేట తాలూకాలో కొంతభాగం చూస్తున్నాడు. ఈ ప్రాంతం మిల్టరీ సంచలనం ప్రతి అంగుళం పరుచుకుంది. ప్రతి మనిషికి ఒక సైనికుడు కాపలావున్నాడు. ప్రమాదం ప్రతి ప్రాణి నెత్తిమీద దయ్యంలా కూర్చుంది.

ఇంత తీవ్ర నిర్బంధంలో లింగయ్య దళంతో పగలు, రాత్రి అనే భేదం లేకుండా తిరుగుతూ పార్టీ కార్యక్రమం సాగిస్తున్నాడు. ఈయన దళాన్ని గూర్చి యిక్కడ రెండు మాటలు చెప్పడం అవసరం. ఈయన దళాన్ని పార్టీ, ప్రజలు, శత్రువులుకూడ ప్రత్యేకంగా చూస్తారు. దళం అంతా ఆజానుబాహులుగా, అతి బలాఢ్యులుగా, ఒకేఎత్తు, లావు, డ్రెస్‌లో వుండి చూసే వాళ్ళకు కళ్ళ పండగగా కనపడతారు. వాళ్ళ తీరు, క్రమశిక్షణ నడక చూస్తే కవలపిల్లల్లా వుంటారు. దీనికంతా కారణం లింగయ్యే. ఆయన దళం వేసే చెప్పుల దగ్గరనుంచీ. జుట్టు కత్తిరించుకోవడందాకా జాగ్రత్త తీసుకుంటాడు. ఇరవయి మందితో వున్న దళంవున్నప్పుడు ఎక్కడో విదేశాలనుంచి దిగిన వీరుల్లాగా వుంచాడు. ఇప్పుడు యూనియన్ సైన్యాలు వచ్చిం తర్వాత-పార్టీ తీసుకున్న ఎత్తుగడల మార్పు ప్రకారం దళాన్ని పదకొండు మందితో నిర్మించాడు. ఈ పదకొండు మందికూడ అచ్చుగుద్దినట్టు ఒకే విధంగా వున్నారు. అంచేతే ఆయనదళాన్ని రహస్య దళం అనటం సర్వసాధారణమయిపోయింది. ఈదళం చూసి ప్రజలు పొంగిపోతారు. మరో ప్రత్యేక లక్షణమేమంటే, ఈయన దళం చేసిన దాళ్ళలో ఒక్కటీ పరాజయం పొంద

లేదు; శత్రువు ఈ దళంమీద చేసిన దాళ్ళల్లో ఒకటీ జయప్రదం కాలేదు. ఈయన ఒక్క కామ్రేడ్‌నుకూడా పోగొట్టుకోలేదు.

ఇలా చిల్లంచర్ల, వంతడపల, నీలకుర్తి, ఆనపురం, భావోజిగూడెం, మామిళ్ళమడుగు, చిన్నమలి, పెదనమలి, పోలుమల్లి, నందుకట్ల, గోపాలపురం, కొత్తపల్లి, దాట్ల—ఇత్యాది గ్రామాలన్నీ జైత్రయాత్ర చేశాడు.

ఒకరోజు కొత్తపల్లి మీదికి దాడికొస్తున్న మిల్టరీని చూసి భయపడి ప్రజలు లింగయ్య దగ్గరకు పరుగెత్తుకొచ్చారు. వెంటనే దళంతో మిల్టరీకి ఎదురెళ్ళాడు. ఈయన దళాన్ని కనుచూపు మేరలో చూడగానే—నలభై మంది యూనియన్ మిల్టరీ గ్రామసింహాలు పలాయనం చిత్తగించాయి. ఆయనగాలి సోకితే చాలు మిల్టరీ కాలుకదపదు. దళం పారిపోయే మిల్టరీ వెంటబడ్డది. ముకుందాపురందాకా బూట్లు, హ్యాట్స్, వాటర్ బాటిల్సు సంచులు పారేసుకుంటూ, కిందపడుతూ లేస్తూ పారిపొయ్యారు. అక్కడా దళం వెంబడించింది. అక్కణ్ణుంచి నందుకట్ల పరుగెత్తారు. దళం వెంటాడుతూనేవుంది. నందుకట్లనుంచి జనగాం-సూర్యాపేట రోడ్డు పట్టుకొని పరుగెత్తుతున్నారు. దళం రోడ్డుమీద వెంటబడ్డది. చావుబతుకులతో పారిపోతున్న మిల్టరీని—పదకొండుమంది గెరిల్లా వీరులు తరమడం చూసి ప్రజలు "హేహేహే, పారిపోతున్నారే! రోజూ వూళ్ళమీదపడి

ఆడవాళ్ళను కొట్టడం, పాతకుండలు పగలగొట్టడం అనుకున్నారా బిడ్డా" అని పరిహసించారు.

దళం తిరిగివచ్చి సందుపట్లలో మీటింగు పెట్టింది. చుట్టూ ఊళ్ళ ప్రజలు విజయవార్త విని వచ్చారు. ఎంతగానో అభినందించారు.

దళం కూడలి వాగువద్దున పడుకుంది. దళం కోసం గాలిస్తున్న మిల్టరీ, కాంగ్రెసు నాయకుల ద్రోహుల వల్ల వార్త తెలుసుకున్నారు, తెల్లవారుజామున కాంగ్రెసు నాయకుడు పండిత రుద్రదేవ్ నాయకత్వాన మిల్టరీ వచ్చి నిద్రపోతూన్న దళాన్ని చుట్టేసింది. కాని సెంట్రీ చూశాడు. కామ్రేడ్సును హెచ్చరించాడు. వెంటనే లింగయ్య లేచి స్టెన్ అందుకున్నాడు. కామ్రేడ్సందరికీ ఎవరెక్కడుండాలో స్థానాలు నిర్ణయించాడు.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ..." మిల్టరీ బ్రెన్‌లు పేలుస్తూంది. నాల్గువేపుల తుపాకి గుళ్ళు హోరాహోరీ ప్రేలుతున్నాయి.

"ఇంకెక్కడికి పోతావు జోగయ్యా! ఆయుధాలు కిందేసి లొంగు. లేకపోతే అంతా కుప్పకూలుతారు" అన్నాడు జమీందారు లింగయ్యను వుద్దేశించి. లింగయ్య రహస్యపేరు జోగయ్య. ఇది వాళ్ళు ఆరాతీసి తెలుసుకున్నారు.

లింగయ్య స్టెన్‌తో సమాధానం చెప్పాడు.

"ఢమ్ ఢమ్ ఢమ్ డమ్ ఢమ్..." దళ కామ్రేడ్సంతా మాటల్లో కూర్చొని ఆయుధాలతో సమాధానం చెప్తున్నారు.

మిల్టరీ ఆశ అమాంతం తునిగింది. నిస్పృహా గుండె నిండా పేరుకుంది.

"తీసుకోండి! దగ్గరికి రండి! ఆయుధాలు కావాలన్నారు కదూ." అని హేళనగా అన్నాడు పెద్దగా లింగయ్య.

కాల్పులు సాగుతూనే వున్నాయి. మిల్టరీ కాల్పుల ఉధృతం కొంచెం మందగించింది.

"మీరు నిజంగా సైనికులయితే నిలబడండి! ఎందుకు పారిపోతారు. నిత్యం మాకోసం, నానా అవస్థ పడతారు? ఇవాళ అటో యిటో తేల్చుకుందాం ఆగండి..." అంటూ పారిపోతున్న మిల్టరీని లింగయ్య సవాలు చేశాడు. దళం మాటల్లోనుంచి లేచి మిల్టరీ వెంట పడ్డది. మిల్టరీవాళ్ళు పారిపోయ్యారు. వెంటవచ్చిన ద్రోహులు చిక్కారు.

"నీ పేరేమిటి?" లింగయ్య అందులో బడా కాంగ్రెసు నాయకుణ్ణి అడిగాడు.

"రు...ద్ర...దే...వ్" గడగడ వణుకుతూ సమాధానం.

"నిజంగా చెప్పు"

"నిజంగా"—పాపం రుద్రదేవ్ భూమికి బెత్తెడెత్తు ఎగిరి పడుతున్నాడు. చొక్కా, ప్యాంటు మలమూత్రాలతో తడిసి ముద్ద-ముద్దయి పరమ అసహ్యంగా వున్నాడు. భీతావహంతో మాటలు స్పష్టంగా, సరిగా రావడంలేదు. అతనిలో గూడు కట్టుకున్న దౌష్ట్యం, ద్రోహం, పీడన, పాపం ఒక్కసారి విజృంభించి అతన్ని వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఇక ప్రాణాలమీద ఆశ వదులుకున్నాడు. పులినోట్లో తలదూర్చి

బతికి బయట పడటమే! అందులో కమ్యూనిస్టుల్ని నిత్యం పట్టిస్తూ, చంపిస్తూ, ప్రజలను నానా అగచాట్ల పాలుచేస్తూ, మిల్ట్రీని వెంటేసుకొని తిరుగుతున్నాడనే కీర్తి కూడబెట్టుకున్న తన్ను-తాను చంపించడానికి వచ్చిన లింగయ్య బతకనిస్తాడా! లేదు. చావు తప్పదు! అంచేత అతను భయపడి మెలికలు తిరుగుతున్నాడు.

"ఎందుకొచ్చావు?"

"........."

"నిజం చెప్పు!"

కమ్యూనిస్టులు నిజం చెపితే కొంత అపరాధం క్షమిస్తారని అతని బుర్రకు తట్టింది.

"మిమ్మల్ని...పట్టుకోడానికి" తడుముకుంటూ అనేశాడు.

"పట్టుకోడానికా, నిద్రపోయేవాళ్ళ పైన పడి చంపడానికా?"

"........."

"ఏది వీలయితే అది చేయడానికి వచ్చారు. అంతేనా?"

"ఆఁ..."

"మరి నిన్నిప్పు డేమి చేయమంటావు?"

"మీ...యి...ష్టం..." చిన్నగా కింద ఎగిరెగిరి పడుతూ మూల్గాడు.

"మే దొరికితే చంపేవాడివి కాదా?"

"ఊఁ, చంపేవాణ్ణి..."

"నిత్యం పార్టీ మీద, ప్రజలమీద దాళ్ళు చేయడమే నీ కార్యక్రమం కదూ?"

"అ...వు...ను..."

"చంపదలుచుకున్నాం; నీ వేదైనా చెప్పదలిస్తే చెప్పు" లింగయ్య ఆదేశించాడు.

"అయ్యో...చంపొద్దయ్యా...మీ కాళ్ళు పట్టుకుంటా...ఇంకెప్పుడూ ఈ దౌర్భాగ్యపు పనులు చేయను... నేను చాలా పాపాలు చేశాను. ఇహ చెయ్యను. క్షమించండి..." అని లబోదిబోమని మొత్తుకుంటూ లింగయ్య కాళ్ళు చుట్టుకొని అప్పుడే భర్తను పోగొట్టుకున్న వితంతువు మల్లె వెక్కిళ్ళు పెట్టి యేడుస్తున్నాడు.

కాళ్ళు పక్కకు తీసుకొని "ఛీ పిరికిపందా, వెళ్ళిపో! నిన్ను చంపం. మేం అంత దుర్మార్గులు కారు కమ్యూనిస్టులు. నిజంగా నిన్ను ముక్కలు ముక్కలుగా నెల రోజులు తరిగితే కాని నీవు చేసిన పాపాలకు పరిహారం కాదు. అయినా నిన్ను వదిలిపెడుతున్నా, వెళ్ళి సక్రమంగా జీవించు" అని దయానిధి అయిన లింగయ్య రుద్రదేవ్‌ను, అతనితో పాటు చిక్కిన తోడుదొంగల్ని వదిలిపెట్టాడు. అయితే ఈ 'పెద్దమనిషి' ఇవతలకు వచ్చిన అరగంటలోనే తన మామూలు దారి అనుసరించాడు.

జాగీరు ప్రాంతంలో వున్న మిర్యాలపెంట క్యాంపు చుట్టూ నలభై గ్రామాలకు నరకప్రాయంగా తయారయింది. ఇక్కడున్న నలభైమంది మైసూరు సిపాయిలు ప్రజల్ని హింసించడంలో, చంపివేయడంలో సిద్ధహస్తులు. లింగ

య్యను వాళ్ళకు బుద్ధిచెప్పమని కబుర్లు దొంతర్లుగా వచ్చి పడ్డాయి.

రాత్రి దళం బయలుదేరి ముప్పై మైళ్ళు నడిచి క్యాంపు తెల్లవారుజామున చేరింది. కాళ్ళు పీక్కుపోతున్నాయి. సరిగా అన్నం లేక వారం రోజులయింది. స్నానం చేయడానికి నీళ్ళు లేక ఒక్కొక్కళ్ళ వంటిమీద బండెడు మట్టి కప్పవేసింది.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ..." దళం నాలువేపుల మాటు కాసి క్యాంపుమీద దాడిచేసింది. క్యాంపు సెంట్రీ పడ్డాడు. క్యాంపులోవున్న మైసూరు సైనికులు చెల్లాచెదురై గుంతల్లో పడి కాలుస్తున్నారు ప్రజలంతా ఆనందంతో పరవళ్ళు తొక్కుతున్నారు.

"ధన్ ధన్ ధన్ ధన్ ..." మిల్టరీ గోతుల్లో పడుకొని గురిలేకుండా, ఎటు కాల్చేది తెలీకుండా కాలుస్తూంది.

"ఠన్ ఠన్ ఠన్ ఠన్ ..."

"ధన్ ధన్ ధన్ ధన్..."

సంకుల సమరం సాగుతోంది. ఇరువైపుల తిట్టుకుంటున్నారు పెద్దగా. దళం ఒక్క దెబ్బ కాలిస్తే మిల్టరీ వంద దెబ్బలు అడ్డంపెట్టి కాలుస్తూంది. లైటు బాంబులు వేస్తూంది.

"ఆ...అబ్బా...ఊ..."

"హా...హూ...అ...బ్బా"

మిల్టరీవాళ్ళు ఒకడి తరవాత ఒకడు ఇద్దరు చచ్చారు.. నలుగురు తీవ్ర గాయాల పాలయ్యారు...విపరీత భయం ఆవ

హించింది... మొదటంత దుడుకుగా కనీసం కాల్పులుకూడ చేయలేక పోతున్నారు... కాని సమరం కొనసాగుతూనే వుంది... తెల్లారింది... పొద్దుపొడిచింది .. బారెడు పొద్దు.. మధ్యాహ్నం .. దళానికి మాటుల దగ్గరకు ప్రజలు అన్న పానీయాలు తెచ్చి యిస్తున్నారు. ఖుల్లరీకి కాల్చే వోపిక, కోరిక, తీరిక, ధైర్యం అంతరించాయి. మంచినీళ్ళు యిచ్చే, తెచ్చే, దిక్కు లేదు. నిరుత్సాహంతో, నిస్పృహతో ఏ గోతిలో పడుకున్నవాళ్ళు ఆ గోతిలోనే దేవుడిమీద భారం వేసి పడుకున్నారు. ఆయుధాలు మాత్రం ఆశలు వదిలిన రోగి విషం పుచ్చుకున్నట్లు చేతుల్లో జాగ్రత్తగా పట్టుకొని ప్రాణ మన్సులో వుంచుకున్నారు. ఎనిమిది గంటల పోరాటం అంటే మాటలా మరి!

లింగయ్యదళం క్షేమంగా, దిగ్విజయంగా జయ ధ్వానాలు చేస్తూ నినాదాలిస్తూ తిరోగమించింది. ఈ దెబ్బతో మైసూరు పోలీసు జండా లేవబీకింది.

## IV

లింగయ్య యూనియన్ ప్రభుత్వం ముక్కుకు తాడుగట్టి కళ్ళకు గంతకట్టి ఆట ఆడిస్తున్నాడు. ఏడిపిస్తున్నాడు. ఈ ముగతాడు తెంచుకోడానికి, చేధించుకోడానికి, తిరిగి లింగయ్యమీద పడి కసి తీర్చుకోడానికి ప్రభుత్వం విశ్వ ప్రయత్నం చేస్తూంది. కాని లాభం లేకుండా వుంది. మానుకోట, ములుగు, మంథెన తాలూకాలు లింగయ్య

శౌర్యం, ధైర్యం, పేరు విస్తరించాయి. అగ్నిప్రవాహంలాగా ఆయన సూర్యాపేట సరిహద్దునుంచి గోదావరిదాకా పాకుతున్నాడు, ప్రవహిస్తున్నాడు. అవిచ్ఛిన్నంగా, అవిఘ్నంగా ఆయన ప్రచారం, పార్టీ మార్గం, ఉద్యమం—అఖండ గోదావరిలాగా వేయి పాయలై పొంగులు వారుతూన్నాయి. అయితే ప్రభుత్వం ఆశలు వదులుకుని వూరుకోలేదు. తన వద్దనున్న సమస్తమైన ఆయుధాలు, ఎరలు, ఎత్తులు, కుట్రలు, కుతంత్రాలు, ద్రోహుల్ని ప్రయోగిస్తూంది.

ఈ మధ్య కూడలిలోనే మరో విచిత్ర సంఘటన జరిగింది. దాని నిక్కడ యథాతథంగా పొందుపరుస్తున్నాను. ఉదయం ఎనిమిది గంటలకే లింగయ్య దళం మీటింగు పెట్టింది. ప్రజలు చుట్టూ వూళ్ళనుంచి గుంపులు గుంపులుగా కదిలి వచ్చారు. లింగయ్య మాట్లాడాడు. మరో కామ్రేడ్ మాట్లాడుతున్నాడు. నిశ్శబ్దంగా జనసందోహం వింటూంది. ఇంతలో ఒక రైతు పరుగెత్తుకుంటూ వచ్చి "మిల్టరొచ్చి వూరు చుట్టేసిందే లింగన్నా! వో ఇనకేత్తే రాలకుండా వుంటారు..." అన్నాడు.

ఈ వాక్యం పూర్తిగా వినకముందే "ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..." శత్రుతుపాకి కాల్పులు వినపడ్డాయి. కొన్ని గుళ్ళు అప్పుడే సభమీదుగా, దగ్గరగా దూసుకపోతున్నాయి.

"సోదరీ సోదరులారా! మీరేం భయపడవద్దు వాళ్లు ఎంతమంది వచ్చినా, ఎంత పెద్ద ఆయుధాలు దించినా మనకేం చేయలేరు. మనం న్యాయంకోసం పోరాడు

తున్నాం! న్యాయంకోసం ఆయుధం పట్టాం. వాళ్ళు అన్యాయం, అక్రమం, అబద్ధం పరిపాలన సాగాలని పోరాడు తున్నారు. అంచేతే వాళ్ళ ముఖాలమీద బండిచక్రమంత అక్షరాలతో "బలమి మా గమ్యం" అని రాసివుంది. అంచేతే మనం గెలుస్తాం! సత్యం జయిస్తుంది. మీరంతా జాగ్రతగా తప్పుకోండి. ఇటూ-అటూ చెదురుగా పరుగెత్త వద్దు. ఇళ్ళలోకెళ్ళి వుండండి. తుపాకి గుళ్ళు పైకి వస్తుంటే చట్టున బోర్లా పడుకోండి. ఊఁ, తొరగా వెళ్ళిపోండి..." అని లింగయ్య ప్రజలకు గుక్క తిప్పుకోకుండా విజ్ఞప్తి చేశాడు.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్..." శత్రు తుపాకి గుళ్ళు నిప్పులజల్లులు వెదజల్లుతున్నాయి.

ప్రజలు తప్పుకుంటున్నారు. ఇళ్ళల్లోకి పరుగులిడు తున్నారు. పిల్లాజల్లా భయంతో కేకలెడుతుంటే సముదా యిస్తున్నారు. కాని వాళ్ళ హృదయాంతరాళంలో ఒక్క సంశయం, సందేహం తలెత్తి పీడిస్తూంది. లింగయ్యమీద అచంచలమైన విశ్వాసం వుంది. పిడుగులు దాడిచేసినా తప్పుకుంటాడనే నమ్మకం వుంది. అయితే యివాళ తప్పు కుంటాడనే ఆశ వాళ్ళకు లేదు. పది వ్యానులతో, పెద్ద ప్లానుతో దిగిన మూడువందల మంది మిల్టరీ, గూర్ఖాలు, సిక్కులు, రాజపుట్ సైనికులను జయించి బయటపడటం కల్ల అనిపిస్తూంది. అదీ పగలు-పట్టపగలు. ఎలా తప్పు కుంటారు అందుకే అందరూ తమ ప్రియతమ నాయకుడేమవు తాడోనని దిగులుపడి ముఖాలు ఇంతవి చేసుకున్నారు.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..." శత్రువు నలువైపుల కాలుస్తూ దళాన్ని పద్మవ్యూహంలో పడేసి నొక్కడానికి ప్రయత్నిస్తున్నాడు.

"కామ్రేడ్స్ శత్రువు పెద్దపెట్టున దాడిచేశాడు. మన అజాగ్రతవల్ల రక్షణ స్థానాలు ఆక్రమించి వూరు నాలుగు వైపులనుంచి వత్తుకొని వస్తున్నాడు. మనల్ని తుడిచెయ్యడానికి తన మిల్టరీ శాస్త్రం, వ్యూహం, అనభవం, ఆయుధ బలం అన్నీ సమ్మిళితంచేసి సంధిస్తున్నాడు. మనకిది పరీక్షా సమయం. ఈ ప్రమాదంనుంచి బయటపడి పార్టీ ప్రతిష్ట నిలపాలి. ప్రజల మనోనిబ్బరం కాపాడాలి. మన జండా తల దించకుండా చూడాలి. ఒక్కసారి లెనిన్ సమయస్ఫూర్తి, స్టాలిన్ వుక్కుగుండెలు, సుందరయ్య చొరవ మననం చేసుకోండి. పరాజయం ఎరగని ఎర్రజండామీద మనచేత్తో కళంకం అద్దొద్దు. పదండి! విజయం మనది! వీరులం మనం. ఆయుధాలు తీసుకొని దూకండి. శత్రువును హతంచేసి బయట పడదాం. విప్లవం వర్ధిల్లాలి" అంటూ లింగయ్య దళంతోసి సింహాగర్జన చేస్తున్నాడు. ఆజ్ఞాపిస్తున్నాడు.

దళం ఎదురు కాల్పులు ఆరంభించింది.

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..."

ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్..."

రెండువేపుల కాల్పులు భీభత్సంగా సాగుతున్నాయి. కూడలి గ్రామం తీవ్రంగా కంపిస్తూంది.

ఐదు నిమిషాలలో దళం క్షేమంగా తప్పుకుంది. ముగ్గురు గూర్ఖాలు చచ్చారు. నల్గురు రాజపుట్, సిక్కు

సైనికులు తీవ్రంగా గాయపడ్డారు. మిల్టరీ కళ్ళు తేలేసి వచ్చినదారి పట్టింది. "ఇంతసేపు ఎక్కడున్నావు సత్యం? మేమంతా వచ్చి పావుగంటయితే?" అడిగాడు లింగయ్య అప్పుడే దళంతో కలిసిన సత్యాన్ని. దళం మిల్టరీని తప్పికొని కూడలి వూరి బయట ఈదుల్లోకి చేరింది.

"నేను తప్పుకొని వస్తుంటే, బాగా గురిచూసి నన్ను కాల్చబోయి, నా సైన్‌కుపెట్టి కొట్టాడు ఒక పంజాబు ఘనుడు. ఆ సైన్ ఒక యింట్లో దాచిపెట్టి డ్రెస్ విప్పి, మామూలు బట్టలు కట్టుకొని ఆ యింట్లో బరిగొడ్ల తోలుకొని మిల్టరీ మధ్యగానే వచ్చాను. పాపం! నన్ను గొడ్లకాపరి అనుకున్నారు. అందువల్ల కాస్త ఆలస్యం అయింది" అంటూ దళసభ్యుడు సత్యం నవ్వుతూ చెప్పాడు.

"లక్ష్మయ్య ఇంకా రాలేదేం?" అని లింగయ్య చుట్టూ పారచూస్తున్నాడు.

"అదుగో లింగన్నా లక్ష్మయ్య మేకలు తోలుకొని వస్తున్నాడు. ఎంత బాగా పగలే మిల్టరీ కళ్ళల్లో కారంకొట్టి వస్తున్నాడో చూడు" అంటూ మరో కామ్రేడ్ మేకలు తోలుకొస్తున్న లక్ష్మయ్యను చూపించాడు.

అంతా ఆహ్లాదంగా దళ కేంద్రంకు బయలుదేరారు.

* * *

లింగయ్యను గుండాల జోను కమాండరుగా తీసుకున్నారు. ఆయనకింద యిప్పుడు రెండు దళాలుంటున్నవి. ఈ రెండు దళాలు తనే వీరాధివీరులతో నిర్మించాడు.

అనేక ధాడుల్లో పాల్గొన్నాడు. ఎన్నోసార్లు మిల్టరీని

తరిమేడు, తప్పుకున్నాడు. అడవి ప్రాంతంలో ప్రతి నాల్గు మైళ్ళకు ఒక క్యాంపు పెట్టారు. ఈ క్యాంపులను అదుపు లోకి తెచ్చాడు.

లింగయ్య—నాగయ్య అనే పేరుతో ప్రజలకు కన్న తండ్రి అయ్యాడు. ప్రభుత్వానికి బద్ధ శత్రువయ్యాడు.

శత్రువు అనేక వ్యూహాలు లింగయ్య చుట్టూ పన్ను తున్నాడు. దళాలకు అన్నపానీయాలు అందకుండా తీవ్ర నిర్బంధం అమలు జరుపుతున్నాడు. దళాలు చెప్పరాని అవస్థలు పడుతున్నాయి. లింగయ్య నానా కష్టాలుపడి, తిండి సంపాదించి కన్న తండ్రిలా దళాన్ని పోషిస్తున్నాడు. దళాలకు లింగయ్యమీద అమిత అభిమానం, గౌరవం, ప్రేమ, విశ్వాసం ఆయనన్న నెత్తినెట్టుకొని పూజిస్తున్నాయి ఎక్కడ దూకమంటే అక్కడ దూకడానికి సిద్ధంగా వున్నాయి.

తిండికి కటకటలాడుతుంటే గొడుగుబండ వాళ్ళకు కబురుచేశాడు. వాళ్ళు యిద్దరు వచ్చి ధాన్యం, వుప్పు, పప్పు తెస్తాం అని డబ్బు తీసుకొని పోయ్యారు. డబ్బు తీసికెళ్ళి పది హేను రోజులు పైనవుతున్నా వాళ్ళ అజ, పజా లేదు. వాళ్ళెందుకు రాలేదో తెలుసుకుందామని లింగయ్య కొరియరును వెంటబెట్టుకొని గొడుగుబండ వెళ్ళాడు. ఈవూరు చుట్టూతా క్యాంపులున్నాయి. ఇటు కరుకగూడెం, అటు అనంతారంలో మహా బద్మాష్ క్యాంపులున్నాయి. ఆయన వాళ్ళను లెక్కచేయకుండా మూడురోజులక్కడే వున్నాడు. వాళ్ళు తెచ్చాం, ఇంకా కొన్ని తెస్తున్నాం. అన్నీ కలిపి యిచ్చి పంపిస్తాం' వుండమంటున్నారు. కొందరు గ్రామ

మిత్రులు 'ఉ ద్దొద్దు, కళ్ళండి! వీళ్ళు ద్రోహులయినట్టుంది' అని చాటుగా సలహా చెప్పారు. లింగయ్య విన లేదు. తనకు ద్రోహం చేస్తారా? లేదు; ఎప్పుడలా జరగదు. అదీ ధాన్యం తీసుకోకుండా వెళితే మూడే దళానికి ఏం పెడతాను? ఎలా గయినా ధాన్యం సంపాదించుకొని పోవాల్సిందే! అని తీర్మా నించుకున్నాడు

ఉదయాం పదిగంటలయింది ధాన్యం నష్టయి చేస్తా మన్న వాళ్ళతో పూరిబయట చింత చెట్టుకింద కూచుని ఆషా మాషీ కబుర్లు లింగయ్య చెప్పతున్నాడు. వాళ్ళు మొదట యిద్దరు మాట్లాడుతూ కూచున్నారు. తరువాత యిద్దరు వచ్చారు వడ్లు దంపిస్తున్నామని, కందిపప్పు చేయిస్తునామని, ఫుప్పు, కారం, బెల్లంకోసం మనిషిని పంపామని చెపు తున్నారు. మరో యిద్దరు మనుషులు వచ్చి లింగయ్య ఇరు వేపుల కూర్చున్నారు. వందగజాల దూరంలో లక్ష్మయ్య సెంట్రీ వున్నాడు. లింగయ్య సైన్ లక్ష్మయ్య కిచ్చాడు. ఆయన సైన్ తో సెంట్రీ జాగ్రత్తగా చూస్తున్నాడు. ఇంతలో మరొకడు వచ్చి లింగయ్య దగ్గర కూర్చున్న మనుషు లతో ఏదో సైగ జేశాడు హఠాత్తుగా వెనకున్న ఇద్దరు మను షులు లింగయ్యమీద పడి గొంతు పట్టుకొని, వీపుమీదపడి పడేశారు. ముదున్న యిద్దరు కాళ్ళు లేవకుండా పట్టుకొని పైన కూర్చున్నారు. ఇరువేపులున్న యిద్దరు మనుషులు చేతులు గట్టిగా నొక్కి పట్టుకున్నారు.

"తొరగా రాండి దొరో, వీడు పోతాడు, మేం పట్టు కున్నం! తొందరగా రాండి దొరో" అని పెద్దగా బొబ్బపెట్టి

దగ్గర కొచ్చిన మిల్టరీని లింగయ్యను పట్టుకున్న ద్రోహులు పిలుస్తున్నారు.

లింగయ్య పై కూచున్న వాళ్ళను ఒక్క తూపుతో కిందకు తోశాడు. పైనపడి కలబడుతున్న ద్రోహుల్ని విసిరి విసిరి అవతల పారేస్తున్నాడు. "కామ్రేడ్ లక్ష్మయ్యా! ఆ స్టెన్ యిటు యివ్వు. ఇటు చూడు" అని లింగయ్య కేకలు పెడుతున్నాడు. ఈ కేక పూర్తిగా లక్ష్మయ్య వినక ముందే ద్రోహులు గండ్ర గొడ్డలితో లింగయ్యను నరికారు. ఒకటి, రెండు, మూడు, నాలుగు...అబ్బా...ఓ! లింగయ్య తల తెగి దూరంగా ఎగిరిపడుతూంది. మొండెం ధారాపాతంగా రక్తవాహిని చిమ్ముతూంది. కొండంత లింగయ్య క్షణంలో తుండాలు తుండాలు అయిపోయాడు.

ఈ ద్రోహులు ప్రభుత్వం అంచాలు చాలకాలంనుంచి లింగయ్యను పట్టిస్తామని మేస్తున్నారు. లింగయ్యతో సంబంధం పెట్టుకొని ఈపని చేశారు. మిల్టరీ అప్పుడే లింగయ్య దగ్గరికొచ్చింది. మిల్టరీ దగ్గరకు రాగానే ఒక ద్రోహి వచ్చి తతిమ్మా ద్రోహులి పట్టుకోమని సైగచేశాడు. లక్ష్మయ్య లింగయ్యను పట్టుకోవటం చూడగానే లింగయ్య దగ్గరకు పరుగెత్తి రా ప్రయత్నించాడు. మిల్టరీ ఆయన్ను చుట్టేసి బంధించింది. కళ్ళారా లింగయ్య దారుణ మరణం చూస్తున్న లక్ష్మయ్య అక్కడుండ లేక పోయాడు. మిల్టరీని ఛేదించుకొని పారిపోతున్నాడు. మిల్టరీ వెంటబడ్డది విపరీతంగా కాలుస్తున్నారు. పరుగెత్తుతున్నాడు. వెంటబడ్డారు. కిందపడుతూ, లేస్తూ చచ్చి సగమయి పదిమైళ్ళ దూరంలో వున్న దళం

దగ్గరికెళ్ళి, జరిగిన విషాద సంఘటన చెప్పి, స్పృహతప్పి పడిపోయాడు.

కాామ్రేడ్సంతా వలవలా వాపోయారు. అందరి కళ్ళు కరిగి ప్రవహిస్తున్నాయి. ఎర్ర సైనికులు కన్నీళ్లు ఎలాంటివో అసలు ఎరగరు. తమ ఆప్తుణ్ణి, ఆత్మీయుణ్ణి, సహచరుణ్ణి, నాయకుణ్ణి, తండ్రిని, తల్లివంటి ప్రేమమూర్తిని పోగొట్టుకున్నప్పుడు వారికి తెలీకుండానే కట్టలు తెంచుకుని దుఃఖం పొంగి పొరిలింది. కామ్రేడ్సంతా తోక తొక్కిన త్రాచుల్లాగా లేచారు. పగతో భయంకరంగా, ప్రమాద అవతారాలుగా లేచి ఆయుధాలు పుచ్చుకొని దామెరతోగునుంచి గొముగుబండ పరుగెత్తుకుంటూ వెళ్ళారు.

కనీసం శవం అయినా దొరుకుతుందేమో, సైనిక మర్యాదలతో అంత్యక్రియలు చేద్దామనుకున్నారు. శవం లేదు! కల్లం వెడల్పు, మోకాటిలోతు తడిసి బురద—బురద అయిన లింగయ్య రక్తం మాత్రం వెక్కిరించింది. అక్కడ కాకులు, గద్దలు, కుక్కలు పడి నాకుతున్నాయి. దీంతో కామ్రేడ్స్‌కు శివమెక్కింది.

వంద దాడుల్లో శత్రువును జయించిన, వెయ్యి శత్రు పద్మ వ్యూహాలు తప్పుకున్న, వేలాది ఎకరాలు ప్రజలకు పంచిన, మూడు తాలూకాలలో ప్రభుత్వం రొమ్ముపట్టి నిలేసి చారెడు మంచినీళ్ళు తాగించిన జగదేక వీరుడు లింగయ్య ఆత్మను — ద్రోహుల పచ్చిరక్తంతో దళం అభిషేకం చేసింది! శాంతిగీతం చదివింది!!



# రెడ్లవాడ దళం

మిట్టమధ్యాహ్నం కాళ్ళుకాలే యెండ. కళ్ళపండగగా పచ్చని పొలాలు, పొలాలనిండా దండిగా కంది. ఆముదాలు, పెసర, నువ్వు, జొన్న, పత్తి దట్టంగా పెరిగి, వరిగి మందంగా సౌరభం కక్కుతున్నాయి. మినమినలాడుతున్న చేలు నిండు చూలాలులా గంభీరంగా, మౌనంగా, నిశ్చలంగా వున్నాయి.

రెడ్లవాడ పొలిమేర చేలు — ఈ యేడు మహాబాగా పండాయి. కందిచేలు విరియకాశాయి. అడివిలాగా అల్లుకుపోయాయి. నాలుగామడ నడిచి వచ్చిన దళం, ఇప్పుడే చిక్కంగా పెరిగి పెనవేసుకున్న కందిచేలో విశ్రాంతి తీసుకునేందుకు వచ్చింది. అలిసి, నిద్రతూలి, సొమ్మసిల్లి క్షణంలో దళం మైమరచి నిద్రపోయింది.

అకస్మాత్తుగా ఆకాశం విరిగిపడే గగ్గోలు.

"హే... హేయ్ ... హే కాఫర్ ... బద్మాష్ ... ఊకో,......హైరో......మాంకే లవడా......హైరో..." పెద్దగా కేకలు.

"రజాకార్లు, మిల్టరీ! కామ్రేడ్స్ లేవండి! హఠాత్తుగా దళం లేచింది. కమాండరు హెచ్చరిస్తున్నాడు. అయితే ఎనభై మంది రజాకార్లు కత్తులు, కటార్లు, బాకులు, బరిసెలు, బానాకర్రలు, రైఫిళ్ళు, బర్మార్లు, హెన్రీమార్టిన్ తుపాకులు

పుచ్చుకొని వికటాట్టహాసం చేస్తూ కందిచేను నాల్గువేపుల పత్తుగా చుట్టేశారు. కాల్పులు చేస్తున్నారు. గగ్గోలు పెడుతున్నారు.

ఎటు చూసినా రజాకార్లు; ఎటు వెళ్దామన్నా బయలు ప్రదేశం! ఎక్కడా రక్షణ కనబడటంలేదు. ఉన్న రక్షణ స్థానాలు ఆక్రమించి, మాటుకాసి రజాకార్లు దెబ్బ తీస్తున్నారు.

దళం సంకీర్ణపథంలో చిక్కుకుంది. ఈ చిక్కునుంచి బయటపడే బాట కనపడటం లేదు. శత్రువు చాల బలంతో, ప్లానుతో, మంచి ఆయుధాలతో దాడిచేశాడు. ఏమీ చేయాలో పాలుపోవడంలేదు. ఐదుగురు కామ్రేడ్స దగ్గరా బర్మారులే వున్నాయి. అవి సరిగా పేలిచావవు. ఒకసారి కాల్చరా, రెండోసారి కాల్చడానికి పదినిముషాలు పడుతుంది. ఈ లోపే శత్రువు పైన పడతాడు.

"ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం... ఠాం..."

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..."

రజాకార్లు ఈలలు వేస్తున్నారు. వెర్రికేకలు పెడుతున్నారు. బండబూతులు తిడుతున్నారు. కాల్పులు చేస్తున్నారు. పైకి దూకి వస్తున్నారు...

"కామ్రేడ్స! ఇహ ముందు వెనక లాలోచించి లాభం లేదు. వెంటనే కాల్చండి! జాగ్రత్తగా తప్పుకోండి! శత్రువు పరమ నీచుడు. వాడి చేతికి దొరకొద్దు" కమాండరు ఆజ్ఞాపించాడు.

"ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం..."

దళ కామ్రేడ్స్ ఐదుగురూ ఒక్కసారి బర్మార్లు పేల్చారు. శత్రువు ఒక్క అడుగు తగ్గాడు. దెబ్బ తిప్పుకున్నాడు. కాని వాళ్ళకు వీళ్ళ పని తెలుసు. ఉన్నది బర్మారులేనని, అవి ఇహ పనికిరావని ముందే యెరుగుదురు. అంచేత కుప్పించి దళంమీద చట్టుదూకారు. దళం చెల్లా చెదురయింది రజాకార్లు కోలాహలం చేసి దళాన్ని వేటాడుతున్నారు. దళకామ్రేడ్సంతా తలోవేపు పరుగెడుతున్నారు. రజాకార్లు పురుకులు, పరుగుల్తో దళ కామ్రేడ్సును వెంటాడి, వేధించి, దారుణంగా వధిస్తున్నారు.

"అబ్బా...అఁ...వో లంజకొడుకుల్లారా ఆయుధం యిచ్చి పోరాడండిరా" అంటూ రైఫిలు దెబ్బతో పడిపోయిన అల్లోరు మూల్గుతున్నాడు. నల్గురు రజాకార్లు పైన పడిపోయిన అల్లోరు రొమ్ముల్లో బరిసెతోకుమ్మి అటు-ఇటూ బరిసె ఆహ్లాదంగా తిప్పుతున్నారు. ఇంకొకడు గండ్రగొడ్డలితో నడుముమీద వేశాడు. మరొకడు గొంతులో కత్తి దించి తిప్పుతున్నాడు. క్షణంలో అల్లోరు తునకలై, చిదపలై, చితికి నేలకలిశాడు. నెత్తురు ధారలయి ధరణి తడుపుతున్నాయి. పచ్చని గడ్డి తడిసి ఎర్రని ముద్దయింది. అల్లూరు అవయవాలు నేలమీద పడి తన్నుకుంటూన్నాయి. నల్గురు రజాకార్లు యింకా ఆయన్ను హింసిస్తూ సంతోషిస్తున్నారు.

నలువేపుల పరుగెడుతున్న కామ్రేడ్సును గుంపులు గుంపులుగా రజాకార్లు వెన్నాడుతున్నారు. చుట్టూ పొలాలలో రైతులు భీతావహంతో, బాధతో వాపోతున్నారు. దళ

కామ్రేడ్సంతా చెట్టుకొకరు, చేనుకొకరు; గుట్టకొకరు, మిట్టకొకరు అయ్యారు. అంతా భీభత్సంగా, భయంకరంగా వుంది. ఎక్కడ దొరికిన వాళ్ళ నక్కడే. రజాకార్లు భయానకంగా బరిసెలతో కుమ్ముతున్నారు.

ఉరుకుతున్న ఉప్పల వెంకటయ్య వెన్నులో బరిసె దించారు. "అమ్మా...అబ్బా...ఎంత నీచమయిన పందులురా మీరు! నిరాయుధుణ్ణి—అదీ సాటి సైనికుణ్ని బరిసెతో పొడుస్తారా..." అంటూ పడిపోయాడు. నెత్తురు పాయలు జలజల జారుతున్నాయి. "క్యారే కాఫర్...తేరి యమ్మ గాం..." బండబూతులు కూస్తూ రజాకార్లు వెంకటయ్య కణతలు, మూడు, కాళ్ళు చితకగొడుతున్నారు.

ఎటువేపు చూసినా రజాకార్లు కామ్రేడ్సను తరిమి తరిమి వధిస్తున్నారు.

"ఢాం ఢాం......"— హఠాత్తుగా తుపాకీదెబ్బ. "ఆ(...ఆ(...మరగయా అ...ల్లా..." ఒక కిరాతక రాజాకారు కమాండరు కెవ్వున కేకేసి, మనిషెత్తు ఎగిరిపడి మరణించాడు. వీడు పారిపోతూన్న కామ్రేడ్ నాయుడు వెంట పడ్డాడు. వీడితోపాటు వెంటాడిన గుంపు పరుగెత్తలేక వెనక్కి తగ్గింది. నాయుణ్ణి మూడుమైళ్ళు తరిమాడు. పోయిపోయి నాయుడు—దారిలోనే బర్మారుకు ముందుకూర్చుకొని—వురుకుతూ ఒక కయ్యలో దిగి పైకురికొచ్చే రజాకారు కమాండరు రొమ్ముకు గురిపెట్టి కాల్చాడు. దెబ్బకు కింద పడ్డాడు. "మనుషుల్ని చంపడం తప్ప రెండోది తెలియని నీచుడా! ఇంతకే ఖుంచిబావు అవవసరం..." అంటూ

నాయుడు రజాకారు కమాండర్ను సమీపించి మళ్ళా బర్మారుతో ఒక్క పెట్టు పెట్టాడు. తలపెంకు లేచిపోయింది. వాడు పడిపోగానే క్రోధోన్మత్తులయి రజాకార్లు వురికి వస్తున్నారు. నాయుడు క్షేమంగా తప్పుకున్నాడు.

“ఆఁ...ఓ...అ...మ్మా...” అంటూ కోరియుడు గొడ్డలి దెబ్బలతో ఒకవేపు పడిపోయాడు. రజాకార్ల గుంపు పైనబడి చిత్రవధ చేస్తున్నారు. పొట్టలో బాకు దించి కెలుకుతున్నారు. గొంతులు నరికేశారు. చేతులు మొండి పడ్డాయి. అబ్బా!...నెత్తురు ముద్ద!

యాకయ్య వెంటబడ్డ గుంపు విజయం సాధించ లేకుండా వుంది. వెంటాడుతున్న గుంపుకు దొరకకుండా విపరీతమైన వేగంతో యాకయ్య పరుగెడుతున్నాడు. కాని గుంపు నిరాశతో నీళ్ళుగారి వెనక్కి మళ్ళలేదు. కాలుస్తు న్నారు, కూస్తున్నారు, కేకలేస్తున్నారు. వెంబడిస్తున్నారు. ఒక రజాకారు మూర్ఖుడు చావు-బ్రతుకులు మరిచి పరుగెడుతున్నాడు. ఒకే పట్టున రైఫిలు కాలుస్తున్నాడు. యాకయ్య రైఫిలు దెబ్బలు తప్పుకుంటున్నాడు. కాని రజాకారు సమీపించాడు. తాను బాగా అలిసి పరుగెత్త లేకుండావున్నాడు. “ఠాం...ఠాం...ఠాం...ఠాం...” వరసన నాలుగు గుళ్ళు యాకయ్య తల, వీపు, తుంటి, భుజంలోపడి దూసుక పోయాయి. రక్తం మడుగు కట్టింది! యాకయ్య ప్రశాంతింగా కళ్ళు మూశాడు. చనిపోయిన కామ్రేడ్ను రజాకార్లు రాక్షసంగా చిత్రవధ చేస్తున్నారు!

రజాకార్లు నాయకుణ్ణి పోగొట్టుకున్నందుకు క్రుద్ధు

లయ్యారు. కుంగిపోయారు, కుతకుతలాడారు. చనిపోయిన ముగ్గురు కామ్రేడ్స్ శవాలు, ప్రాణాలతో వున్న క్షతగాత్రుడయిన వెంకటయ్యను కత్తిపాక గుట్ట కింద కాడుపేర్చి కాటిలో కుదేసి కిరసనాయిలు పోసి నిప్పుపెట్టారు. ధగధగ మంటలు నాలుకలు సాచాయి: ఘనఘన రజాకార్లు వికటాట్టహాసం, కోలాహలం, జయధ్వానం చేస్తున్నారు.

మంటలు శవాల నంటుకున్నాయి... ప్రాణాలతో వున్న వెంకటయ్య బయట కెగిరిపడ్డాడు. కాటిచుట్టూ చేదుగా నృత్యం చేస్తున్న రజాకార్ల కళ్ళు మండిపోయాయి. విలవిలలాడుతున్న వెంకటయ్య కాళ్ళు ఒకడు, తలొకడు పట్టుకొని యిద్దరు రజాకార్లు ఆయన్ను కాట్లో విసరుతున్నారు.

"నన్ను వదిలిపెట్టండి. లేదా కాల్చి, చనిపోయిన తరవాత కాట్లో వేయండి ప్రాణాలతో కాట్లో వేయడానికి ప్రయత్నించారా, మీ ప్రాణాలు తీయకుండా చావను..." అంటున్నాడు. వాళ్ళ చేతుల్లో నలిగిపోతూ వెంకటయ్య గావుకేకలు పెడుతూ.

ఒక్కసారి రజాకార్లంతా "హాహాహాహా" అని విరగబడి నవ్వారు వెంకటయ్యను వేయివిధాల పరిహసించారు. నగం చచ్చి, తమ చేతుల్లో చిక్కి, కాటికాళ్ళు సాది కూడా తమను చంపుతానని బెదిరిస్తుంటే వాళ్ళకు నవ్వొచ్చింది. పట్టరానంత నవ్వొచ్చింది.

"తీయరా బద్మాష్, చేతనయితే మా ప్రాణాలు తీయ్! అల్లా నిన్ను ప్రాణాలతో బలిస్తేకాని ఆనందించడు. నవాబ్ రక్షా సిత్రు ప్రాణాలతో వుండికావని ఖంటకాని నంతో

పించడు. మా కమాండన్ను చంపిన ఘాతకుల్ని ఏం చేసినా కసితీరదు...వేయండిరా, కాల్లో వేయ డి" అని రజాకార్ల ఉపనాయకుని ఆజ్ఞ.

"సరే మీ పని కానీయండిరా తుచ్ఛుల్లారా! ఒక్క కామ్రేడ్ని చంపితే, మిమ్మల్ని వందమందిని బలి తీసుకుంటే కాని ఆ కోరిక తీరదు. ఇప్పుడు మేం నల్గురం చనిపోతున్నాం! కసినం మీ ఇద్దరయినా చావాలి! ఒకడు చచ్చాడు! నా వంతు ధర్మాన్ని నేను నిర్వర్తిస్తాను. మిగిలిన కార్యభారం ప్రజలు, పార్టీ నెరవేరుస్తారు. చావులు, హింసలు, దోపిళ్ళు, మానభంగాలతో మీ రెన్నాళ్ళు పరిపాలిస్తారు! మీ పాలనకు, ప్రాణాలకు రోజులు దగ్గరపడ్డాయి. మీ అందరూ యిదే శిక్ష అనుభవిస్తారు. మీ గమ్యం శూన్యం! మీ భవిష్యత్తు ఆత్మ విధ్వంసం... కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్..." అంటూ వెంకటయ్య యెగిరిపడి గొంతుపట్టుకున్న వాడి పీక నోటితో అందుకొని పటపట కొరుకుతున్నాడు.

పక్కనే ముగ్గురు కామ్రేడ్స్ కాల్లో కరుగుతూ, మండుతూ, మాడుతూ నీలిమంటలు, కక్కుతున్నారు క్రోధంగా.

రజాకార్ల గుంపంతా వెంకటయ్యను లాగుతున్నారు, పీకుతున్నారు, బరిసెలతో పొడుస్తున్నారు, బాకులతో చేతులు, మెడ నరుకుతున్నారు. రైఫిలుతో బాదుతున్నారు. బలవంతంగా రెండుచేతులతో పట్టి లాగుతున్నారు. ఒళ్ళంతా బదాబదలయింది, వీలికలయింది, మాంసపు ముద్దయిపోయింది. కాని వెంకటయ్య ఆ రజాకారు కత్తుక వదలలేదు, వాడి

పీక తెగిపోయింది. వాడు, వెంకటయ్య యిద్దరూ ఒక్కసారే నేలకూలారు. తుది నిశ్వాసం వదిలారు! వెంకటయ్య ప్రతిజ్ఞ నెరవేరింది. కాట్లోకి పోయినా కమ్యూనిస్టులు శత్రువుల్ని సాధిస్తారని, జయిస్తారని రుజువు చేశాడు. చనిపోయిన వెంకటయ్యను అందరూ పైనబడి కోపం తీరేదాకా రక్కి, పీకి, గుద్ది, తన్ని కొట్టి — తరవాత కాట్లో పడేశారు. రజాకార్లు తమ కమాండర్ని, సహచరుణ్ణి తీసుకొని నల్గొండ స్టేషనుకు వెళ్ళిపోయారు. సూర్యుడు బాధతో చల్లబడి పశ్చిమ దిశకు జారాడు.

నలుగురు కామ్రేడ్స్ దిక్కు లేకుండా, కడసారి కన్నీటి బొట్టు చూడకుండా, జంతువులకంటే హీనంగా చనిపోయి, ఆ ఎడారి కాటిలో అదృశ్యమయి నాలుగు ఎర్రగులాబి పూలుగా అవతరించారు. ఆశ్చర్యంగా "మీ రెవరు? ఇక్కడున్నారే"మని ఎవరన్నా అడిగితే ఆ పూలు మాట్లాడుతున్నాయి! మంచిగా సమాధానం చెపుతున్నాయి. నేవిన్న సంభాషణ ఇక్కడ రాస్తున్నాను.

## అల్లోరు

మాది రెడ్లవాడ. పాఖాల తాలూకా. నేను గమళ్ళ కులస్తుణ్ని. పుట్టి నేలపడ్డప్పటినుంచీ యేదో చాకిరిచేసి బతికాను. చాకిరియేగా మాకున్న ఆస్తి! చదువు, ప్రపంచం, దేశం తెలుసుకోవడానికి తీరికో, కోరిక వుండేది కాదు. ఆగర్భ దరిద్రులు పుట్టిన మురుగుగుంటలోనే మగ్గి మరణిస్తారు. అదే వాళ్ళ స్వర్గం-నరకం, సుఖం-దుఃఖం అన్నీనూ.

కాస్త యీడు రాగానే కల్లుగీత పనికి పోతూవాణ్ని. కల్లు తప్ప త్రాగేవాణ్ని! మా ఇళ్ళల్లో ఎన్ని కొట్లాటలు, తగాదాలు, తన్నుకోవడాలు, తిట్టుకోవడాలు, రక్తపాతాలు! అబ్బ వాళ్ళు జీవించడం లేదు. నరకంలో సుళ్ళు తిరుగుతున్నారు! అందులో నేనూ వకణ్ని వీటన్నిటికి కారణం యే అణా దగ్గరో, బేడ దగ్గరో పేచీ! ఇలా మేం చస్తుంటే మా మీద పెత్తనం చేయను, దోచుకోను కొంతమంది 'పెద్దలు' తయారయ్యే వాళ్ళు. ఎంత కష్టించినా వాళ్ళను సంతుష్టి పరచలేకపోయే వాళ్ళం. పన్నులు, మామూళ్ళు మర్యాదల పేర్లతో మా జీవిత కష్టార్జితం కొల్లగొట్టేవాళ్ళు.

సంఘం వూళ్ళోకి రాగానే అట్టడుగున పడిపోయిన ఆశలేచి, దుమ్ము దులుపుకొని తలెత్తి చివురించింది. రాత్రి పూట పాఠశాల కెళ్ళాను సంఘం సమావేశాల కెళ్ళాను. సారస్వతం చదవాలని, చదివి సుఖంగా జీవించాలని, సాటి సోదర ప్రజల జీవితాలు మార్చాలని సంకల్పించుకున్నాను. నిజంగా ఆ వూహ నా మనోవీధిలో అవతరించి, వూపిరి పోసుకుని ఆకారం ధరించినప్పుడు చెప్పరాని ఆనందంతో కంపించిపోయాను నాతోపాటు అనేకమంది కష్టజీవులు చదువ నారంభించారు. దీంతో గ్రామ పెద్దల కళ్ళు కారం మెక్కాయి. పటేల్, పట్వారీలు వళ్ళు తేళ్ళు పాకాయి. బ్రతుకంతా జీతగాళ్ళను, కూలీలను, రైతులను, అమాయకులను, అజ్ఞానులను దోచేవాళ్ళకు మేం బాగుపడటం గంగ వెర్రులెత్తించితే ఆశ్చర్యం లేదు. వాళ్ళు మామీద దాడి ప్రారంభించారు. వూళ్ళో కట్టుబాటు చేశారు. మాకేం

పుట్టకుండా, ఎవరూ పనికి పిలవకుండా చేశారు. ప్రభుత్వానికి మామీద తప్పుడు కేసులు పెట్టారు. ఎప్పుడు వీలు దొరుకుతుందా మింగుదామని పొంచివున్న ప్రభుత్వం ఇదే అదను అనుకొని మామీద నిర్బంధం ప్రారంభించింది. నైజాం ప్రభుత్వం చదువుకుంటున్న, సుఖంగా జీవించాలని కలలు కంటున్న, ప్రపంచం తెలుసుకోను తహతహ లాడుతున్న ఏది మంచో, ఏది చెడో అర్థం చేసుకోను యత్నిస్తున్న మామీద. అప్పుడే కళ్ళు తెరచిన మామీద ప్రభుత్వం చెప్పరాని నిర్బంధం ప్రయోగించింది.

ఒక్కసారి దేశం నలువేపుల పారచూశాం. తెలంగాణంతా నైజాం నిరంకుశత్వాన్ని ఎదిరించి పోరాడుతూంది. నైజాం నవాబు ఈ పోరాటం తట్టుకోలేక రజాకారు రాక్షసుల్ని ప్రజలమీద తోలాడు. వాళ్ళు వన్యమృగాలకంటే హీనంగా ప్రవర్తిస్తున్నారు. కనబడ్డ వాణ్ణల్లా చంపుతున్నారు. స్త్రీలను చెరుస్తున్నారు. ఆస్తి కొల్లగొడుతున్నారు. న్యాయం చెప్పాల్సివస్తే ప్రభుత్వం కాదు పరిపాలించేది...దోపిడిమూక ఆయుధాలు ప్రజల గుండెమీద ఆనించి నిరంకుశపాలన వెలగబెడుతూంది. ఈ నిరంకుశ హస్తాన్ని సంహరించను తెలంగాణాప్రజ ఆయుధాలు ధరించి సమరం ప్రకటించింది.

పార్టీ ప్రజల్ని ప్రతిఘటన కొనసాగించమనీ, తీవ్రతరం చేయమని పిలుపిచ్చింది. ప్రజలంతా — దరిద్రప్రజానీకమంతా పార్టీ జండాకింద ప్రతిఘటన సాగిస్తున్నారు.

ప్రజా వ్యతిరేకులు, ద్రోహులు, పీడకులు, ప్రభుత్వ పతాకం కింద చేరి ప్రజలమీద యుద్ధం ప్రకటించారు. నా వంతు త్యాగంచేయ నిశ్చయించుకున్నాను. పార్టీ దళాలు నిర్మించింది. నేను దళంలో చేరతానంటే అమ్మ, నాన్న కాళ్ళ వేళ్ళబడి వెళ్ళొద్దని ప్రార్థించారు. అప్పుడే కాపురాని కొచ్చిన భార్య కన్నీటితో నా వూహాల్ని, వుద్దేశాల్ని తడిపి నిర్ణయాన్ని మార్చుకోమని కోరింది. కాని జాతి శత్రువుల్ని, హంతకుల్ని హతంచేసే సంగ్రామం జరుగుతున్నప్పుడు–గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటం—పార్టీతో సంబంధం, పార్టీ మీద సానుభూతి వున్న నేను చేయకూడని పని అని పదే పదే నా ఆత్మ ప్రబోధించింది. పార్టీ పిలుపు అందుకోడానికి కృతనిశ్చయుణ్నయ్యాను. వూళ్ళో మిత్రులకు చెప్పాను. 'సరే' నన్నారు.

మేం అయిదుగురం కలిసి 'రెడ్లవాడ దళం' ఏర్పాటు చేశాం. మా తాలూకాలో నిజాం ప్రభుత్వం వెన్ను పూస తెగగొట్టాం. గ్రామాలలో పంచాయితీ ప్రభుత్వం స్థాపించాం. అవిచ్ఛిన్నంగా గ్రామరాజ్యం సాగిపోతుంది. ప్రజలు దురాక్రమణ దారుల భూములు, ఆస్థులు పంచుకొని సుఖంగా అనుభవిస్తున్నారు. పార్టీ పతాక పాఖాల తాలూకా ఆకాశమంతా వ్యాపించింది.

మా వూరి రజాకార్లు, ద్రోహులు, ద్రోహంచేసి నల్గొండ క్యాంపు రజాకార్లను పిలిపించి మామీద దాడి చేయించారు. గాఢనిద్రలో వున్నాం... మేం చనిపోయి నందుకు బాధ లేదు! ఎంచేతంటే అశేషమైన ప్రజానీకం,

అనంతమయిన పార్టీ — ఈ పీచుల్ని హతమారుస్తారనీ, ప్రజాస్వామిక ప్రభుత్వం స్థాపిస్తారనే నమ్మకం వుండికనక! పోరాటం ముందుకు తీసికెళ్ళండి! పార్టీ పతాక గగన వీధుల్లో రెపరెప లాడించండి.

## పుప్పాల వెంకటయ్య

మాది రెడ్లవాడ. కటిక బీదను. చౌకీదారు (గార్డు) వెంటజవాను (వాచరు)గా వుండేవాణ్ణి. చౌకీదారు (ఫారెస్టు గార్డు) అంటే అడవిప్రాంత ప్రజలకు సింహస్వప్నం. అక్కడ అతను నందంటే నంది, పంది అంటే పందిగా చెలామణి అవుతుంది. అతను చేసిన ఘోరాలు, దుర్మార్గాలు, దోపిళ్లు చెప్పడానికి వీలుండదు. నేను వాటన్నిటిలో భాగస్వామిని. ఇంకా నా తెలివి కొంత చేర్చి విపరీతంగా ప్రజల్ని ఏడ్పించే వాణ్ని. తప్పుడు కేసులు పెట్టి కోర్టుల కీడ్చేవాణ్ని. వీలైనన్ని విధాల పీల్చి పిప్పిచేసేవాణ్ని. పొద్దున్నే నా ముఖంచూస్తే అశుభం జరుగుతుందనుకునేవాళ్ళు. భూదేవి మోయలేనంత పాపభారాన్ని పోగుచేసి భరించాను. పార్టీని, ప్రజల్ని అవహించుకున్నాను, ద్వేషించాను.

రానురాను పార్టీ చేసేపని, సేవ, త్యాగం నన్ను ఆకర్షిచాయి. నే నెన్ని దుష్కృత్యాలు, దురాగతాలు చేస్తున్నానో సంఘం వాళ్ళు ఎత్తి చూపిస్తే బాధతో కుంగిపోయాను. సంఘం వాళ్ళు నా వృత్తి విప్పి చూపించినపుడు ఆ వికృతరూపం చూసి జడిసి కళ్ళుమూసుకున్నాను. సంఘం

మీద ప్రేమ, గౌరవం క్రమేపి వృద్ధిపొందాయి. నా సోదర ప్రజల్ని హింసపెడుతున్న ప్రభుత్వ వుద్యోగం చేయడం చాల కష్టమయింది. నా సహచరులపై సహోదరులపై యుద్ధం ప్రకటించిన ప్రభుత్వ శిబిరంలో నేనుండటం ఘోరం అనిపించి బయటికి వచ్చి పార్టీ పని చేస్తానన్నాను. కొన్నాళ్లు నన్ను పరీక్షించాక పార్టీ పని చేయమంది. మా వూరి దళంలో చేరాను. ప్రాణాలు తెగించి కర్కోటక నైజాం ప్రభువుతో పోరాడాను.

స్వాతంత్ర్య యుద్ధం జరుగుతున్నప్పుడు ఏ నిరంకుశ ప్రభుత్వ వుద్యోగికూడ ప్రజల పక్షం వహించకుండా, ప్రజలతో కలసి పోరాడకుండా వుండలేడు. నేను నా విముక్తి ధర్మాన్ని నిర్వర్తించాను. దళంలో వున్నంతకాలం ప్రజల కనుపాపగా, శత్రువుగొంతుమీది కత్తిగా వ్యవహరించాను.

మొన్నీ మధ్య మా దళాన్ని విద్రోహుల కారణంగా రజాకార్లు ముట్టడించారు. మా నలుగుర్ని ఘోరంగా చిత్రవధ చేశారు. తప్పుకున్న కామ్రేడ్ ముతెరాసు నాయుకు ఒక రజాకారు కుక్కను కూల్చివెళ్ళాడు. నేను చనిపోతూ నా చివరిసారి పార్టీ కార్యక్రమం పూర్తిగా నెరవేర్చాను. ఒంట్లో ఓపిక లేకపోయినా, వళ్ళంతా గాయాలతో కయ్య అయినా, రజాకారుగుంపు పైబడి ముక్కలు-చెక్కలుగా నరుకుతున్నా ఒక రజాకారు ముష్కరుని ప్రాణాలు నమిలి, చప్పరించి, వుమ్మివేసి సెలవు తీసుకున్నా. నేను ప్రేమించిన, పూజించిన ప్రజలంతా నా కొరత తీరుస్తారనే ధైర్యంవుంది.

నా మార్గాన్ని గమ్యం చేరుస్తారనే విశ్వాసం వుంది. నా జెండా నేలబడకుండా, ప్రాణాలొడ్డి పరిరక్షిస్తారనే ఆశ వుంది. నా పార్టీని జాతిపితగా, భవిష్యత్తుగా మారుస్తారనే నమ్మిక వుంది.

## చాకలి యాకయ్య

మాది కొడ్లవాడ. గోచి పెట్టినప్పటినుంచీ ముట్టు బట్టలుతికేవాణ్ణి. మా వూళ్ళో వున్న అసహ్యం అంతా బట్టల్లో మూటగట్టుకొని మా యింటికి తెచ్చి, శుభ్రంచేసి పంపేవాళ్ళం. ఈ కాళ్ళు, చేతులు చూడండి ఎలా కాయ కాసిపోయాయో! వెండ్రుకలెలా రాగివర్ణం తీసుకున్నాయో, అమ్మ - నాన్న వాగుల్లో బట్టలుతుకుతూనే శతవృద్ధులయ్యారు. మా తాత ముత్తాతలంతా ఈ వృత్తిలోనే అస్తమించారు. నాకు సంఘంలో చేరిందాకా రైలు పట్టాల మీద ఎద్దుల కట్టకుండానే పోతుందనీ, విమానం రోడ్డు లేకుండా గాలిలో పరుగెడుతుందనీ తెలీదు! ఒక్కటే నే నెరిగిన జీవిత సత్యం! పొద్దుగూకులు రెక్కలు ముక్కలు చేసుకొని వూరి బట్టలన్నీ వుతకటం, తలా పిడికెడు అన్నం పెడితే తినడం, నానాతిట్లు తిడితే పడటం, పడుకొని దెయ్యంలా ఆలోచన, కలలు లేకుండా నిద్రపోవడం.

మా వూరికి సంఘంవాళ్ళు రాగానే నాకు కొత్త రక్తం రక్తనాళాల్లో వెచ్చగా మెదిలింది. అంతకుముందే సంఘం వాళ్ళు పేదల తరపు మనుషులనీ, దోపిడీదారులకు

శత్రువులనీ విన్నాను. వాళ్ళకోసం అంతరాంతరాల్లో తహతహలాడానుకూడ. ఇంట్లో అమ్మ, నాన్న, అన్నాయి వద్దని మొత్తుకునేకొంది, వూళ్ళో ధనికరైతులు పళ్ళు పటపటలాడించేకొంది సంఘం వాళ్ళతో తిరిగాను. రాత్రి పాఠశాల కెళ్ళాను. పలక, బలపం తీసుకొని చదవనారంభించాను. నిరంకుశ నైజాం నవాబుతో, రజాకార్లతో ప్రజలు పోరాటం ప్రారంభించారు. వూళ్ళో నాతో చదువుకునే యువకులు, జీతగాళ్ళు, పాలేర్లు, కూలీలు, పేదరైతులు సంఘం పిలుపు అందుకొని ప్రతిఘటనోద్యమంలో భాగస్వాములయ్యారు. నేనూ వూళ్ళో మిత్రులు నిర్మించిన దళంలో చేరాను. అహోరాత్రులు హంతక రజాకార్లను, నిజాం మిల్టరీని ఎదిరించి పోరాడాను.

రజాకార్ల ముట్టడిలో నేనూ దారుణంగా మరణించాను. దేశస్వాతంత్ర్యానికి నావంతు త్యాగంచేసి సంతృప్తిగా కళ్ళుమూశాను. ఇంటిదగ్గర అన్యోన్యంగా ఆడుకునే, పాడుకునే సల్లాపాలు, సంగీతాలు చేసే అన్నయ్య - వదిన కళ్ళముందు సాక్షాత్కరించారు. వాళ్ళెంత సన్నిహితంగా, సంతోషంగావుండి ప్రతి నిమిషం, ప్రతి పని పంచుకునేవాళ్లు. వాళ్ళకుమల్లె నేను పెళ్ళి చేసుకొని వుందామనుకున్నా. మా పక్కవూరి వేలిడిచిన చాకలి మామాయి కూతురు నాకోసం రేయింబవళ్ళు కలవరిచేది. దాన్ని చేసుకుందామనుకున్నా! మేమిద్దరం పెళ్ళి చేసుకుంటే యెంత అందంగా, హాయిగా, మంచి[illegible] సల్లని రాత్రులు, సల్ల రాళ్ళవంటి హృదయాలు,

కర్క-శలాకం కరిగి, కనికరించి, ఘనీభవించి మారేమో! సంఘం పిలుపు అందుకొని నా హృదయాధి దేవతను దించి, దీవించి చివరిసారిగా నా ప్రియురాలికి హృదయపూర్వక అభివందనంచేసి సమరంలో దూకాను. ఆమె చిరంజీవి అవాలి. నేను ఆమెకు దూరమయినందుకు చింతించడంలేదు. మా కలలు కరిగిపోయినందుకు బాధపడటంలేదు. ఎంచేతంటే అంతకంటే విలువయిన, గొప్పదైన అనన్య సామాన్యమైన దేశంకోసం, పార్టీకోసం, ప్రజలకోసం నేను ఆత్మార్పణ చేశాను! తప్పకుండా ఇవాళ కాకపోతే మరోనాడు తెలుగు జాతి సర్వతంత్ర స్వతంత్రమవుతుంది! ఈ నవాబులు, నిరంకుశులు, రజాకార్లు వుండరు! ఆనాడు పార్టీ పరిపాలిస్తుంది. పార్టీ పతాక ప్రభుత్వ భవనాలమీద రెపరెపలాడుతుంది. ఆ మహోన్నత స్థితికి దేశం రావడానికి నేనుకూడ కారణం అనే గర్వం నాకుంది. నా రక్తంకూడ సిరి, సంపదలు, సుఖాలు సరిసమానంగా ప్రజలకు పంచిచ్చే సమాజ పునాదిలో పుష్కలంగా వలికింది! ఆ ప్రజలు, యువతీ-యువకులు ఆనందించే జీవితంలో నన్ను చూచుకుంటున్నాను.

ఆ ముందుతరాల పిల్లలలో నేను కలలుకన్న పిల్లల ముఖాలు సందర్శిస్తాను. ఆ మధుర-మధుర జీవిత స్మృతులలో నా స్వప్నాలు కొల్లగా కోసుకుంటాను.

నా మిత్రులు, సహచరులు, సోదర ప్రజలు నన్ను ప్రేమించే — నా దేశస్థులంతా—నా పార్టీకి అండదండిగా నిలవండి! నా జండాను కోటి సంవత్సరాల భవిష్యత్తుల్లోకి అవసరమయితే—శత్రు రక్తనదులలోగుండా, నరయాప

రాక్షసుల శిరస్సుల కుప్పలమీదినుంచి — సాగి ముందుకు తీసికెళ్ళండి! ఇది నా ఆశ, ఆశయం, ఆజ్ఞ!

## కొరియురు

నా పేరు జ్ఞాపకంలేదు. అంతగా అవసరంలేదు. నేను చనిపోయాను. ఇహ మీ అందరి పేర్లలో నాపేరు చదువుకోండి. మీ అందరి ప్రతిబింబాలలో నారూపం ప్రతిఫలిస్తూంది చూడండి! మీ అందరి ఆశల్లో, ఆశయాల్లో నేను స్వస్వరూపంలో సాక్షాత్కరిస్తున్నాను శ్రద్ధగా పరిశీలించండి. మీ అందరి ఆత్మలో నా ఆత్మ ప్రజ్వలంగా జ్వలిస్తూంది. మీ హృదయాలలో వెలుగుతున్నాను. మీ మేను నేను ఆవేశించి నిలువెల్లా పులకిస్తున్నాను.

అవును. నేను గొల్లను! గొర్లు కాసి-కాసి కాళ్ళుకూడ వంకర్లు తిరిగి దొడ్డికాళ్ళు అయ్యాయి చూడండి! మాదికూడ రెడ్లవాడే. అమాయకంగా, అజ్ఞానంగా గొర్లలో ఒకగొర్రెగా బ్రతుకుతున్న నాకు సంఘం ఒక కొత్త ప్రపంచమార్గాన్ని చూపి, పసిపిల్లాణ్ణి పట్టుకున్నట్టు రెండుచేతులు పట్టి ఎత్తుకొని తెలియని సంగతులు, సందర్భాలు, సిద్ధాంతాలు, రాజకీయాలు సమ్మిళనం చేసి, నూరి ఉగ్గుపాలు పెట్టి ఆ మార్గంలో ప్రవేశపెట్టింది.

నేడు ఆయుధం పుచ్చుకొని తెలుగుజాతి ఆగర్భశత్రువయిన నైజాంతో పోరాడాను. జీవించాలనే కోరికంత బలమయిందీ, మంచిదీ, గొప్పది, విలువయింది మరోటిలేదు. జీవించదల్చిస్తే ఎలానయినా—ఎంత కష్టంగా, ఘోరంగా,

భారంగా, సుఖంగా, దుఃఖంగానైనా జీవించొచ్చు-విలువను బట్టి, అవకాశాల ఆదరువునుబట్టి, ఎలా జీవించినా చావడానికంటే సుఖంగా వుండొచ్చు! అలాంటి జీవితాన్ని దేనికోసం బలిచేయకూడదు! కాని ఒక్క మహత్కార్యాన్ని అంత విలువయిన వస్తు త్యాగంతోనే అభినందించాలి, జయప్రదం చేయాలి, జేజేలు పలకాలి! అదే దేశ స్వాతంత్ర్యం! పీడిత జనతా విముక్తి. ఆ మహాసంగ్రామానికి జీవితాలు అర్పించాలి! జీవితాలతో విజయాన్ని సాధించాలి! లేకపోతే స్వాతంత్ర్యం రావడం కల్ల! అందుకే నేను ఎన్నో స్వప్నాలతో దండిగా నిండిన నా యువజీవితాన్ని రజాకార్లకు ఆహుతి చేశాను! ఇదే పని తెలుగు యువకులంతా చేసి తెలుగుజాతి విముక్తి సాధించండి! సత్వరం సంపాదించి సుఖించండి! ఈ పోరాటాన్ని నడుపుతున్న పార్టీని, పార్టీ జండాను మీ సర్వస్వంగా భావించి, అనుసరించండి!!



# ఓ నవ్వు ఆగింది

ఇవాళ రాములు లేవలేదు. ఇవాళే కాదు నాల్గు రోజుల్నుంచి లేవడంలేదు. అదోలా, పరధ్యానంగా, బాధగా, కుములుతూ, కుళ్ళుతూ తనలో తానే దహించుకుంటూ చిక్కి శల్యమవుతున్నాడు. కారణం అడిగితే చెప్పడు. బాధ్యతలు శ్రద్ధగా చూడలేకపోతున్నాడు. ఏపనీ అంతగా పట్టించుకోవడంలేదు. చేయదలిచినా చేయలేడు. దిగులుతో నలిగి, నవిసి దళకేంద్రంలో నెలరోజులు లంఖనాలు చేసిన వాడికిమల్లే వాడిపోయి వుంటున్నాడు. జ్వరం కూడ అడపా, దడపా వస్తూంది. వచ్చినపుడు సెగలు, పొగలు కక్కి కిందుమీదు చేస్తుంది.

కామ్రేడ్సంతా చాల ఆందోళన పడుతున్నారు. ఎన్నో విధాల మనోవేదనకు కారణం గుచ్చిగుచ్చి అడిగారు. ఏమి జరిగిందో చెప్పమని తలోవేపు కాకుల్లా పొడిచి వేధిస్తున్నారు. ఆయన మౌనముద్ర వహించి, మాట్లాడకుండా భీష్మించి కూర్చున్నాడు.

స్వాతంత్ర్య యుద్ధసమయంలో సైనికులు ముఖ్యంగా ప్రజాసైనికులు—రంగంలో కాళ్ళు ముడుచుకొని కూర్చుంటే వ్యూహాకందని ప్రమాదాలు తటస్థిస్తాయి. అందులో దళ కమాండరు కించిత్తు కన్ను కునికినా, దౌర్బల్యానికి దాసోహమన్నా, కాళ్ళు వేలాడేసినా, బాధ్యతలను చిన్నచూపు

చూసినా యింట్లో వాడు కంట్లో పొడిచినట్టవుతుంది. అంచేత రాములు ప్రవర్తన కామ్రేడ్సందరినీ చాల కలవర పెడుతుంది. గగ్గోలు పరుస్తోంది. అదీ అజ్ఞాత వాసంలో, అరణ్యాలలో, అధ్వాన్నంలో అతి చిన్న బలగంతో వుండి — అసంఖ్యాకులైన ఆరితేరిన మిల్టరీని, అధునాతన ఆయుధాలను, వూడలు నేలలో పాతుకున్న నిరంకుశ ప్రభుత్వాన్ని — యెదిరించి పోరాడుతున్నప్పుడు యెంతో జాగ్రత, పట్టుదల, త్యాగం, సహనం, ద్వేషం, నేర్పు, చొరవ, దృఢసంకల్పం అవసరం. ఈ విషయాలలో యెవరు వెనకబడ్డా చిన్నా-పెద్దా అనే భేదం లేకుండా తీవ్రంగా విమర్శించి, శిక్షించి అదుపులో పెట్టటం విప్లవపార్టీ విద్యుక్త ధర్మం.

దళ కామ్రేడ్సంతా రాములు స్థితి చూసి చాలనొచ్చుకుంటున్నారు. కేంద్రంలో కొరియర్లు, ఆర్గనైజరు, దళ సభ్యులు కమాండరు రాములు మానసిక సంక్షోభానికి కారణం వెదుకుతున్నారు. జోను కమిటీకి పరిస్థితి తెలియజేశారు. ఆయనకు ఉపచారాలు చేస్తున్నారు.

దళ కేంద్రంచుట్టూ దట్టంగా పరివ్యాప్తి చెందిన మహారణ్యం ఇప్పుడిప్పుడే పడుతున్న వర్షాలతో, ఆకులతో, కొమ్మలతో, రెమ్మలతో శోభాయమానంలా ఎదిగింది. కామ్రేడ్స కేంద్రానికి రెండుకోసుల దూరానున్న కిన్నెరసానికి వెళ్ళి నీళ్ళు తెస్తున్నారు. మంచి ముత్యాలవంటి మొక్క-జొన్నలు పిచ్చి యెచ్చిగానే వంకటి చేస్తున్నారు. గునుగుగడ్డి తెచ్చి వుడకపెట్టి, నీళ్ళు వంచేసి, కాస్త వుప్పు కారం వేసి కూర చేస్తున్నారు. ఈ తిండి తలా గుప్పెడు

తిని, పైపైన ఆకలి చల్లార్చుకొని, కార్యక్రమం చేస్తున్నారు. ఎవరిపనిమీద వాళ్ళు వెళుతున్నారు.

దళ కేంద్రం ఒక చిన్న పాకలో, గుట్టపక్కన మద్ది తోపులో వుంది. పాకలో ఒకవేపు గొంగళి పరుచుకొని రాములు పడుకున్నాడు. నిద్ర పట్టడంలేదు. కాని రక రకాల ఆలోచనలు, స్వప్నాలు, సందేహాలు, సమాధానాలు మేఘావృతమయిన మనోవీధిలో మెండుగా మెదులుతున్నయి. లోకం పగలుతో అలిసి చీకటి కప్పుకొని కాళ్ళు తన్నిపట్టి కళ్ళు మూసింది. గగ్గోలు పడివున్న అరణ్యం నెమ్మదిగా, నిశ్చలంగా, మౌనంగా మేను వాల్చింది. వాతావరణం నిబిడమై కళేబరంలా వుంది.

“ఇదో నీకేనయ్యా చెబుతుందీ, కాస విను. అందరి నోళ్లల్లో నానే నీకుకూడ కళ్ళు నెత్తికెక్కితే ఎలా? పాపం, తెలియదు కామాలి! తెలిస్తే మాత్రం తెలియనట్లు నటిస్తే కాని అందం వుండదు, నలుగురూ నాయకు డనుకోరు మరి!

“ఇప్పుడు మీ అమ్మ యెక్కడుందో, ఏం చేస్తుందో ఏ స్థితిలో వుందో తెలుసా? ఛా... నీదీ ఒక బ్రతుకేనా? కన్న తల్లిని అమానుషంగా అవమానిస్తుంటే చూస్తూ వూరు కున్నావు! కన్న తండ్రిని కాళ్ళు, చేతులు విరిచి విపరీతంగా హింసించి మూలపడేస్తే యేం పట్టనట్టు, తెలియనట్టు నిర్లిప్తంగా నీళ్ళు నములుతున్నావు.

“మొన్న గుండాల క్యాంపు వాళ్ళు మీ అమ్మను, నాన్నను వారం రోజులు చిత్రహింసలుపెట్టి క్యాంపులో పడే శారు. మీ నాన్న మూలుగలు, భొమికలు విరిగి మరణ

మూలుగు చవిచూస్తున్నాడు! అబ్బ......చెప్పటం కష్టం! మీ అమ్మను—అరవై ఏళ్ళ వృద్ధురాల్ని శ్యాంవు మిలిటరీ విపరీతంగా చెరిచి రక్తపు ముద్ద చేశారు! కూర్చుంటే లేవలేక లేస్తే కూర్చోలేదు. కదల మెదలలేని ఆమెను నిలువులోతు గోతిలో పడవేసి గొంతువరకు పూడ్చి పైన తలుంచి చితకగొడుతున్నారు. అవసరమయినప్పుడు-ఎప్పుడు పడితే అప్పుడు ఆ గోతిలోనుంచి తీసి వాళ్ళ పశుతృష్ణ తీర్చుకుంటున్నారు. ఇప్పుడూ ఆమె గోతిలోనే వుంది! ఆ నరకం భరిస్తూనేవుంది. ఆ రాక్షసకృత్యం ఆ ఊరు వాళ్ళంతా విషమయం చేస్తూంది.

"ఇదంతా నీ నుంచి, నీ దౌర్భాగ్యప్పనుల్నుంచి! నీ ఎక్కడున్నావో చెప్పమని, నిన్ను పట్టించమని మిలిటరీవాళ్ళను చిత్రహింస పెడుతోంది. వూళ్ళో షావుకారు శ్యాంవు వాళ్ళతో పరీకయి, వాళ్ళను నీ తలిదండ్రుల మీదికి వుసికొల్పుతున్నాడు. వాళ్ళకు లంచాలు మేపి, నీవు అతనికి బాకీ వున్నావని చెప్పి- మీ ఆవులు, గేదెలు, ఎద్దులు, అరక సామాను, ఇంట్లో చరాస్తి- తన యింటికి చేరవేసుకున్నాడు. ఎందుకు పుట్టి!! సార్థకం ఏముంది? ఎవర్ని వుద్ధరించను? ఎందుకు వచ్చిన పోరాటం ఇది? ఎవరికోసం? తల్లిదండ్రులకు ఉపయోగించని ఈ చాకిరి ఎందుకు? నీవు పెట్టి పోషించలే పోయినా, వాళ్ళ బ్రతుకును వాళ్ళను బతకనీయక జీవితం మీద నిప్పులు కుమ్మరిస్తావేం?" అని మెలికలు తిరుగుతూ, వయ్యారంగా నర్తిస్తూ, — 'ఒకతోను' వచ్చి ఒకనాడు సూదులు బాకులతో రాముల వళ్ళంతా పొడిచి గాయాలు

చేసింది అవి ఇప్పుడు పునర్విజృంభించి నెత్తురువోడుస్తూ తీవ్రంగా సలువు పెడుతున్నాయి!!

పగిలి వ్రయ్యలయి ఇప్పుడిప్పుడే కట్టుకుంటున్న హృదయం మూలుగుతూంది.

"ఇదో రాములూ, విన్నావా? నువ్వెందుకు వింటావు దేశమంతా కోడయికూస్తున్నా నీకు సిగ్గు రాలేదాయె! మని షయి పుట్టింతర్వాత కాస్త చీము నెత్తురు వుండొద్దూ! భార తీయుడయిం తర్వాత కాస్త కాకపోతే కాస్త అయినా ఆత్మాభిమానము వొద్దూ? ఎందుకు, జనాభా లెక్కకు నేనో కడ్ని వున్నానని చెపితే సరా?

"భార్యను క్యాంపువాళ్ళు తీసుకుపోయి వుంచుకుం టుంటే చూసి, సహించి, ఏమీ జరగనట్టువుండే భర్త పృథి విలో ఎక్కడయినా నీకు కనపడ్డాడా? అలాంటి వాడుంటా డని వూహించావా?......ఏమిటి సందేహిస్తావు? నిజంగా నీ భార్యే......నీ భార్యను గుండాల క్యాంపువాళ్ళు తీసుకు పోయి పదిహేను రోజులు ఆమె 'లబో దిబో'మని మొత్తు కునే కొలదీ హింసించి, చెరిచి - ఇప్పుడు అక్కడే సొంత పెళ్ళాంగా వుంచుకుంటున్నారు. నీ కొడుకు తల్లితో వెళ్ళ డానికి ఎంతో తవాతవాలాడితే, మిలటరీ కాళ్ళుచుట్టుకొని భోరున ఏడుస్తే—వాళ్ళు నిర్దాక్షిణ్యంగా విసిరి పారేశారు. ఇప్పుడు నీ కొడుకు దిక్కులేని పక్షిలాగా గడప గడప తిరు గుతూ, బొరె పట్టుకొని బ్రతుకుతున్నాడు. నీ భార్య హృద యం ఎంత కుమిలిందో, క్షోభించిందో, శోకించిందో, కుంగ పోయిందో నీ పాషాణహృదయానికి అర్థంకాదు. ఆమె నిన్ను

వేయేళ్ళు శపించినా పాపంలేదు! నిన్ను కాక ఎవర్ని ఆమె దూషించాలి? ఆమె సర్వనాశనానికి, పతనానికి కారణం— నీవు! ! ఆమె ఆశలూ, ఆనందాలు ఘోరంగా నీ చేతిలో, జీవితపథంలో చిక్కి, నలిగి, నుసిగి ధూళిలో కలిశాయి!

"లే! రోజు రోజుకీ భ్రష్టుడిగా పరిణితి చెందొద్దు! అణగారిపోయిన ఆత్మాభిమానం రగిలి, రాజి, పునర్విజృంభించనీయి! వంశ గౌరవానికి, ఖ్యాతికి బెత్తెడు మందాన పేరుకున్న అపకీర్తిని, అపనిందను- నీ రక్తధారలతో క్షాళితంచేయి. నీకు రక్తాన్ని పంచిచ్చిన తల్లిదండ్రులు- నీ రక్తం పంచుకున్న భార్య, బిడ్డలు- నీకు అన్నిటికంటే ఆప్తులు ఆత్మీయులు, అతి సన్నిహితులు! ముందు వాళ్ళసంగతి చూసి, తరవాత దేశం సంగతి ఆలోచించు......" అంటూ 'మరొకరోజు' ఒకనాడు అప్పుడే లేచి కళ్ళు నులుపుకుంటున్న రాములు రెండుచెంపలు వాయించి రొమ్ముమీద నమ్మోట వేటుల్లా తగిలేట్టు చెప్పింది. ఆ బాధాగాధలు చేసిన పుళ్ళు- ఇప్పుడు చీము, నెత్తురు స్రవిస్తున్నాయి సంతతధారగా.

"ఆఁ ఆ! ఇప్పుడే వస్తున్నా! ఇహ ఇక్కడ క్షణం వుండను. వచ్చి గుండాలక్యాంపు మిల్టరీమీద కసితీర్చుకుంటాను! నా తల్లి, భార్యలను మనశ్శాంతి ప్రసాదిస్తాను! లేదు......నేను కసితీర్చుకోలేను! నా శక్తులన్నీ వుడిగి పోయాయి. ప్రతీకార కాంక్ష ప్రజ్వలించడంలేదు! నేను రెండు చేతులు కట్టుకొని క్యాంపు దగ్గర కెళ్ళి శరణు కోరతాను......క్షమాపణ అడుగుతాను......నన్ను, నా కుటుంబాన్ని దయతో చూడమని ప్రార్థిస్తాను......" అని

పెద్దగా కలవరిస్తూ రాములు తృళ్ళిపడి లేచాడు. కలవరం తెలుసుకొని కుంగిపోతున్నాడు. అకస్మాత్తుగా నిద్రనుంచి లేచిన కామ్రేడ్స్ విస్మయంతో నిర్విణ్ణులయ్యారు! !

* * *

విషాదవార్తలు విషసర్పాలకంటే ఘోరంగా కాటందుతాయి. కొన్ని సర్పాలు కాటందితే విషం ఎక్కదు. ఎక్కినా ప్రమాదం చేయదు. కాని విషవార్తలు కరచాయా’ వెంటనే రక్తమంతా విషమయమయిపోతుంది. శరీరమంతా నల్లకప్పు వేస్తుంది. విపరీతంగా హింస పెడుతుంది. వెర్రి తలలు వేస్తుంది. అదే సంఘటన రాముల్ని పట్టి పీడిస్తుంది.

ఇవాళే జోను సెక్రటరీ రాములు వ్యవహారం పరిష్కరించను దళ కేంద్రంకు వచ్చాడు. కామ్రేడ్స దరిభిప్రాయాలు సావకాశంగా తీసుకున్నాడు. రాముల్ని సమీపించి, క్షేమ సమాచారాలు అడిగి, సిలువెల్లా నిమిరి, కణతలు, నుదురు వత్తి, ముంజేతులు, మణికట్లు చల్లగా స్పర్శించి, పక్కలో ప్రశాంతంగా, దయగా కూర్చొని రాముల్ని అడుగుతున్నాడు.

“మీరిలా పడుకుంటే పనులెలా అవుతాయి చెప్పండీ?” అడుగుతున్నాడు సెక్రటరీ నెమ్మదిగా.

“ఒంట్లో బావుంటం లేదు. కాస్త ఓపిక చిక్కగానే కార్యక్రమం తీసుకొని చేస్తాను” అంటున్నాడు లేచికూర్చొని రాములు తడబడుతూ, మాటలు తడుముకుంటూ.

“ఒంట్లో బాగ లేకపోతే మందు తీసుకోవచ్చు. అవసరమయినంత కాలం విశ్రాంతి తీసుకోవచ్చు. ఆరోగ్యం సరిగా

లేకపోతే చేసే పనిమాత్రం శ్రద్ధగా, జాగ్రతగా చేయడం సాధ్యమెలా అవుతుంది గనక? కాని లేనిపోని మనోవ్యాధి తెచ్చుకొని దానితో సతమతమవటం, ఆరోగ్యమంతా నాశనం చేసుకోవడం, పార్టీ పని కుంటుపరచటం, నాటి కామ్రేడ్స్ అనేక సందేహాలకు గురి అయ్యేట్టు చేయటం సుతరామూ మంచిపని కాదు. ఏమంటారు?"

"నేను కాదన్నానా? కాస్త ఆరోగ్యం సరి అవగానే తప్పకుండా పని ప్రారంభిస్తాను"

"ఏమిటి జబ్బు?"

"నాకు మాత్రం తెలుసా?"

"డాక్టరు చూసి మీకు జబ్బులేదు, మనోవ్యాధి అని చెప్పాడట! నిజమేనా?"

"అవును"

"మనోవ్యాధితోనే బాధపడుతున్నారా?"

"లేదు"

"మనోవ్యాధి లేదంటారా?"

"అవును"

"మరి ఏమిటి మీ బాధ?"

"అది స్పష్టంగా చెప్పలేను. కాని రెండుమూడు రోజుల్లో కార్యక్రమం తీసుకొని చేయగల్గుతానని చెప్ప గలను."

"ఈ పసుగుడు పద్ధతి మంచిది కాదు కామ్రేడ్. కమ్యూనిస్టులకు మనోవ్యాధులు రాకూడదు. మనోవ్యాధి మన

శత్రువు. మనం సైనికులం. బలహీనతలకు బద్ధశత్రువులం. ఉన్న బలహీనత వదుల్చుకొని, కడుపులోది కుండ బద్దలుకొట్టి స్వచ్ఛందంగా పనిచేయాలి. అదీ మీరు దళకమాండరుగా వుంటున్నారు. ఎన్నో ముఖ్య బాధ్యతలు నిర్వహిస్తున్నారు. మీ రిలా కడుపులో కుళ్ళు కక్కకుండా, మనస్సులో మకిల కడగకుండా, పక్క వేసుకుని పడుకోవడం చాల విచారకరం. మీ రిప్పటికయినా ఎందుకు బాధపడుతున్నారో, ఎందుకు కుంగిపోతున్నారో విపులంగా చెప్పండి. స్వచ్ఛంగా, సంతోషంగా పని కుపక్రమించండి" అన్నాడు కొంచెం తీవ్రంగా సెక్రటరీ.

"ఏముంది, నిజానికి యింటి పరిస్థితి ఎంతగా నేను మింగుదామనుకుంటే, అంతగా నన్ను పట్టి బాధిస్తోంది. అంతకు మినహా మరేం కారణం లేదు. అదీ తాత్కాలిక మయిన మనస్తాపమే..." అన్నాడు నీళ్ళు నములుతూ రాములు.

కామ్రేడ్ సెక్రటరీ ఈ సమాధానంతో కొంచెం దగ్గరికి జరిగి, చిన్నగా దగ్గి, పెద్దగా నవ్వి రాములు కళ్ళకేసి చూసి ఆరంభించాడు.

"కామ్రేడ్! మీ యింటి సంగతి నీకంటే నాకు బాగా తెలుసు. నీవు అనేకమంది చెప్పిన కబుర్లన్నీ విని మనస్సు క్షోభపెట్టుకుంటున్నావు. ఆ వార్తల్లోని ఘోరం, బీభత్సం నిజమయినా, వాళ్ళు చెప్పడాన మరీ నీవు పాలిపోతున్నావు. నాకు అన్నీ విషయాలు వివరంగా తెలుసు. ఎప్పుడూ ఆ ప్రాంతంలో ప్రత్యేకంగా మీ యింటి సంగతి తెలుసు

కుంటుండేవాణ్ణి. మనం తీసుకోవాల్సిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాం. కాని శత్రువు నీచుడూ, బలాధికుడు అవడంవల్ల వాళ్ళను తప్పించలేకపోయాం."

"............"

"అయినా నీలాంటి వీరుడు—కాకలు తీరిన గెరిల్లా యోధుడు అలాంటి బాధలు ఎన్ని అనుభవించాలో వేరే చెప్పక్కరలేదు. అనూహ్యం. ఎన్ని దోపిళ్ళు, గృహదహనాలు, నిండు హత్యలు, అమానుష మానభంగాలు, చిత్రవధలు, హింసలు, సర్వనాశనాలు, ఘోరాతిఘోరాలు చూడటంలేదు. మనం ఆయుధంపట్టి, అష్టకష్టాలు పడి, అడవుల పాలయి, అజ్ఞాతవాసంచేస్తూ పోరాడుతుంది ఈదుర్మార్గుల దౌర్జన్యాలు, దోపిళ్ళనుండి ప్రజల్ని విముక్తి చేయడానికి కదా! అలాంటప్పుడు హింసాకాండకు గురయ్యేలక్షోపలక్షల ప్రజల్లో మన కుటుంబాలుండటం—మొదట వుండటం ఆశ్చర్యకరమా, అసహజమా? ఎన్నాళ్ళు ఈ నిరంకుశ ప్రభుత్వం అధికారంలో వుంటుందో అన్నాళ్ళు ప్రజలు అన్యాయాలకు, అమానుషాలకు ఆహుతి అవాల్సిందే! అన్నాళ్ళు మనం మన కుటుంబాలు — ఈ దారుణాలకు ముందుండి ఎదురునడిచి, ఎదుర్కోవాల్సిందే. మీరు అనవసర ఆలోచనల్లో ఆవేదనల్లో నలిగిపోక, ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకొని, మిమ్మల మీరు నిష్కల్మషంగా చూసుకొని రంగంలోకి పదండి..."

"మీరు చెప్పిందంతా వాస్తవమే. ఒక విప్లవకారుడు తన పెళ్ళాంకు జరిగిన ఘోరం, అమ్మకు జరిగిన అన్యాయం

తలుచుకుంటూ, ఆలోచించుకుంటూ దిగులుపడి కూర్చోవడం విప్లవ ధర్మాలకు విరుద్ధం, హానికరంకూడ. స్వాతంత్ర్య యుద్ధం జరిగేప్పుడు ఏ కుటుంబం హాయిగా, ఆనందంగా వుంటుంది కనక! ఇంటిదగ్గర పరిస్థితి యెందుకో నా ఆలోచనకు అందకుండానే నన్ను మెత్తపరిచింది. నా హృదయాన్ని కరిగించింది. నన్ను చాల అలజడి సుడిగుండంలో దిగబెట్టింది. ఈ కల్మషాన్నుంచి బయటపడుతున్నా. ఇవాళ్ళే దాడ్లు పునరుద్ధరించి శత్రుమూకను తుత్తునియలు చేస్తాను" అన్నాడు. ఉద్వేగంతో రాములు-ఆయన జీవితానికి సరిపడే స్నానం, తలంటిస్నానం ఇప్పుడే చేసివచ్చినట్టు వున్నాడు.

"అదీ గెరిల్లామార్గం కామ్రేడ్ రాములు! కోయజాతి వీరుడవయిన, దళకమాండరు అయిన నీవు అనుసరించాల్సిన మార్గం అది! కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం, దళసభ్యత్వం, చదువు, నాగరికతకొరకు అహర్నిశాలు పోరాడి సాధించిన కామ్రేడ్, నీ వజ్రసంకల్పం మాకు చిరస్మరణీయం. నీకు జ్ఞాపకం వుందో - లేదో మీ వూరు - చీమలగూడెం అనుకుంటా - వలంటీరుదళాన్ని చూడమని పార్టీ చెపితే, ఆపని చేస్తూనే దళసభ్యుడిగా తీసుకోమని ఎంత ఆందోళన చేశావు! పార్టీ మెప్పు సంపాదించను యెంత చాకిరి, సేవ, కార్యక్రమం చేశావు! పొద్దుగూకులు అడవిపట్టుకొని, గోచిపెట్టుకొని తిరిగే నీవు - యెంత చాకచక్యంగా మహత్కార్యాలు చేశావు! తీరా పార్టీ దళాలలోకి నిన్ను తీసుకుంటే - యెంత బాగా ప్రజలు, పార్టీ ఆశ్చర్యపడేంత అద్భుతాలు అతి స్వల్పకాలంలో సాధించావు! ఇటుక మీద ఇటుక పేర్చ

కుంటూ జీవితభవితవ్యాన్ని సొంత బ్రహ్మాండంగా నిర్మిస్తున్నావు! దళసభ్యు లందరికీ తలలో నాలుక వయ్యావు! దళకమాండర్లంతా ముక్కుమీద వేలు వేసుకునేట్లు ఎన్ని విజయాలు సాధించావు! నీ కీర్తితో, కృషితో ఈ ప్రాంత పార్టీ ఉద్యమం పుష్టితమయింది! పటిష్టమయింది. లేచి ఆయుధం ధరించు! పోరాటం తీవ్రతరం చేయి! శత్రుగుండెలమీదుగా నీ పవిత్ర పదపథం సాగనీయ్."

"రెడ్ సాల్యూట్ కామ్రేడ్" అని రాములు ఎర్రగా పిడికిలి బిగించి సెక్రటరీకి నమస్కరించి "జోనుకమిటీ కామ్రేడ్సందరికీ మా అభివాదనాలు తెలియజేయండి" అన్నాడు మందహాసం చేస్తూ.

సెక్రటరీ ప్రతివందనం చేశాడు. "ఓ! అలాగే. నీ భార్యను మాత్రం మన కొరియరు కలిసికోడానికి వీలులేక పోయింది. మీ అమ్మ, నాన్న ఒక కాంటాక్టు (నిర్ణీత స్థలం) కు వచ్చేవర్పాటు చేశాను. వాళ్ళను కలిసికోండి. చాల జాగ్రత సుమా! మీకు అభ్యంతరం లేకపోతే వాళ్ళను యిక్కడే వుంచండి తప్పుకున్న కుటుంబాలతోపాటు వుంటారు. అక్కడికెళ్తే మళ్ళీ హింసాకాండ ఆరంభమవుతుంది" అంటాడు సెక్రటరీ.

"మంచిది. పిల్లాడు ఎక్కడున్నాడో"

"వాడు కూడ ముసలాళ్ళతోపాటు వస్తాడు"

అనిర్వచనీయ సంతోషం రాములుముఖంమీద తొణి

కిన లాడింది. ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. ఒకరికేసి ఒకరు చూసి ఆప్యాయత వలకపోశారు.

* * *

వేసవి. మండు వేసవి. కసితో ఒక నియంత కొల్లగొట్టినట్టు శావుగుమంటూంది అరణ్యం. ఎక్కడా పచ్చని ఆకు, కొమ్మ చూద్దామన్నా లేదు. పైన చెట్ల ఆకులు, రెమ్మలు పూర్తిగా రాలిపోయాయి. కిందగడ్డి, పచ్చిక ఎండిపోయాయి. అరణ్యమంతా చాల వెలితిగా, వికారంగా బోసికొడుతూ వుంది. మైలుదూరాన నడుస్తున్న మనిషి జంతువుల పదధ్వని గలగల శబ్దంచేస్తూ ఎండుటాకుల రాసులు ఇక్కడ ప్రతిధ్వనింప జేస్తున్నాయి.

ప్రభుత్వం నిర్బంధవిధానానికి తట్టుకోలేక కోయకుటుంబాలు, రైతుకుటుంబాలు కొన్ని అరణ్యవాసం చేస్తున్నాయి. ఆ కుటుంబాలు పార్టీపిలుపుమీదనే అడవికి తప్పుకున్నాయి. పార్టీతోపాటు అడవిలో అవస్తలుపడుతూ పార్టీకి అండదండగా వుంటున్నాయి. దళకేంద్రం దగ్గరిలో ఈ కుటుంబాలు ప్రత్యేక కేంద్రం ఏర్పరచుకొని - గుడిసెలు వేసుకొని - అందులో వుంటున్నాయి. రాములు వృద్ధ తల్లిదండ్రులు, కొడుకు, తమ్ముడు ఇక్కడుంటున్నారు. పార్టీ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. తిండి తిప్పలు లేకపోయినా, స్వేచ్ఛ, కష్టానికి అర్థం, తిట్లు తన్నులతో వేధించేవాళ్ళు లేకపోవడం వల్ల జీవితం సుఖంగా సాగిపోతూంది.

రాములు ఇప్పుడే దళకేంద్రంనుంచి తల్లిదండ్రులదగ్గరికి వచ్చాడు. రాసులుగా పడివున్న ఆకులలం, గడ్డిగాదం ఎండి,

నిప్పుకుడి, తగలబడిపోయి నేలంతా నల్లనిమసితో కప్పు వేశాయి. ఆ మసికుప్పలమీద నడవడంవల్ల కొందరు నలిగి నట్లు కనపడుతున్నారు. కాని ఆ చిరునవ్వు ముఖంమీద యెప్పుడూ ఆడుకుంటూనే, పాడుకుంటూనే, వచ్చిపోయే వాళ్ళను పలకరిస్తూనే వుంది. నవ్వుకూ ఆయన ముఖానికి అంత గాఢానుబంధం.

"అమ్మా, ఆరోగ్యం బావుందా?" అడిగాడు అమ్మను ఆప్యాయతతో రాములు.

"నీ పున్నెన బాగానేవుంది నాయనా, ఏంది అయ్యా అనుకోకుండా వచ్చినవు. అన్నగాళ్ళు తప్పనకూ. ఏమన్నా పనిమీద వత్తివా?" అని అడిగింది ఆదుర్దాగా, ఆనందంతో మునలమ్మ. ఆమె మొక్కజొన్నలు పిండికొడుతూంది బండ మీద

"అవునమ్మా ఎప్పుడుపడితే అప్పుడు రావడం తప్పే. పార్టీ ఇలాచేయుడం, వప్పుకోదు. నేను అత్యవసరపనిమీద వచ్చాను. రాత్రికి నేను బస్తరుప్రాంతివిస్తృతానికి వెళ్తున్నా" అన్నాడు తొందరతొందరగా రాములు అమ్మతో.

"అదేడ?"—ఆశ్చర్యంగా ఆమె.

"చాలదూరం, గోదావరి అవతల" - నిదానంగా, నిండుగా.

"ఎందుకు?"

"ఇక్కడలాగే అక్కడ పార్టీపని చేయడానికి పార్టీ పంపిస్తూంది."

"అదేందయ్యా, అంతదూరం - కానని దేశం పోతా

పని నప్పుకుంటివా? కళ్ళముందు కనపడకుండా పోతావా? ఈ గుడ్డిముండ ఎంత పాపంచేసి పుట్టిందో కాని కడుపుకోత ఎన్నాళ్ళకు తీరేట్టు లేదు…" అంటూ ఆమె జలజలా కళ్ళ నీరు కారుస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూంది. తలవాల్చింది, పైటతో ముఖంకప్పుకుంది.

"ఆదేందమ్మా అలా అధైర్యపడతావు? నీవు అలా మాట్లాడొచ్చా? పోలీసులు నన్ను పట్టించమని ఎంత హింసించినా, ఎన్నిసార్లు నా పునికి తెలిసినా చెప్పని వీరమాతవు ఇవాళ మెత్తపడిపోతున్నావేం? నీవు నా నుంచి నరకం అనుభవిస్తూ 'పోరాటం సాగించు; శత్రువుల్ని చీల్చి చెండాడమని' అనేక సార్లు నాకు హితబోధ చేశావే, అప్పుడే మరిచావా?" అని ఆమెను బుజ్జగిస్తున్నాడు నెమ్మదిగా రాములు.

"నేను నీ దోవకు అడ్డం నిలబడను. పో, నయనా! సుఖంగా పోయిరా. పార్టీకి చెడ్డపేరు తేవొద్దు. నా యేడు పల్లా నువ్వు కళ్ళముందు లేకుండా పోతున్నావే అని. రేపటి నుంచి నా సంగతి ఎవురు కనుక్కుంటారు నాయనా" అంది బాధగా, కళ్ళ నీళ్ళు కుక్కుకుంటూనే.

"భాయికి నీ బాధ్యత నాన్న, తమ్ముడు, అబ్బాయిలను చూసే బాధ్యత అప్పగించి పోతున్నా! ఆయన చాల మంచివాడు. నా బదులుగా ఆయన్నే నీ కొడుకుగా చూసుకో" అన్నాడు అప్పుడే వచ్చిన భాయిని చూపిస్తూ.

"నేనున్నానుగా అమ్మా! నీకే లోటు రానీయను" అని కామ్రేడ్ భాయి అందుకున్నాడు. ఆమె తృప్తిగా చూసింది. ఇంతలో మునలయ్య కట్టెలుకొట్టి, మోపుకట్టి,

ఎత్తుక వస్తున్నాడు. రాములు ఆయనకు ఎదురేళ్ళి మోపు అందుకొని, ప్రయాణం సంగతి గుడిసె దగ్గరికి వచ్చిందాకా చెప్పాడు. ఆయన మొదట నొచ్చుకొని, మనస్సు కష్టపడి చివరికి వప్పుకున్నాడు కొడుకును దగ్గరకు తీసుకుని తలనిమిరి ముద్దు పెట్టుకొని—రాములు తలి దండ్రులకు, తమ్ముడికి, కొడుకుకూ సెలవుచెప్పి బయలుదేరాడు.

అప్పుడే రాములు దళంతో బస్తరు వచ్చి ఆరునెలలు అయింది. బొత్తిగా వుద్యమంలేని ఈ ప్రాంతంలో ప్రతిఘటనోద్యమ బీజాలు చల్లి, నీరుకట్టి, పందిరేసి తీగపట్టి అల్లిస్తున్నాడు. వృక్షమం శాఖోపశాఖలుగా విస్తరిస్తూంది.

ఎక్కడ పుష్కలంగా పైరుంటుందో, అక్కడే కలుపు కూడ అవతరిస్తుంది. వుద్యమంతోపాటు ద్రోహాలుకూడ అక్కడక్కడా తలెత్తుతున్నారు. కాని రాములు శక్తిసామర్థ్యాల వలన తలలు దించుతున్నారు. ప్రభుత్వం గంగవెర్రులెత్తి, వుద్యమాన్ని అణచడానికి అహర్నిశలూ—అష్టాతొంభై కుమార్గాలు, కుతంత్రాలు వెదుకుతూంది. రాముడి దళం అప్పుడే పది దాళ్ళు విజయవంతంగా చేసింది. రెండు పాటుగన్ను సంపాదించింది. ప్రజల్లో అమోఘ విశ్వాసం దినదిన ప్రవర్ధమానమవుతూంది, రాత్రి పదయినా వూరు మాటుమణగలేదు. ఆమూల, ఈమూల మాటలు వినపడుతున్నాయి. మనుషుల అలికిడి, నడకకూడా అంతటంతటా వుంది.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్......"

ఒక ఇంట్లో అన్నంమీద కూర్చున్న రాముల దళం—ఆరు గురు—మీద చుట్టూ మాటుపెట్టివున్న మిల్టరీ బ్రెన్‌లతో కాలుస్తూంది.

“కామ్రేడ్స్, పోలీస్- తప్పుకోండి! కనబడితే అన్నం పెట్టిన ద్రోహిని అంతం చేయండి. జాగ్రత్తగా తప్పుకోండి.” అని కమాండరు రాములు సింహగర్జన చేస్తూన్నాడు... వెంటనే గుళ్ళు ఒకదానిమీద ఒకటి నాలుగు తగిలి పడి పోయాడు...కాని చేతులతో కాలుస్తున్నాడు...కాల్చండి ...శత్రువును తరిమేసేయండి! ... అబ్బా...అ...ఊ... వో...దాహాం...మంచినీళ్ళు” అంటూ మూల్గుతున్నాడు. ఆయుధం లేవడంలేదు. చేతులు ఆడటంలేదు.

“హా...ఆఁ...అబ్బా......అమ్మా...కమ్యూనిస్టు పార్టీ...జిందా...బా...ద్...”అంటూపడిపోయినరస్సయ్య అనే దళ సభ్యుడు తక్షణం అస్తమించాడు.

ఈ వూళ్ళో ఒక ద్రోహి ప్రభుత్వం దగ్గర డబ్బు పుచ్చుకొని, దళానికి ద్రోహం చేయడానికి ఎత్తులు వేస్తు న్నాడు. అంతకు ముందు నాలుగుసార్లు దళం చెప్పినపని చేసి నమ్మకం కలిగించి ఇవాళ భోజనానికి రమ్మని ఇంట్లో మిల్ట రీని మాటు పెట్టాడు. దళంవచ్చి అన్నంమీద కూర్చోగానే మిలటరీ పక్షుల్ని కాల్చినట్టు బ్రెన్‌లతో పదడుగుల దూరంలోవుండి కాల్చింది. కాని నలుగురు కామ్రేడ్స్ తప్పు కున్నారు. నర్సయ్య చనిపోయాడు. రాములు మరణ మూల్గులు పెడుతున్నాడు.

“ఆఁ...అబ్బా... ఎర్రజెండా ...జిం......దా...

ఖా......ద్" అని పెద్దకేకపెట్టి రాములు ఈ లోకానికి వీడ్కోలు చెప్పాడు. ధారాపాతంగా ప్రవహిస్తున్న రక్త ములో బంగారు పారస్వతం వున్న నంచి వడి ముద్దగా తడు స్తూంది. ఆయన ముఖంమీాద నంతత ధారగా పొంగిపొరలే మందహాసం—నెమ్మదిగా పలచబారి, ఇగిరి అదృశ్య మయింది!

అవును, రాములు అసలు పేరు అచ్చయ్య. రాముల నేది రహస్యపేరు. కాని ఈపేరు వింటేనే ప్రభుత్వం హడిలి చస్తుంది. ప్రజలు వేయిగుర్రా లెక్కనంత నంబరాలు పడ తారు.

జ్ఞాపకం వుంచుకోండి: పాఖాలతాలూకా కల్తి అచ్చయ్య—చీమలగూడెం - మీా అందర్ని తనజండా పది కాలాలు నిలబెట్టమని చివరిసారి మనవిచేశాడు!



# ఓ పువ్వు తలనిగింది

శీతాకాలం. పొద్దుగూకింది. అడవినుంచి పశువులూ, మనుషులు వూరు చేరుతున్నారు. వర్నాపురం కోయగూడెం. అరణ్య మధ్యలో వుంది. అంచేతే గాఢాంధకారం వూరి మీద పైట దట్టంగా పరిచింది. వూళ్ళో చూద్దామన్నా దీపాలులేవు. దీపాలనేవి ఒకటి వున్నాయనే సంగతికూడ ఒకరో - ఇద్దరో ఎరుగుదురు. పొలాల దగ్గర మంచల్లో నెగళ్ళు మంటలు కక్కుతున్నాయి. రైతులు 'హోహోహో' అని గావుకేకలు పెట్టి పొలాలు పాడుచేసి, మేసిపోతున్న అడవిగండుల్ని, దుప్పుల్ని తోలుతున్నారు. వూళ్ళో ఎప్పుడూ ఎర్రగా మండుతుండే పొయ్యిలు, ఇంటింటిముందు రాత్రివేళ కనలే నెగళ్ళు—చేతనయినంతవరకు చీకటి చెరుపుతున్నాయి.

పార్టీ ఆర్గనైజరు వూళ్ళోకి పనిమీదవచ్చాడు. రైతులంతా ఆయన చుట్టూచేరి తమతమ సమస్యలు, ఈతిబాధలు పోలీసు సంచలనం, భూస్వాముల కుట్రలు వివరించి, సమాధానం తెలుసుకొని వెళ్ళిపోయారు. ఇంకో ఇద్దరు రైతులు మాట్లాడుతున్నారు. ఒక కుర్రవాడు వచ్చి చాలా సేపయింది. ఒకమూలన అలానే కూర్చున్నాడు. కొట్టంనిండా, ఇంతసేపూ గుంపెడు జనం వుండటంవల్ల, ఎవరిధోరణిలో వాళ్ళు మునిగిపో[illegible] అతని సంగతి ఎవరూ పట్టించుకోలేదు.

అతను దీనంగా, దిగులుగా తలొంచి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నాడు. అతనికేసి అంతా చూశారు. "ఏమిరా నర్సయ్యా. అట్లానే కూలబడ్డావేం, చెప్పకుండానేదేదో కుండ పగలకొట్టినట్టు అన్నగాళ్ళతో చెప్పటానికేంరా?" అని ఆ కుర్రవాడిని వుద్దేశించి ఒక రైతు అన్నాడు.

"............" ఆ కుర్రవాడు తలెత్తి చూశాడు బాధగా. తలొంచాడు తక్షణం సిగ్గుతో.

"ఏమిటండీ, ఎవరతను? ఏం జరిగిందేంటి?" అని ఆర్గనైజరు అడిగాడు—ప్రశ్నార్థకంగా ముఖంపెట్టి.

"ఏమిలేదండీ, వాడు మొన్నటిదాకా దళంలో పని చేశాడు. శత్రువులంటే వాడికి తగని ద్వేషం. కోపం పట్టలేక పార్టీ పద్ధతులు, నీతికి భిన్నంగా భూస్వాముల్ని, సి. ఐ డీలను శిక్షించాడు. పార్టీ ఎంత హెచ్చరించినా వాడు శత్రువులపట్ల తీవ్ర దృక్పథం మార్చుకోలేదు. ఇది హృదయ పూర్వకంగా తెలిసి కావాలని చేసినపని కాదు. పార్టీ హెచ్చరికలు మనఃపూర్వకంగా స్వీకరించేవాడు. కాని కార్యక్రమంలో అరాజకంగా ప్రవర్తించేవాడు. దీంతో కామ్రేడ్స్ విసిగి,, వేసారి వాణ్ణి దళాలనుంచి తీసేసి యింటికి పంపించారు. అప్పటినుంచి దిగులుపడి అసలు సరిగా లేవటం లేదు. అన్నం తినటంలేదు. దళాలలోకి తీసుకోమని వాడి మొత్తుకోళ్ళు" అని దీర్ఘోపన్యాసంతో - వున్న విషయాన్ని గూర్చి తెలిసిన మంచిభాషతో ఆ రైతు ఆర్గనైజరుకు చెప్పాడు.

"మీకేనా నర్సయ్య అంటే?" అంటూ ఆర్గనైజరు

అతన్ని సమీపించాడు. అతని చేతులు పుచ్చుకొని లేవదీసి, ప్రేమగా చూసి, పక్కనున్న మంచంమీద కూర్చోపెట్టి, తానూ కూర్చున్నాడు.

"ఎందుకు దళాలలోంచి తీసేశారు?" సూటిగా అతన్ని అర్గనైజరు ప్రశ్నించాడు. ముఖంలో ముఖంపెట్టి అభిముఖంగావున్న అతన్ని.

"............" అతను మౌనముద్ర వహించాడు. దిగులు గడ్డకడితే మౌనం మూర్తీభవిస్తుంది. "వాణ్ణి ఎందుకన్నా అడిగేది? మావాడు చెప్పాడుగా! అదే వ్యవహారం అంతా! ఎట్లనో వాడ్ని తీసుకపోండి. వాడు మహా మంచివాడు. ఊరంతా వాణ్ణి బంగారు కొండలాగా చూసుకుంటారు. ఈసారి వాడు చెప్పినట్టు పార్టీ పని చేస్తాడు" అని సలహా యిచ్చాడు రెండో రైతు.

"ఆయన్ని మాట్లాడనీయండి. నాకు వెళ్ళే వేళయింది. ఎక్కువసేవు యిక్కడుంటానికి వీలులేదు...ఏమండీ, ఏం చెప్పదలుచుకున్నారు మీరు?" అడుగుతున్నాడు అతన్ని అర్గనైజరు.

"నేను కోరేది ఒకటి. అది దళాలలోకి తీసుకోమని, నిజంగా పార్టీ పద్ధతిలో శత్రువులతో వ్యవహరించలేకపోయాను. దానికి కారణం వాళ్ళను చూడగానే, వాళ్ళు చేసిన రాక్షసాలు, దుర్మార్గాలు నా కళ్ళకుకట్టి, క్రోధం పెరిగి వచ్చి వాళ్ళను చీల్చిచెండాడ బుద్ధిపుట్టేది. అంచేత అప్పుడప్పుడు దారి తప్పి ప్రవర్తించేవాణ్ణి. ఇహ ఎప్పుడూ అలా చేయను. ఇది నా ప్రతిజ్ఞ. పశ్చాత్తాపంతో కూడిన

నిర్ణయం, పార్టీతో సంబంధం లేకుండా బ్రతకటం చాల కష్టం..." అన్నాడతను ఒక్కపట్టున ప్రవాహా వేగంతో.

"సరే మంచిది. కాని మీరు దళంలోకి తీసుకోకముందు ఏం చేస్తుండే వారు?"

"గ్రామ వలంటీరు దళాన్ని నిర్మించి, నాయకత్వం వహించి పార్టీకి యెంతో తోడ్పడ్డాను. దాను కమిటీ కామ్రేడ్స్‌ను కనుక్కోండి, నేను యెంతగా సహాయపడ్డదీ చెపుతారు. ఈ అరణ్యంలో రక్షణ స్థానాలు యేర్పరచి, సెంటర్లు చూసి, తిండిసప్లయి మార్గాలు కుదిర్చాను. నా శక్తి సామర్థ్యాలు చూసి పార్టీ దళంలోకి తీసుకుంది..."

"ఇంకా మీమీద ఆరోపణలు, అభియోగా లేమైనా వున్నాయా?"

"ఏం లేవు"— నిష్కర్షగా సమాధానం చెప్పాడు.

"దళం నుంచి సస్పెండు చేశారా, తీసేశారా?"

"తీసేసామని చెప్పారు"

"ఇంటికి వచ్చినప్పటినుంచి ఏం చేస్తున్నారు?"

"ఏం చేయమంటారు? చేసేపని చెప్పడానికే సిగ్గేస్తుంది! అడవిలో అడివిజంతువులమల్లే బ్రతికే నాకు పార్టీ ఒక నవ్యపథాన్ని, లోకాన్ని చూపించింది. ప్రజలు ప్రపంచం అంటే యేమిటో అరిచేతిలో వలిచిన పండులా చూశాను. ప్రపంచంలో పెరుగుతున్న దరిద్రానికి, సాగుతున్న దోపిడీకి కారణం యెవరో తెలుసుకున్నాను. వాళ్ళను తుద ముట్టించడానికి ఆయుధం పుచ్చుకొని పోరాడుతున్నా. నా అజ్ఞానం అమాయకత్వం, పసితనం మూలంగా పార్టీ ధర్మా

లను తు చ తప్పకుండా ఖచ్చితంగా అమలుపరచలేకపోయాను. అందుచేత పార్టీ నన్ను బయటికి పంపించింది. నాటినుంచి నేటిదాకా కంటినిండా నిద్రపోలేదు. కడుపునిండా తిండితినలేదు. అసలు తినబుద్ధి పుడితేనా? ఆందోళనతో కిందు మీదయ్యే నాకు నిద్రెలా పడుతుంది? ఏదో జీవిత సూత్రం తెగిపోయింది. కళ్ళున్నా సరిగా కనపడటంలేదు. జీవచ్ఛవంలాగా బతుకుతున్నా. ఒకవేపు నా సహచరులు, మిత్రులు, నేను అపారంగా ప్రేమించిన సమస్త ప్రజలు నిరంకుశత్వాన్ని ఎదిరించి నిర్భయంగా పోరాడుతుంటే, అనన్య త్యాగాలు నిత్యం చేస్తుంటే చూస్తూ యెలా వూరుకోను? ఇది నాకు చేతకాని పని. పార్టీ నన్ను క్షమించి దళాలలోకి తీసుకోకపోతే అట్టేకాలం బతుకుతాననే ఆశలేదు. దేశానికి పనికిరాని బతుకు బతికిమాత్రం ఫలితం యేంటి? పోయినా-వున్నా ఒకటే" అని కడుపులో పేరుకున్న చింతను బహిర్గతం చేశాడు.

"పార్టీలోకి తీసుకుంటే పూర్తిగా క్రమశిక్షణకు కట్టుబడి వుంటారా?"

"తప్పకుండా"

"మిమ్మల్ని వెంటనే దళాలలోకి తీసుకోవడానికి వీలుండదు. మూడునెలలు ఒక ఆర్గనైజరు దగ్గర కొన్ని బాధ్యతలు చూస్తూండండి. తరవాత మీలో మార్పు, అభివృద్ధి చూసి దళంలోకి తీసుకునే విషయం ఆలోచిస్తాం. దీనికి మీరు అంగీకరిస్తారా?"

"ఊఁ।"

"అయితే మనవాళ్ళతో మాట్లాడి, రేపే కొరియర్ను పంపిస్తా. అతనితో వచ్చేసేయండి. అనవసరంగా మనస్సు క్షోభపెట్టుకోవద్దు. పార్టీ ఎప్పుడూ మిమ్మల్ని ప్రేమగా, గౌరవంగా చూస్తుంది. మీరు ఇహ వెళ్ళిరండి" అని అతని విషయం తేల్చిచెప్పి వెళ్ళమన్నట్టు చూశాడు. అతను లేచి మందస్మితవదనారవిందుడయి ఆర్గనైజరుకు శాల్యూట్ చేసి నిష్క్రమించాడు.

* * *

ఏలాగయితేం, నర్సయ్య జోనుకమిటీ దళ సభ్యుడయ్యాడు. అనేక పరీక్షలు, పార్టీ ఆజ్ఞలు, బాధలు, అవస్థలు అధిగమించి, పార్టీ ప్రేమ చూరగొని ప్రజలు వేనోళ్ళ కొనియాడగా ప్రముఖ నాయకుడయ్యాడు. గుండాల ప్రాంతములో, కోయగూడేలలో ఒక ప్రియతమ నాయకుడుగా ప్రజలు చూస్తున్నారు. పూజిస్తున్నారు.

ఎన్నో దాడుల్లో పాల్గొన్నాడు. అద్వితీయ విజయాలు సాధించాడు. ఎన్నెన్నో భూమి పంపిణీ, ధాన్య జప్తులకు నాయకత్వం వహించాడు. పార్టీకి అనిర్వచనీయమైన ప్రేమ, గౌరవం ప్రోదిచేశాడు.

ఇవాళ జోనల్ దళం గుండాల క్యాంపుమీద దాడి చేయను బయలుదేరింది. నర్సయ్యకు విద్రోహుల ఇళ్ళు తగలబెట్టి, శత్రువు దృష్టి బలం విభిన్న మార్గాలలో కేంద్రీకరించేట్టు చేయను పంపించారు. ఇది చాల సాహసమయిన పని. ఆయుధం లేకుండా క్యాంపుచుట్టూవున్న విద్రోహుల

గుడిసెలమీద దాడి చేయాలి. ధైర్యానికి మారుపేరయిన నర్సయ్య ఈ కార్యక్రమం యిచ్చినపుడు తొణుకు బెణుకు లేకుండా అంగీకరించాడు. ఎవరు చేయను సాహసించలేని పని తను చేయడానికి సంకల్పించుకున్నందుకు నర్సయ్య హృదయం పొంగిత్తింది. ఆ ఉంగరాల జుత్తు అందం ఇప్పుడు బయటపడ్డది. నవయౌవనం తొణికే కోలముఖం కొత్తకళలతో మిలమిల మెరిసిపోతూంది. ఆ చారెడేసి కళ్ళు వెలిగిపోతున్నాయి.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..."

"ఠాం ఠాం ఠాం ఠాం ఠాం ఠాం..."

దళం ఒక్కసారి నలువేపుల క్యాంపును చుట్టేసింది. నర్సయ్య ద్రోహుల గుడిసెలకు నిప్పంటించాడు. గుడిసెలు గనగన కాలుతున్నాయి.

"...ఆ...నే చచ్చా...మరగయా...హా...అబ్బా దాహం...కట్టు...కట్టం...చ...స్తు...న్నా... మంచీళ్ళు" అంటూ అప్పుడే ఇద్దరు మిల్టరీవాళ్ళు బొక్కెడు నెత్తురు కక్కి చచ్చిపోయారు.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్..." మిల్టరీ గజ గజలాడుతూ, బీతావహంతో వణికిపోతూంది. గుంతల్లో పడుకొని ఒకటే కాలుస్తున్నారు అడ్డగోలుగా.

ఇరువేపుల తీవ్రంగా కాల్పులు సాగుతున్నాయి. కేవలం శత్రువు ధైర్యాన్ని నీరు కార్చడానికి, ప్లానులను భగ్నం చేయడానికి, నైతికబలాన్ని చిన్నాభిన్నం చేయ

డానికి వచ్చిన దళం-మెరుపుదాడి దిగ్విజయంగా చేసి నెమ్మదిగా వెనక్కి తగ్గుతూంది.

"వేయండి అరువుగా గొంతుమీదేయండి! పట్టుకోండి.. తన్నండి...నరకండి...క్యాంపుకు అప్పచెప్తే కావల్సినంత డబ్బిస్తారు...ప్రాణాలతో వుంచండి...తొరగా కళ్ళ గంత కట్టి క్యాంపుకు చేరేయండి! అందరికి తెలీకుండాచూడండి. తెలిస్తే మళ్ళీ మనం రేపు దక్కం" అంటూ పెద్దపెద్దగా కేకలు క్యాంపుచుట్టూవున్న గడితేరిన ద్రోహుల గుడిసెనుంచి వినపడుతున్నాయి.

ఇటు చూస్తే నర్సయ్య నెత్తురు మడుగులో విలవిల తన్నుకుంటున్నాడు. తొడ గొడ్డలి దెబ్బతో సగం తెగి వేలాడుతూంది. చేతులు కర్రల దెబ్బలతో చితికిపోయాయి. తల నెత్తురువోడి కడుతూంది. చేతులు విరిగున్నాయి. గొంతు గండ్రగొడ్డలి వేటుకు చాలభాగం తెగుంది. మనిషి నేలమీద నెత్తురులోపడి, మునిగి తన్నుకుంటున్నాడు. విపరీతంగా బుసపెడుతున్నాడు. ద్రోహులు పొంచి నర్సయ్యను నగ్గంతో వుచ్చువేసి, కడేసి, గొడ్డళ్ళతో నరికి స్వాధీనం చేసుకున్నారు.

విద్రోహులు సగం చనిపోయిన నర్సయ్యను గుండాల క్యాంపుకు చేర్చారు. రక్తతృష్ణతో నాలుకలు కోరుతున్న క్యాంపు హంతకులకు కావలసినంత ఎర దొరికింది. తమ మిత్రులిద్దరూ చచ్చారనే క్రోధంతో వుడికిపోతున్న మిల్టరీ నర్సయ్యమీదపడి ముక్కలు చెక్కలుగా బరుకుతూంది, నరుకుతూంది, చెక్కుతుంది. నర్సయ్య స్పృహ తప్పిందాకా

హింసించారు. ఆయన పడిపోయాడు! వాళ్ళ చేతులు నొప్పిలో వేలాడ బడ్డాయి.

మరునాడు సాయంత్రం నరసయ్యకు కొంచెం ఓపిక, స్పృహ వచ్చాయి. మళ్ళీ హింసాకాండకు ఉద్యమించారు. రహస్యాలు చెప్పమని వేధిస్తున్నారు. వళ్ళంతా పచ్చడి పచ్చడి అయివుంది. అయినా వాళ్ళకు బాధలేదు. మానవత్వం ఏ కోశానా లేదు.

“చెప్పరా బద్మాష్! మీ దళ కేంద్రం ఎక్కడుందో చెప్పు?” ఒకవేపు కొడుతూనే జమేదారు అడుగుతున్నాడు.

“నాకేం తెలియదురా బద్మాష్! మీ హింసాకాండకు జడిసి మీకు లొంగుతాననుకున్నారేమో, ఆ పిచ్చిభ్రమలు వదులుకోండి” అంటూ మూల్గుతున్నాడు గట్టిగా నర్సయ్య. కాని మాటలు బలంగా పలకడంలేదు బలహీనతవల్ల.

“చెప్పవురా కొడకా! చూడు, నువ్విట్లానే కుళ్ళి-కుళ్ళి చస్తావు...ఎట్లా చెప్పడో చూద్దాం. తగలనీయండ్రా” అని జమేదారు మాంసపు ముద్దయిన నర్సయ్యను కసకస తొక్కుతూ, హంతక మిత్రులను హింసాకాండకు పురికొల్పాడు.

“మీరు ఏమయినా చేసుకోండి దౌర్భాగ్యుల్లారా... హంతకులు చివరిరోజులు దగ్గర పడేకొలదీ అమానుషత్వానికి దిగజారుతారు. ఈ నిర్బంధం, దుర్మార్గం, హింసాకాండ, హత్యలు మిమ్మల్నే కట్టగట్టి ఒకరోజున అధఃపాతాళంలో పడేస్తాయి. అబ్బా...ఆ...అమ్మా...కమ్యూనిస్టులను జయించేది హింసతో కాదు, నిరంకుశ హస్తంతో

కాదు...ప్రేమతో, హృదయంతో, స్నేహంతో అన్నపూర్ణ చేతితో జయించవచ్చు. ఎన్నాళ్ళు మీరు ఆయుధాలతో, హత్యలతో పరిపాలన వెలగబెట్టదలచారో అన్నాళ్ళు మీరు ప్రాణాలు అరిచేతిలో పెట్టుకొని బ్రతకాలి. ఇది మాత్రం మరిచిపోవద్దు. అబ్బా..ఆఁ..ఊఁ..హా..నా నోటినుండి ఒక్క రహస్యం అయినా మీరు వినలేరు..." అంటూ బాధతో మెలికలు తిరుగుతున్నాడు నర్సయ్య. ఇప్పటికే శరీరంలో చాలభాగం ముక్కలుగా తెగి, తునిగిపోయింది. ఇప్పుడు మిలట్రీ రాక్షసులు వ్రణమయిన శరీరం మీద పండుకారం బెత్తెడెత్తున మెత్తివేశారు. లాఠీలతో చితకకొడుతున్నారు. బూట్లతో తొక్కుతున్నారు. గోళ్ళలో సూదులు చెక్కుతున్నారు.. అబ్బా..ఆ ఘోరం చెప్పడం చాల కష్టం! చావకుండా మాత్రం మంచినీళ్ళు తాపుతున్నారు. ఎలాగూ జయించలేక కిరసనాయిలులో గుడ్డపేలికలు తడిపి వంటిమీద వేసి వుడకబెడుతున్నారు—ఒక్కొక్క అవయవం వుడికి, మాడి, బొగ్గులాగా అయిపోతూంది...నర్సయ్య ప్రాణాలు కనుకొలుకుల్లో కొట్టుకుంటున్నాయి.

కాసేపట్లో నర్సయ్య కాలి, మాడి, మసిబొగ్గులా మారిపోయాడు! ఆ వికృతరూపం చూస్తే పసిపిల్లలు గుండె లాగుతాయి! ఒకటే తిన్నుకుంటున్నాడు..గిలగిల కొట్టుకుంటున్నాడు..అహో! ఆయన ప్రాణం ఎంతగా క్షోభపడుతుందో! ఎంత వేదనతో తల్లడిల్లుతుందో! ఎన్ని విధాల నిరంకుశప్రభుత్వాన్ని శపిస్తుందో! అయినా మిల్టరీ జయించలేదు!

క్యాంపుదగ్గరే కాదు పేర్చారు. ప్రాణాలతో వున్న

నర్సయ్యను కాట్లో పడేసి, పెట్రోలుపోసి నిప్పుపెట్టారు. ఎగిరి యివతల పడుతున్న నర్సయ్యను బలవంతంగా నల్గురు పట్టుకొని నాల్గుసార్లు లోపల విసిరారు. క్షణంలో నర్సయ్య మంటలు తాగి మాయమయ్యాడు.

"నీకోసం పూచిన పువ్వు ఆఘ్రాణించకుండా, నీ కోసం వేచిన నవ్వు వీక్షించకుండా అప్పుడే వచ్చావా నా బిడ్డా..." అంటూంది దిగులుగా సజల నేత్రాలతో నేలతల్లి బూడిద ముద్దయిన—కోయవీరుడు నర్సయ్యను బాధగా కడుపులోకి తీసుకుంటూ...



# ఇద్దరు మహావీరులు

యాత్ర అయిపోయింది. రజాకారు సర్పాలు అంతరించాయి. వాటి బొందలమీదే అంతకంటే ప్రమాద కరమయిన, భయంకరమయిన యూనియన్ మిల్టరీ రాక్షసులు ఆవిర్భవిస్తున్నారు.

రజాకార్లు పోయారనే సంతోషంతో శాంతిగా తెలంగాణ ప్రజ కన్ను పూర్తిగా మూసి కునుకుతీస్తూంది. నిండు నిద్రలో కాలి, కూలి యిల్లు పైనపడ్డది. లేచి చూస్తే 'హా హా కారాలు' మృత్యురోదనలతో దిక్కులు పిక్కటిల్లు తున్నాయి. ఎటు చూసినా ఏడ్పులు, పెడబొబ్బలు, అరుపులు, ఆర్తనాదాలు—గగ్గోలు పెడుతున్నాయి. తల్లీ-పిల్లా, భార్యా—భర్తా, అన్నా—చెల్లీ తలొకదారి అయ్యారు. చెట్టుకొక్కరు, గుట్టకొక్కరుగా చెల్లాచెదురు అయి పచ్చని జన సందోహం అల్లాడి ఆకులు మేస్తూంది. ఒక గండం గడిచి గట్టెక్కామనుకున్నామే! ఇంతలో ఏ ప్రమాదం ముంచుకొచ్చిందని తెలంగాణా ప్రజ రెండు చేతులతో తల పట్టుకొని తల్లడిల్లుతూంది! పరిపరి విధాల ఆలోచించింది, పరికించింది, పరిశీలించింది, పసికట్టింది.

ఈ దారుణ మారణహోమానికి కారణం అర్థమైంది. ఏ హంతక హస్తాలు — ఈ దౌష్ట్యవృష్టి వర్షిస్తున్నాయో

అవగత మయింది. ప్రజల కాళ్ళు నరికి పరిపాలించే రజాకార్లు, నైజాం మిల్టరీపోయి తలలుతుంచి రాజ్యం చేసే కాంగ్రెసు రౌడీలు, యూనియన్ మిల్టరీ అధికారానికి వచ్చారని తెలుసుకున్నారు. ఈ గండకత్తెర జీవితంలో కలకాలం మగ్గలేక అటో - యిటో తేల్చుకోను ఆయుధం ధరించారు.

నైజాం ప్రభుత్వంతో హోరాహోరి పోరాడిన ప్రజా విముక్తి సైనికులు — గెరిల్లా దళాలు యూనియన్ మిల్టరీ దౌర్జన్యాన్ని, దోపిడీనికూడ అప్రతిహతంగా ప్రతిఘటిస్తున్నాయి. ప్రజలు దళాల నాయకత్వాన సంకుల సమరం సాగిస్తున్నారు.

కాని యూనియన్ మిల్టరీ రంగంలో ప్రవేశపెట్టిన అధునాతన ఆయుధాలు, ఆరితేరిన మిల్టరీ, విపరీత నిర్బంధం, చెప్పరాని నిరంకుశత్వం — కొంతమంది కామ్రేడ్స్ మనోనిబ్బరాన్ని నీరుకార్చాయి. ఎక్కడ చూసినా క్యాంపులు, మిల్టరీ, ప్రభుత్వ వ్యానులు కొందరు కామ్రేడ్స్ నైతిక బలాన్ని పీల్చిపారేశాయి. అకస్మాత్తుగా పార్టీమీద, ప్రజల మీద మహోధృతంగా రాక్షస బలంతో యూనియన్ మిల్టరీ దాడిచేయడంవల్ల గెరిల్లా దళాల పటిష్ట ప్రాంతాలు సెరియ లింకాయి. గెరిల్లా దళాలు, వ్యక్తులు కొంతమంది దాడుల తీవ్రతలో చిన్నాభిన్నమయ్యారు. పోరాట వ్యూహం చెక్కు చెదిరింది. శత్రువు వేరుకావడంతో, వ్యూహం ఎత్తుగడలు, ఆచరణమార్గం కూడ కొత్తగా రూపొందించుకోవాల్సిన అవసరం ఆసన్నమయింది. ఈపని చేయడానికి కొంత వ్యవధి ఆసన్నమయింది. ఈ వ్యవధి సమకూర్చుకునే సంధిసమ

యంలో శత్రువు పూర్తిగా పార్టీని, ప్రతిఘటనోద్యమాన్ని నామరూపాలు లేకుండా చేయడానికి సంకల్పించుకొని విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు. కనీ వినీ ఎరుగని ఘోరాలకు, కుతంత్రాలకు దిగజారాడు. ఎలానయినా పార్టీని నాశనం చేయాలనే ప్లాను తప్ప - ఇది న్యాయం, అన్యాయం, ఇది సైనికనీతి, రాజకీయ ఎత్తుగడ - అనే ఆలోచన, విచక్షణ లేకుండా శత్రువు గంగవెర్రులతో విజృంభించాడు.

చంద్రయ్య దళంకూడ శత్రుదాడుల్లో తలోవేపయ్యారు. అభివృద్ధికాని కామ్రేడ్సు నలుగురు యూనియన్ సైన్యాల సంఖ్య, ఆర్భాటంచూసి బెత్తబడి ముందు-వెనక ఆలోచించే బలహీనతలో ఇరుక్కుపోయారు. వీళ్ళు నైజాం కాలంలో కుప్పతిప్పలుగా, మందలుగా దళాలు నిండిన గ్రామదళాలలోని వ్యక్తులు. నైజాం కాలంలో, రజాకార్ల హయాంలో దళాలు చండప్రచండంగా దిగ్విజయాలు సాధిస్తుంటే విపరీతంగా యువకులు, యువతులు, వృద్ధులు దళాలలో చేరడానికి సంసిద్ధులయ్యారు. వేధించి దళాలలో చేరారు. ఇప్పుడు నిస్తబ్ధత, బలమయిన శత్రువు ఎదురు పడగానే అధైర్యం, చొరవ అంతా అంతిగా చూపలేకపోతున్నారు. చంద్రయ్య దళాన్ని కూడదీశాడు. అందర్నీ ఒక చోట చేర్చి దళాన్ని పట్టాలమీద పెట్టే ప్రయత్నం చేస్తున్నాడు. పార్టీ సంబంధాలు తెగిపోయాయి. ఎక్కడ ఎవరున్నారో, ఎవరు మిత్రులో శత్రువులో తెలుసుకోవడానికి వీలు లేకుండా వుంది. పదిమంది దళానికి—నలుగురు తిరోగ

మనశ్రోవలో వున్నారు. నలుగురు చిన్నాభిన్నమయిదళాన్ని కలుసుకోలేదు. ఇహ గట్టిగావుంది తాను, తనతోపాటు ఉద్దండుడు వెంకటయ్య. అయినా చంద్రయ్య ధైర్యం కోల్పోలేదు. బలహీనతల్లో వేగుతున్న నల్గురు కామ్రేడ్స్‌కు అనేక విధాల నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. ఫలితం అంతగా కనపడటంలేదు. ఎటుచూసినా ఆశ ఆవగింజంత దృక్కుకు తాకడంలేదు.

ఒకరాత్రి లేచి చెప్పకుండా ఈ నల్గురు పిరికిపందలు యూనియను మిలటరీశరణుజొచ్చి, రాజీనామాలిచ్చి, బ్రతుక్కు గ్యారంటీ అర్థించారు. విజయపరంపరల్లో ఎంతయినా ధైర్యం, సాహసం, శౌర్యం, సామర్థ్యం చూపించవచ్చు. కాని ప్రమాదాల్లో ప్రయాణం చేయాల్సి వచ్చినప్పుడు అందరికీ ఆ స్తిమితం, ధైర్య స్థయిర్యాలుండవు. విప్లవకారులుమాత్రం ఎంతగా మార్గం సంకీర్ణమయితే, జీవితం దుస్సహమయితే, పరిస్థితులు దుర్భరమయితే, ఆశలు నిరాశలయితే, ప్లానులు భగ్నరాసులయితే-అంత బ్రహ్మాండంగా ప్రళయంగా, అఖండంగా. అజేయంగా నిశ్చల చిత్తంతో, నిర్మల హృదయంతో, అనమాన మేధస్సుతో విజృంభిస్తారు. విక్రమిస్తారు, విజయాలు సాధిస్తారు. ఈ సత్యం కేవలం పరిపూర్ణ కమ్యూనిస్టు విప్లవకారులకు మాత్రమే వర్తిస్తుంది. పార్టీ చైతన్యం పూర్తిగా వంటబట్టని కామ్రేడ్స్ ప్రళయాలు ఎదురయితే తిరగబడి పరిహరించలేరు.

పొద్దున్న లేచిచూస్తే నలుగురు కనపడలేదు. చంద్రయ్య, వెంకటయ్య చాలా ఆందోళన పడ్డారు. ఆ వేదన

ఉండారు త్వరలోనే ఒక సమాధానానికి వచ్చారు. వీళ్ళు ఎక్కడికెళ్ళింది మొదట తోయలేదు. సైనికుడి ఆత్మ పిరికితనం పొదిగి ఎదగనిస్తే - అదెక్కడకు దారితీస్తుందో చంద్రయ్య, వెంకటయ్యలకు స్పష్టంగా తెలుసు. అందుకే వాళ్ళు వెళ్ళిపోయినందుకు బాధపడలేదు. త్వరలోనే, ఏ నష్టం చేతిలో పెట్టకుండా పోయినందుకు సంతోషించారు. “మనం ఇద్దరం ఇలా ఎన్నాళ్ళు తిరుగుదాం? ఏం చేద్దాం?” అని అడిగాడు వెంకటయ్య అరణ్యంలో కళింగ చెట్టు క్రింద దిగాలుపడి కూర్చున్న చంద్రయ్యను. “ఏం, మనంకూడ రాజీనామాలకెళ్దాం అంటావా?” కటువుగా ఎదురు ప్రశ్న వేశాడు చద్రయ్య- స్వెల్వబోర్ ఆయుధం పక్కకుపెట్టి, తలకింద రెండుచేతులు పెట్టుకొని కటిక నేలమీద పడుకుంటూ. “ఆ మాట నే ననలేదు. నా వుద్దేశంకూడ అది కాదు చావో, బ్రతుకో, వాళ్ళో మనమో తేలిందాకా పోరాడాల్సిందే! కానీ పార్టీతో సంబంధం లేకుండా, ఎవరెక్కడుందీ, ఏం చేస్తుందీ తెలీకుండా ఎలా పోరాడటం? ఎన్నాళ్ళు పోరాడగలం? ఏమిటి ఫలితం? ప్రజలేమో యూనియను సైన్యాల రాక్షసహింసలు పడి గజగజలాడి పోతున్నారు. ద్రోహులు ఎక్కువయిపోయారు. పారిపోయిన దేశముఖులు - పటేల్, పట్వారీలు తిరిగివచ్చి మిల్టరీ అండతో మనమీద కసితీర్చుకుంటున్నారు....”

మధ్యలో చంద్రయ్య అడ్డుపడ్డాడు. “ఎందుకు వెంకటయ్యా ఆ సొదంతా? మనముందు వుందల్లా ఒకటే సమస్య: కర్కోటక రజాకార్లను ఎదిరించి పోరాడిన చేతులతో రాక్షస

యూనియను మిల్లరీని ఎదిరించి పోరాడటమా, లేక నమస్కరించి, ఆశీర్వదించి ఆహ్వానించడమా అనేది. ఈ అతిస్పష్టమైన విషయంపట్ల మనం ఒక నిశ్చిత నిర్ణయానికి వస్తే మన మార్గం తీర్చిదిద్దిన సిమెంటు రోడ్డులా కనపడి, కాళ్ళు చుట్టుకుంటుంది. ముందా సంగతి తేల్చండి" అనిఅడిగాడు కమాండరు చంద్రయ్య కొంచెం తీక్షణమైన వదనంతో. "ఒకహంతకుణ్ణి హతమార్చను ఎత్తిన హస్తం అంతకంటే ఎక్కువ చేతులు తిరిగిన నరహంతకుల్ని బొందపెట్టను వెనుకాడదు. అయితే ఒక ప్లాను, పద్ధతి, పార్టీ నాయకత్వం లేకుండా అనవసరంగా ఆహుతి అవటం వల్ల సార్థకమేంటి?" వెంకటయ్య విస్పష్టంగా హృదయం విప్పాడు.

"నేను చెప్పేది నీవు పూర్తిగా అర్థం చేసుకోవటం లేదు వెంకటయ్యా! మనం దళాన్ని పునర్నిర్మిద్దాం. శక్తి వంచన లేకుండా శత్రువుతో పోరాడుతుందాం. ప్రజలకు మనం పంచిన భూములు—జమీందార్లు మిల్టరీ రక్షణతో తిరిగి ఆక్రమించుకుంటున్నారు. ప్రజలమీద కసితో చాలా అన్యాయాలు, అక్రమాలు చేస్తున్నారు. ఇది జరగకుండా చేద్దాం. దీనివలన ప్రజలలో ఆత్మధైర్యం కలిగి జారిపోకుండా ప్రవర్ధమాన మవుతుంది. ఎక్కడో ఒకడో ఇద్దరో దుర్బలులు చేస్తున్న రాజీనామాలతో ప్రజలలో అసంతృప్తి అలజడి, అధైర్యం వ్యాపించకుండా అరికట్టిన వాళ్ళమవుతాం. శత్రువుకూడ 'కమ్యూనిస్టుల్ని తుడిచేశాం. గెరిల్లాలంతా పురుగు లేకుండా చనిపోయారు. పోరాటంలేదు గీరాటంలేదు' అని పూరూరు తిరిగి డప్పులతో ప్రచారం

చేయలేకపోలాడు. చేసినా విలువ లేకుండా పోతుంది. ఇంతలో పార్టీతో మనకు తప్పకుండా సంబంధం కలుస్తుంది. మనం చేసిన పని పార్టీ హార్షిస్తుంది. ఈ మిల్టరీ దౌర్జన్యాన్ని ప్రతిఘటించడం కంటే పార్టీ మరో కార్యక్రమం తీసుకోదు" అని అనర్గళంగా చెపుతూ చంద్రయ్య ఆయుధం శుభ్రం చేస్తున్నాడు.

పొద్దు పశ్చిమదిశ వాలింది. అరణ్యంలో బ్రహ్మాండంగా నీడలు విస్తరిస్తున్నాయి. చల్లని మందమారుతం గల గల లాడుతూంది. పక్షులు, జంతువులు సరససల్లాపాలాడుతున్నాయి.

"నేను మాత్రం కాదన్నానా, సరే ఏం చేద్దామో చెప్పండి. అలాగే ఒక పద్ధతిలో దళాన్ని నిర్మాణంచేద్దాం. పోరాటం సాగిద్దాం, మిల్టరీ అంతు కనుక్కుందాం" అంటాడు వుద్రేకంగా వెంకటయ్య తెగిపోయిన చెప్పులు, తిగలంతో పళ్ళు బిగపట్టి ముడేస్తూ, బిగదీస్తూ.

"భేష్ కామ్రేడ్ వెంకటయ్యా! నీకు అభివందనాలు. మనం యిద్దరం కలసి విక్రమించామా యూనియన్ మిల్టరీ ఢిల్లీకి ప్రయాణం కడుతుంది. రేపే దళనిర్మాణానికి పునాదులు ఏర్పరుద్దాం" అంటూ చంద్రయ్య లేచి పక్కన కూచున్న వెంకటయ్యను అభినందించాడు.

## II

నైజాం కాలంలో నేలంచ మిరియాలపెంట, కుమ్మరికుంట్ల, ముప్పారం, కొదకండ్ల, రైలుకట్ట, మోతుకూరు,

నల్లకుదురు-ఇత్యాది అనేక దాడుల్లో పాల్గొని దిగ్విజయాలు సాధించి ప్రఖ్యాతి వహించిన దళకమాండరు చంద్రయ్య మళ్ళీ దళాన్ని వెంకటయ్యతో నిర్మించి యూనియన్ మిల్టరీ కొంకులు తెగగొడుతున్నాడు యూనియన్ సైన్యాలుదళంకోసం అహర్నిశాలు కళ్ళు కాగడాలుచేసి, చేతులు ఆయుధాలుచేసి శోధిస్తున్నాయి, ప్రజల్ని పట్టించమని వేధిస్తున్నాయి. ప్రజల్లో ప్రతీకార జ్వాలలు వెలిగించి ప్రతిఘటన తీవ్రతరంచేసి, చంద్రయ్య దళం ప్రచండ శక్తిగా పరిణతి చెందుతూంది.

యూనియన్ మిల్టరీ పారిపోయి దేశాలుపట్టిన దుర్మార్గులను దోపిడీదార్లను, జమీందార్లను, పీడక గ్రామోద్యోగులను తీసికొచ్చింది. వాళ్ళు ద్వేషంతో ప్రజలమీద విపరీతంగా దౌర్జన్యం చేస్తున్నారు. ప్రజలు పంచుకున్న దురాక్రమణ భూములు దౌర్జన్యంగా ఆక్రమిస్తున్నారు. ప్రజలు నాలుగేళ్ళపాటు చేసుకొని అనుభవించినందుకు దండగలు వసూలు చేస్తున్నారు.

కుమ్మరికుంట్లలో పొద్దుపొడిచి కాసేపయింది. నాలుగేళ్ళబట్టి మారుముఖం చూడని ప్రఖ్యాత జమీందారు జన్నారెడ్డి ప్రతాపరెడ్డి సహచరులతో, జమీందారు మిత్రులతో వూళ్ళోదిగాడు. వూరంతా కలకలంతో అట్టుడుకుతూంది. ఆయనతో పాటు నాలుగు వ్యానుల్లో, జీపుల్లో పంజాబు సిక్కు-మిల్టరీ, ఆఫీసర్లు వచ్చారు. చాల గగ్గోలుగా వుంది. ఊరంతా కుతకుతలాడుతూంది. ఊరిమీదపడి మిల్టరీ ఇళ్ళల్లో ధాన్యం అంతా ఒకచోట రాసిపోస్తున్నారు ఇళ్ళల్లో వున్న వస్తువులు, డబ్బు, వెండిబంగారం దోస్తున్నారు.

'ఇదేమి అన్యాయం' అనిఅడిగితే 'జమీందారుగారి భూములు యిన్నాళ్ళబట్టి మీరు చేసుకొని తిన్నారు. దానిబదులు ఆయనకు మీ దంతా పోగుచేసి యిస్తున్నాం' అని వాళ్ళ సమాధానం. ఆడవాళ్ళు - మగవాళ్ళు ఖిన్నులయ్యారు. కళ్ళనీళ్ళు కుక్కుకుంటున్నారు. ఎన్నాళ్ళనుంచో, ఎంతో చెమట, రక్తం కలిపి కూడబెట్టుకున్న బంగారుపంట, ప్రియతమ వస్తువులు కొల్లగొడుతుంటే — నిలువునా తమను చీరి, చీలుస్తున్నట్టుంది వాళ్ళకు. పది లారీలుకూడ వచ్చాయి. లారీలలో ధాన్యం పోస్తున్నారు. 'గీ, బా' అంటూ పిల్లా-జల్లా అల్లాడుతున్నారు. 'లబోదిబో' మంటూ ఆడవాళ్ళు ఏడుస్తున్నారు. పరాభవం జరిగే స్త్రీలు నోళ్ళలో గుడ్డలు కుక్కినా గావుకేకలు పెడుతున్నారు. మగవాళ్ళు తంతుంటే చేసేదిలేక కళ్ళతో క్రోధంగా మిల్టరీని గుచ్చుతున్నారు. మిల్టరీ ఒకబ్యాచి వూరిమీదపడి ప్రజల్ని హింసిస్తూంది. ఇదంతా చూస్తూ జమీందార్లు ఆనందిస్తున్నారు. ఆఫీసర్లు సంతోషిస్తున్నారు.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..."

"ఠాం ఠాం ఠాం ఠాం ఠాం...ఠాం...ఠాం..."

క్షణంలో వూరు నాలువేపులనుంచీ స్టెన్, రైఫిలు, హెన్రీమార్టిన్ తుపాకుల గుళ్ళు భూనభోంతరాళాలు గగ్గోలు పరుస్తున్నాయి. మిల్టరీ తలలుమీదుగా, వెన్నుమీదుగా, కాళ్ళసందుగా దూసుకపోతున్న తుపాకిగుళ్ళ జల్లుతో జమీందార్లు, ఆఫీసర్లు, సిక్కుసైనికుల గుండెలు జారాయి. జడిసి గడగడ వణికారు. జీపులు, వ్యానులు, ఎక్కి పలాయనం

చిత్తగించారు. వ్యానుల్లో పారిపోతూ పైకి కాలుస్తున్నారు. ఒక్క నిముషం నిలబడి పోరాడే సత్తా వాళ్ళకు నిరంకుశ ప్రభుత్వనీతి అందజేయలేదు.

ప్రజలంతా పిన్నా-పెద్దా, వృద్ధులు ఎదురెళ్ళి కోలాహాలం చేస్తూ చంద్రయ్య దళాన్ని వూళ్ళోకి తీసుకొచ్చారు. ఊరేగించారు. జయజయధ్వానాలతో అభినందించారు. చంద్రయ్య కూడిన మహాప్రజలతో సభచేసి, ప్రస్తుత పరిస్థితి, పార్టీ కార్యక్రమం గూర్చి వుపన్యసించాడు. విప్లవగీతాలతో, నినాదాలతో సభ జయప్రదంగా ముగిసింది. చంద్రయ్య, వెంకటయ్యలు దళ సహాయంతో ఎవరి ధాన్యం, వస్తువులు వాళ్ళకు పంచిపెట్టారు. పాపం మిల్టరీ పోగుచేసిన ధాన్యం, దోచుకున్న ఆస్తి చిల్లిగవ్వంతయినా తీసుకోకుండానే పారిపోయ్యారు.

ఆనేక దాళ్ళుచేసి అసమాన కీర్తిప్రతిష్ఠలు పార్టీకి కూడబెడుతున్న చంద్రయ్య దళం వునికి పార్టీ తెలుసుకుంది. సంబంధం కలిపింది. పార్టీ సంబంధంతో, నాయకత్వంతో చంద్రయ్య ద్విగుణీకృతోత్సాహుడై పోరాట కార్యక్రమం ముందుకు తీసుకెళ్తున్నాడు.

మిల్టరీ వాళ్ళతో తీవ్రత రోజురోజుకు హెచ్చుతుంది. ఆగపేట అనుకుని వున్న అడవిలో దళం చాల అలసి మైమరచి నిద్రపోతూంది. అరణ్య వృక్షతతి కిక్కిరిసి కళ్ళు మూసి గుర్రుపెడుతూంది. ఎక్కడా చీమ చిటుక్కుమనటం లేదు.

"ఆగరా, ఆగు ఆగు...కైరో మాకీ ల...డా"

అంటూ చెట్టుదుమికి పారిపోతూ "మిల్టరీ కామ్రేడ్స్! మిల్టరీ తప్పుకోండి" అని కేక లేస్తున్న సెంట్రీని మిల్టరీ చుట్టేసి పట్టుకోను విఫల ప్రయత్నం చేస్తున్నారు. చంద్రయ్య దళం ఈ నడి కన్నది. తక్షణం తోకతొక్కిన త్రాచులాగా లేచి తోక మీద నిలబడ్డది.

"ఠాం... ఠాం... ఠాం... ఠాం... ఠాం... ఠాం"

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..." దళ కామ్రేడ్సంతా పైకొచ్చే నలభై మంది మిల్టరీ, ఇరవై మంది హోంగార్డులకు ఎదురునడిచి కాలుస్తున్నారు. దళం దెబ్బ వినగానే మిల్టరీ, హోంగార్డుల కాళ్లు చల్లబడ్డాయి గుండెలు మోకాళ్ళమీద పడిపోయాయి.

"ధన్ ధన్ ధన్ ధన్......" కాలికి బుద్ధిచెపుతూ మిల్టరీ కాలుస్తుంది.

ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......" దళం వెంబడి తరుముతూ కాలుస్తూంది. బ్రతుకుజీవుడా అంటూ పారిపోయే మిల్టరీ, హోంగార్డులు ఒకరిద్దరు పడిపోయారు...నల్లురయిదుగురు గాయపడి రక్తం చిమ్ముస్తూ పరిగెతుతున్నారు.

కోయబాలయ్యను ఇవ్వాళ మిల్టరీ కాల్చిపారేస్తుందనే వార్త దళానికి అందింది. ఆయన్ను యెన్నాళ్ళో క్యాంపుల్లో హింసపెట్టి, అడవికి అప్పజెప్పడానికి నిర్ణయించుకున్నారు. దళం అంతా బాధతో, క్రోధంతో కుంగిపోయారు; క్రుద్ధులయ్యారు.

నేలంచిగండి దగ్గర తోగు చాల లోతుగా వుంటుంది. రోడ్డు ఇరుప్రక్కలా దట్టమయిన అరణ్యం, మధ్యాహ్నం నిశ్శబ్దంలో తపస్సు చేస్తూంది. మిల్టరీవాళ్ళు పన్నెండుమంది రైఫిళ్ళు, బ్రెన్‌లు ధరించి బాటయ్యను రోడ్డువెంట కాళ్ళు కట్టి కాల్చిపారేయను లాక్కొస్తున్నారు. బాటయ్య ముఖంలో ఎక్కడా నెత్తురుచుక్క లేదు. ముఖం అంతా హింసాకాండతో మాడి, వాడి, కమిలి, కుమిలి నల్లగా అట్టకట్టింది కళ్ళు లోతుకు పీక్కుపోయి పాతాళంలో ఆరిపోతున్న గుడ్డి దీపాలలా కదులుతున్నాయి; కనిపిస్తున్నాయి. వళ్ళంతా పెద్ద గాయమయి సీరుకారుతూంది; నెత్తురు వడుస్తూది, చీము కారుతూంది. చేతులకు సంకెళ్లు వేశారు. చేతులు, కాళ్ళు ఒక పెద్ద మోకుతో కట్టి అడవిజంతువును లాక్కెళ్ళినట్టు తీసికెళుతున్నారు. వంటిమీద నిండా బట్టలేదు! మొలకు కాస్త గోచి వుంది. మృత్యువును సేవించను వెళుతున్నా ఆయన సాగరగంభీరంగా వున్నాడు.

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..."

"ఆ(......అబ్బా)....మరగయా....చచ్చాన్రో... ...మంచీళ్ళు........" అంటూ పడిపోతూన్న మిల్టరీ చావుకేకలు పెడుతోంది. దళం నేలంచగండిలో మాటుకాసి మిల్టరీమీద దాడిచేసింది. మిల్టరీ వెంటనే పడుకుంది. కాల్పులు ఆరంభించింది బాటయ్యను పారిపోకుండా గట్టిగా అదిమి పట్టుకున్నారు. దళం ఆశించినట్టు బాటయ్యను విడుదలచేయలేకపోయింది. కారణం శత్రువుదగ్గర బ్రెన్‌లు, స్టెన్‌లు వున్నాయి. దెబ్బతిన్న వేడితో విపరీతంగా కాలుస్తు

న్నారు. వెంటనే ఒక మిల్టరీవాడు చనిపోయాడు. నల్గురు తీవ్రంగా క్షతగాత్రులయ్యారు.

"ఇహ పోండి దౌర్భాగ్యుల్లారా! మీ దుర్మార్గానికి, ద్రోహానికి శిక్ష చాలు, పోండి. బాటయ్యను చంపుతున్నందుకు తగిన శిక్ష అనుభవించారు! ఎప్పుడూ గెరిల్లావీరులు వద్ద హింసాకాండ, గురయిన హత్యాకాండ వృథాగా పోదు. అది వడ్డీతో మీ రక్తాన్ని గ్రోలుతుంది! మీకు మృత్యువు ప్రసాదిస్తుంది!" అంటూ చంద్రయ్య మిల్టరీని హెచ్చరిస్తూ దళాన్ని తిరోగమించమని పిలుపిచ్చాడు!

చంద్రయ్యదళం వాళ్ళతోపాటు, ప్రజలు పంచుకున్న భూమిరక్షణబాధ్యత కూడ అతి జాగ్రత్తతో చూస్తూంది. అంచేతే ప్రజలు చంద్రయ్యను కళ్ళల్లో పెట్టి కాపాడుతున్నారు.

అప్పరాజుపల్లిలో పొట్టి ఘోషారెడ్డి క్యాంపుపెట్టింది నిత్యం అనేక అన్యాయాలూ ఘోరాలు చేస్తున్నాడు. ఈ రజాకారుతొత్తు ఇప్పుడు కాంగ్రెసుమతం పుచ్చుకున్నాడు. దళాలకోసం మిల్టరీని వెంటేసుకొని అడవులన్నీ, నీటి వొనరులన్నీ గాలిస్తున్నాడు. ఎవరయినా అన్నంపెట్టారని తెలిస్తే, దళాలకు సహాయం చేశారని వింటే - వాళ్ళను చిత్రహింసలు పెడుతున్నాడు. అమాయక ప్రజల్ని, పార్టీతో సంబంధం వున్న వ్యక్తుల్ని నిర్దాక్షిణ్యంగా దగ్గరుండి కాల్పించి, తాను పేర్చిన కాళ్ళల్లోవేసి తగలబెట్టిస్తున్నాడు. ఎప్పుడూ పది పన్నెండు కాళ్ళు ముందే సిద్ధంచేసి ఉంచుతాడు. వారానికి

వల్లనో ముగ్గురో అతని అమానుషత్వానికి ఆహుతి అవుతారు. మళ్ళీ కొత్త కాళ్ళు సిద్ధమవుతాయి.

తెల్లవారుజామున వచ్చి మట్టెవాడ పొలిమేరల్లో పడుకున్న దళం పొద్దు బారెడెక్కినా లేవలేదు. చుట్టూ చెట్లు, పొదలు, రెల్లుగడ్డి, వంకలు, వాగులు, వడ్లు ఉండడం వల్ల దళం గుండెమీద చేయిపెట్టుకొని నిండునిద్రతీస్తూంది. సెంట్రీగా ఉన్న కామ్రేడ్ కూడ కన్నుకునికాడు.

"ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్..." హఠాత్తుగా నలువేపులనుండి మిల్టరీ, దొరలు, పటేల్, పట్వారీలు ఘోషారెడ్డి నాయకత్వాన దళంమీద కాల్పులుచేస్తున్నారు.

"కామ్రేడ్స్ లేవండి. మిల్టరీ! కాల్చండి!! కామ్రేడ్ వెంకటయ్యా చూశావా దొరల్ని, ఘోషారెడ్డిని, హోంగార్డులను!! వాళ్ళపని నువ్వు పట్టు!! ఈ దెబ్బతో జీవితమంతా వాళ్ళూ, వాళ్ళ జాతి తలెత్తకుండా ఉండాలి!" పిడుగులాగా ఖణఖణ గర్జిస్తున్నాడు చంద్రయ్య.

"నే నీ వేపు గండికొడతా, నువ్వు మిల్టరీని ఆపు చంద్రయ్యా! వాళ్ళు మనల్నేం చేయలేరు. జయం మనది." అంటూ వెంకటయ్య రైఫిలు పుచ్చుకొని యెనుకెళ్ళి చెట్ల చాటున నక్కి కాలుస్తున్నాడు.

"కామ్రేడ్స్! అంతా కట్టగా, జాగ్రతగా ఎదురు కాల్పులు చేయండి! శత్రువు చాల ఖంగారులో వున్నాడు" అంటున్నాడు చంద్రయ్య దళసభ్యుల్ని ఉద్దేశించి.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......" దళం

రివ్వన శత్రువ్యూహాన్ని తుత్తునియలుచేసి కాల్పులు కాలుస్తూంది.

ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం..."

మిల్టరీ తుపాకులు బలంగా, గురితో కాల్చలేకపోతూంది. దళ కాల్పులు ఉధృతంతో మిల్టరీ కాల్పులు పలచబారాయి. గురి తప్పి అన్ని పక్కలకు, పైకి, కిందికి దూసుకుపోతున్నాయి.

ఇ తల్లో ఆర్తనాదాలు, మృత్యురోదన శత్రుపక్షం నుండి వినపడుతున్నాయి. జయజయధ్వానాలు, వినాదాలు, గీతాలు దళంవేపునుంచి సాగుతూన్నాయి

"హా...ఆ...అబ్బా...అమ్మో...ఊ...హుమ్...హా దేవ్యా...ఆ ...ఓ దేవుడా....కృష్ణా....రామా...." అంటూ మొరుగుతున్నారు—నెత్తురు కక్కుతూ దొరలు, మిల్టరీ, హోంగార్డులు, చెట్టుకొకరు గుట్టకొకరుగా పలాయనం చిత్తగించారు.

"చావండి ద్రోహులారా, నిద్రించేవాళ్ళ గొంతులు కోయనువచ్చిన హంతకులకు ఇంతకంటే మంచిచావు అనవసరం! ఏమిరా ఘోషారెడ్డి! నీ ఘోష ఎలావుంది? ముందు కాళ్ళు పేర్పించి తర్వాత మనుష్యుల్ని చంపుతున్నావు కదూ! ఎప్పుడూ సిద్ధంగా కాళ్ళు ఖాళీవి వుంచుతున్నావు కదూ! వెళ్ళి ఒక ఖాళీ కాడులో నీవే పడుకో! బొర్రలు కదిలించుకుంటూ అంతా వచ్చారా - మమ్మలచంపి విందులు చేసుకోను!" అంటూ తీక్షణంగా చంద్రయ్య తీవ్రస్వరంలో అంటున్నాడు.

ముగ్గురు మిల్టరీవాళ్ళు అక్కడొకడు యిక్కడొకడు పడి తన్నుకుంటూ చనిపోయారు. ఒకదొర బొళబొళ నెత్తురు కక్కి చేసిన పాపాలకు, అపరాధాలకు, అన్యాయాలకు శిక్షగా వేదనపడి కళ్ళుమూశాడు. అడివిమీద దారితప్పి పారిపోయిన మిల్టరీవాడు గుండెలుపగిలి అక్కడే పడి చని పోయి కాకులు, గద్దలు, జంతువులు పొడిచిపొడిచి తింటుంటే తన వికృతి అంతరాత్మతో పరికిస్తున్నాడు. శేషారెడ్డి కూడ తొలిగింది. కాలికి గాయం తగిలింది. కుంటుకుంటూ పారిపో యాడు. ఇద్దరు హోంగార్డుల మోకాళ్ళుచితికాయి. పాకుతూ పడుతూ లేస్తూ ఇల్లుచేరారు.

దళం జయగీతం ఆలాపిస్తూంది.

* * *

తెలతెలవారుతూంది. చీకటి చరచర కరిగి జారి పాలి సిపోతూంది. బొల్లాడ గుట్టలు గాఢాంధకారంలో దిగి, మునిగి, ఈది, వళ్ళంతా ముద్దగా తడిసి, ఇప్పుడే వడ్డెక్కి జుత్తూ శరీరం ఆరపెట్టుకుంటున్నాయి. చుట్టూ పచ్చగా, పత్తుగా పెరిగిన చేలు - జొన్న, కంది, ఆముదాలు - చెరువు కింది వరివాగులో, రెల్లుమంచులో స్నానంచేసి, లేచి వళ్ళు దులుపుకుంటున్నాయి. ఇంకా అక్క డక్కడ మంచుబిందువులు ముత్యాలలా వంటిమీద మెరిసిపోతూన్నాయి.

బొల్లాడగుట్టలు అందంగా, అమోఘంగా వున్నాయి. నాల్గువేపుల కొండలు, కొండలానుకొని పచ్చని పొలాలు,

పొలాలు కాళ్ళకడుగుతూ ఒకవేపు పెద్ద చెరువు-శోభాయమానంగా, సౌందర్యవంటగా వర్థిల్లుతున్నాయి.

"లేవండిరా కొడకల్లారా, ఇంకెక్కడికి పోతారు? మీ రోజులు తీరినయి లేవండి! బతికదలిస్తే ఆయుధాలు అవతల పడేసి చేతులెత్తండి" అంటూ చుట్టూ కమ్మి, వత్తుకొస్తున్న మిల్టరీ కూస్తూనే కాలుస్తూంది!

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..." తుపాకి గుళ్లు, బ్రెన్ గుళ్ళు నిద్రపోతున్న దళంమీద, దళంచుట్టూ తాకుప్ప తెప్పలుగా పడుతున్నయి.

"లేవండి కామ్రేడ్స్! లేవండి! మిల్టరీ!" అని కమాండరు చంద్రయ్య పిలుపు. పిలుస్తూనే స్టెన్ అందుకొని దూకుతూవచ్చే మిలటరీని నిలబెట్టాడు అడుగుకదలకుండా. దళం వీరాభిమన్యులు లాగా విక్రమించింది, రెండు వేపుల కాల్పులు సాగుతున్నయి.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్..." బ్రెన్లు ప్రేలుతున్నయి.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..." స్టెన్లు, రైఫిళ్ళతో దళం పిడుగులు చెరుగుతూంది.

కాని మిలటరీ చాల ఆలోచన, పెద్దప్లాను, ఎత్తులతో వచ్చింది. రక్షణస్థానాలు ఆక్రమించింది. దళం విజృంభించగానే రక్షణ స్థానాల్లోవుండి కాలుస్తున్నారు. పైకి దూకడం లేదు. దళం యెక్కడ పడుకుందీ, లేస్తే ఎటు పరుగెత్తేదీ ముందే ఆలోచించి, విచారించి, నిర్మాణయుతంగా అన్ని

చోట్ల మాట్లుకాసి మిలటరీ కూర్చుంది. లేచిన దళాన్ని వాళ్ళు పన్నిన వలలోకి, వ్యూహంలోకి పోయేట్టుచేయ ప్రయత్నిస్తున్నారు. మిలటరీ వాళ్ళతో పాటు ద్రోహుల్ని, హోంగార్డులను తీసుకొచ్చారు. వాళ్లు పెద్ద పెద్ద కేకలేస్తూ దళం సమయస్ఫూర్తి చెడేట్టు చేస్తున్నారు. కాని దళం ప్రగాఢ ధైర్యంతో శత్రువుల యెత్తులు, కాల్పులు, గందరగోళం ఎదుర్కొంటూంది.

నిమ్మళంగా దళం వెనక్కి తగ్గి మిలటరీయిచ్చిన వూతంతో వుత్సాహంతో, తప్పుకునే ప్రయత్నంలో వుంది. దళం పడుకుంది - కొండలమధ్యనున్న మైదానం, మైదానం నుంచి తప్పుకోవాలంటే మూడువేపుల కొండగట్లు యెక్కి పోవాలి. నాలుగోవేపు పొలాలు, చెరువు ఉన్న మైదాన ప్రదేశం. అటునుంచే మిలటరీ దాడిచేస్తుంది. అటు వెళ్ళడానికి వీలులేదు. గట్లు ఎక్కుదామన్నా శత్రువు పొంచివుండకుండా వుంటాడు అనే ధైర్యంలేదు. కాని ధైర్యంచేసి తూర్పుదిశగా ఉన్న గట్టు ఎక్కి తప్పుకోడానికి దళం నిర్ణయించుకుంది. మార్గంపట్టింది. దళంతో పాటు నిరాయుధంగా ఆర్గనైజర్లు, కొరియర్లు వున్నారు. అంతా పదిహేనుమంది దాకా ఉన్నారు, క్రమేద్ను తప్పుకుంటూ కాలుస్తున్నారు. మిలటరీ తప్పుకుంటున్న దళంమీద తీవ్రంగా కాల్పులు ఆరంభించింది. గుళ్లు కుంభవర్షం కురిపిస్తోంది. మిలటరీ దిగుడులో - మైదానంలో వుంది. గట్టుపక్క కూడ పొంచివుంది. గట్టు యెక్కుతున్న దళాన్ని కాల్చడం వాళ్ళకు మహావర

డాగా, సులభంగా, ఏలుగా, వాలుగా వుంది. అంచేత భయంకరంగా అన్నివేపులనుండి విజృంభించారు. దళంకూడ కాలుస్తూంది. చంద్రయ్య అడుగడుగునా ఎత్తుమారుస్తూ, కామ్రేడ్స్‌ను వుత్సాహపరుస్తూ, నిరాయుధ కామ్రేడ్స విషయం జాగ్రత తీసుకుంటూ దళాన్ని క్షేమంగా తిరోగమింపచేస్తున్నాడు.

“రండి కామ్రేడ్స్! ఇహ నాల్గు అడుగులు జాగ్రతగా వేయండి! ఈ గట్టు దిగామా సురక్షితంగా వెళ్ళిపోతాం... కాల్చండిరా తుచ్చుల్లారా! దొంగమాటుగా గడితిన్నా గెలవలేకపోయ్యారు...” అంటూ గట్టెక్కి కొంతమందిని అవతలకు చేరవేసి, చంద్రయ్య కేకలు పెడుతున్నాడు. గట్టుమీద నిలబడి నినాదాలిస్తూ, దళాన్ని సంబోధిస్తున్న చంద్రయ్య మిల్టరీ బ్రెన్‌ల కంటినిండా కనబడ్డాడు. నోరంతా తెరిచి నిప్పులు కక్కుతున్నాయి. ‘హే హే హ్హే’ అని హోంగార్డులు, ద్రోహులు గగ్గోలు పెడుతున్నారు.

“హా...ఆ...ఊ..కామ్రేడ్ వెంకటయ్యా! నేను పడిపోయా...ఆయుధం తీసికెళ్ళు...పోరాడండి ... శత్రువును ఎర్రజండాకు బలితీయండి...” అంటూ బ్రెన్ గుళ్ళు పది గుండెలోపడి, పడిపోయిన చంద్రయ్య అటూ–ఇటూ మెలికలు తిరుగుతూ దొర్లి కిందుమీదవుతూ మూల్గుతున్నాడు.

చంద్రయ్య కేక విన్న ఉపకమాండరు వెంకటయ్య పరుగెత్తుకుంటూ చంద్రయ్య దగ్గరికి వచ్చాడు. చంద్రయ్య నెత్తురు మడుగులో తేలాడుతున్నాడు. కొట్టుమిట్టాడు

తున్నాడు. వెంకటయ్య చంద్రయ్య దగ్గరకు రావడం, వచ్చి మొలగుడ్డ తీసి చంద్రయ్య పొట్టకు రక్తం కారకుండా చుట్టడం స్పష్టంగా మిల్టరీ చూస్తూంది.

“నేను బ్రతకను వెంకటయ్యా! ఎందుకు అవస్థ పడతావు...అబ్బా...దాహం...పోటు...ఆయుధం తీసుకో.. పోరాటం జయప్రదం చేయండి...పార్టీని ప్రచండ శక్తిగా మార్చండి...మనం గెలుస్తాం...మన జండా జయిస్తుంది... మన ప్రభుత్వం .. వస్తుం..ది” అంటున్నాడు చంద్రయ తల్లడిల్లుతూ! వడ్డుమీద పండబెడుతున్న, కట్టుకడుతున్న వెంకటయ్యను వుద్దేశించి.

“వెళ్ళు...ప్రమాదం...వెంకటయ్యా వెళ్ళు...పో” అని మూల్గుతున్నాడు చంద్రయ్య.

“ఆఁ...అబ్బా...వో...” అంటూ వెళ్ళబోతున్న వెంకటయ్య కుప్పకూలాడు. చంద్రయ్య దగ్గర ఆయుధం తీసుకొని, చంద్రయ్యకు రెడ్ సాల్యూట్ చేసి, చేతులు ఆప్యాయతతో నిమిరి కళ్ళు, నుదురు ప్రేమగా తాకి, అద్దుకొని వీడ్కోలు చెప్పి వెళ్ళిపోతున్న వెంకటయ్య శత్రువును మరచిపోయాడు. వాడు ఇదే అదను చూసుకొని వెంకటయ్యను కాల్చాడు. కాలి పిక్క కండలో గుండు దూరి బయటికి దూసుకుపోయింది. నెత్తురు మడుగయి పడిపోయాడు.

“కామ్రేడ్ పి.కారు! నేను, చంద్రయ్యా పడిపోయాం! మా ఆయుధాలు తీసుకెళ్ళు! జాగ్రత! వెంటనే రా” అంటూ వెంకటయ్య మరో దళసభ్యుణ్ణి ఎలుగెత్తి పిలుస్తున్నాడు.

తాను, చంద్రయ్య పక్క-పక్క-ల పడిపోయారు. ఇద్దరి జీవిత స్నేహచిహ్నంగా, ఇద్దరి రక్త కలిసి గడ్డి తడుపుతూంది. కామ్రేడ్ షికారు వచ్చాడు. ఆయుధాలు రెంటూ తీసుకున్నాడు. ఇద్దరు కామ్రేడ్స్‌కు రెడ్ సాల్యూట్ చేసి, ఒక్క-సారి బాధతో చూసి వెళ్ళిపోతున్నాడు. ఆయన సరిగా పదఘుగులు వేయలేదు। ఇంతలో వెనకనుంచి వెంకటయ్య పెద్దగా కేకలు పెడుతున్నాడు.

"కామ్రేడ్ షికారు! నేనుకూడ వస్తున్నా. నాకు ప్రమాదమయిన దెబ్బ తగలలేదు! నేను మృత్యువును జయించాను! మిల్టరీమీద కసితీర్చుకుంటాను" అంటూ లేచి రక్తపు డాగులతో తడిసి ఎర్రగా ముద్దయిన బట్టలతో షికారు వెంట పరుగెత్తుతున్నాడు కుంటుతూ. ఈయనకు గుండు పిక్క-కండలో పడి బయటి కెళ్ళిపోయింది. అంచేత అది ప్రాణాపాయం చేయలేదు. లేవకుండా పడేయలేదు. దెబ్బ తగలగానే, నెత్తురు వరదకట్టగానే లేవలేననుకున్నాడు. చావుతధ్యమని భ్రమించాడు. కాసేపున్న తర్వాత కాలు అటూ-ఇటూ లాగిచూశాడు. విరిగిపోలేదు. బాగానేవుంది. స్టెన్ గుండు చేసిన బొక్క-గుండా రక్తం స్రవిస్తూంది. ఇలాంటిది విప్లవ వీరుల దైనందిన జీవితంలో మామూలే. చటుక్కు-న లేచి వెంకటయ్య కడసారి చంద్రయ్యకు మనసార నమస్క-రించి, షికారుతో కలిసి వెళ్ళిపోయాడు. కాని చంద్రయ్య వెంకటయ్యలు క్షతగాత్రులవగానే దళం చిన్నాభిన్నమయింది. శత్రువు ప్రళయంగా విజృంభించాడు. దళం చెదిరి తలోవే పయ్యారు. కొందరు చెరువువేపుపోయి నీళ్ళలో ఈదుతూ

అవలపడుతున్నారు. ఇంకొంతమంది చేలలోగుండా కిందపడు కొని పాకిపోతూ తప్పుకుంటున్నారు. ఇంకొందరు గట్టుదాటి సురక్షిత స్థానాలు చేరుకుంటున్నారు. చంద్రయ్య తప్ప కామ్రేడ్స్ అంతా శత్రువునుంచి బయటపడ్డారు.

"ఏ వూరురా నీది కొడకా..." అని జమీందారు కాలితో అటూ—ఇటూ పొర్లిస్తూ చంద్రయ్యను అడిగాడు. ఇప్పుడే మిల్టరీ, ద్రోహులు, దొరలు చంద్రయ్యను సమీపించారు. దళాన్ని వెంటాడి, వేధించి, వధించలేక కాళ్ళుపడి పోయాయి. పడిపోయిన చంద్రయ్య దగ్గరకు వచ్చారు. తలోమాటంటున్నారు. కసితీర అగౌరవ పరుస్తున్నారు.

"చెప్పవేంరా కొడకా, నీ దేవూరు నీ పేరేంటి?" అని కొనవూపిరితో కొట్టుకుంటూ మాట్లాడలేకుండా వున్న చంద్రయ్యను బూటుకాలితో తొక్కుతూ, తన్నుతూ, జమీదారు అడిగాడు.

"........" ఆయన సమాధానం చెప్పలేదు. చెప్ప ప్రయత్నిస్తే హృదయాంతరాళంలోంచి మాట పెగిలి బయటపడటంలేదు. మృత్యువు రక్తం నిండా ఎక్కి శరీరమంతా పాకి ప్రవహిస్తూంది. నిండుమనిషిని కనుపార దిగ త్రాగుతోంది.

"వాడేం చెప్తాడు సార్! సగం చచ్చి పడివున్నోడు, నే చెప్తా పట్టండి. వాడిది పెద్దమాప్వారం, చిన్న రైతు. కూటికి, గుడ్డకుకూడ సరిగా జరిగేదికాదు పొద్దస్తమానమూ గానుగెద్దులాగా చాకిరి చేసేవాడు. వాడికి చదువు-సంధ్యలు లేవు. పార్టీలో చేరాడు. పెళ్ళాన్ని చేసుకోలేదు. వృద్ధుడ

పిండమయ్యాడు. వాడి పేరు వింటే మానుకోట, పాఖాల తాలూకాల్లో పసిపిల్ల పాలు తాగదు" అంటూ ఒక భూస్వామి జమీదారుకు సమాధానం చెప్పాడు.

"వీడి పేరేంటి?" జమీదారు భూస్వామిని వుద్దేశించి ప్రశ్నిస్తూనే చంద్రయ్య చేతిగడియారం, జేబులో పర్సు దొంగతనం చేస్తున్నాడు.

"గండ్ర చంద్రయ్య" అన్నాడు మరొక దొర వికారంగా.

దొరలు, హోంగార్డులు చంద్రయ్యచుట్టూ చేరి తలో తన్నూ, తిట్టూ, దెబ్బ—ఆయనమీద తగలనిస్తున్నారు. ఎండ ఎక్కకొండీ చుట్టూ చిందిన రక్తం నల్లగా గడ్డకడుతూంది. చంద్రయ్య ముక్కులు, నోటివెంటా తెల్లని నురుగులు బుర బుర పొంగుతున్నాయి. ఒకే పట్టున మూల్గుతూ, రోస్తూ, గుర గురలాడుతూ వున్నాడు. మనిషి చాల భీభత్సంగా కనపడుతున్నాడు. నెత్తురుతో తడిసి బురద బురద అయిన నేలమీద తన్నుకుంటున్నాడు.

"వీణ్ని క్యాంపుకు తీసికెళ్దాం, ఎత్తుకోండి" మిల్టరీకి హుకుం జారీచేశాడు జమీదారు.

"అబ్బెబ్బె, క్యాంపుకు వద్దు సార్. వీణ్ని ఇక్కడ కాల్చిపారేయండి. ఈ పాడుపెంట మళ్ళీ క్యాంపుకెందుకు?" అని ఒక్కసారి హోంగార్డులు,దొరలు గగ్గోలుగా అరిచారు. ఎందుకు వాళ్లు ఇక్కడ కాల్చిపారేయాలంటున్నారో జమీదారుకు అర్థంకాలేదు. వాళ్ళ కనుసైగలు, ప్రత్యేకచూపులు అతనికి చాల ఆశలు చూపాయి. సరేనన్నాడు.

"తాం...తాం...తాం..." కనుకొలుకుల్లో ప్రాణాలు కొట్టుకుంటున్న గంద్ర చంద్రయ్యను మళ్ళీ కాల్చారు. చప్పుడు లేకుండా, ఒక్కసారి విపరీతంగా తన్నుకొని కళ్ళు మూశాడు. శవం నల్లికుదురు క్యాంపుకు తీసుకపోయి తగలబెట్టారు.

అలా వీరాధివీరుడు, దళకమాండరు గంద్ర చంద్రయ్య-మానుకోట తాలూకా బొడ్లాడగుట్టలకు ఆహుతియ్యాడు!

## III

ప్రమాదం గడిచి గట్టెక్కిన వెంకటయ్య బాగా కోలుకోలేదు దళాలమీద శత్రుదాడ్లు తీవ్రతరమయ్యాయి. తిండికి, నీళ్ళకు, రక్షణకు - దళాలు నానా అగచాట్లు పడుతున్నయి. అయినా వెంకటయ్య పూర్తిగా గాయం మానక ముందే, ఆయుధం పుచ్చుకొని దళంలో చేరి పోరాడుతున్నాడు. తన ప్రియమిత్రుడు, నాయకుడు, సహచరుడు అయిన చంద్రయ్యను పొట్టను పెట్టుకున్న మిల్టరీని ముప్పుతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగిస్తున్నాడు. అనేక చుట్టివేతల్లోంచి తప్పుకున్నాడు. దాళ్ళు జయప్రదంగా చేస్తున్నాడు.

అప్పుడే చంద్రయ్య చనిపోయి దాదాపు సంవత్సరమయింది.

వెంకటయ్య నాల్గురోజులనుంచి విపరీతమైన చలి జ్వరంతో బాధపడుతున్నాడు. వళ్ళంతా సెగలు, పొగలు కక్కుతూంది. జ్వరం ఎంత వుందీ తెలుసుకొని మందిచ్చే వసతి లేదు. ఏ జబ్బు వచ్చినా దానంతటదే పోతేపోవాలి,

లేకపోతే దాంతోపాటు తీసుకపోవాలి. దీనికితోడు వంటినిండా కురుపులు కుప్పలు తెప్పలుగా లేశాయి. గజ్జలు, బిద్దాలు, తొడలు, వెనుకభాగం—గుల్లలతో పుచ్చిపోయాయి. జ్వరం, గుల్లలు-కాలుదీసి కాలు అవతల వెంకటయ్యను పెట్టనీయటంలేదు. కడుపు జానెడు లోతుకు పీక్కుపోయింది. మొలతాడు జారి మోకాళ్ళమీద పడుతూంది. శల్యావశిష్టంగా వున్నాడు. కళ్ళల్లో కాంతిలేదు. కాళ్ళల్లో కాసింత ఓపికలేదు. ఈ దుస్థితిలో నేలంచుగుట్టమీద నల్గురు కామ్రేడ్సతో పడుకున్నాడు. గుడిసె పాడు ఏమీలేదు. ఒక చెట్టుకింద వున్నారు. పక్కన పెద్ద మంట వేస్తున్నారు. ఆ మంటవేడితో ఆయన చలిజ్వరాన్ని ఉపశమింపచేయచూస్తున్నాడు. చలి ఎముకలు కొరుకుతూంది. ఒక ద్రోహి వీళ్ళతో సంబంధం పెట్టుకుని తిండి తిప్పలు అందజేస్తున్నాడు. అర్ధరాత్రులు వస్తూ పోతూండేవాడు.

“ఠాం...ఠాం...ఠాం...ఠాం...” అర్ధరాత్రి నిశ్శబ్దాన్ని, చీకటిని చెరుపుతూ చుట్టూ తుపాకులు పేలుతున్నాయి.

“పోలీస్ కామ్రేడ్స్! పోలీస్!...” అంటూ కామ్రేడ్స లేచి ఆయుధాలు సర్దుకొని తప్పుకోయత్నిస్తున్నారు. మంట వెలుతురులో స్పష్టంగా కనపడుతున్న కామ్రేడ్సను మాట్లు కాసివున్న మిల్ట్రీ ఏరి ఏరి కాలుస్తూంది

“అడుగోండి, వెంకటయ్య అడుగో, వాడిచేతిలో ఆయుధం లేదు! జ్వరంతో వున్నాడు! నడవలేడు. తప్పికుంటున్నాడు కాల్చండి!!” అని మిల్ట్రీని తీసుకొచ్చిన విద్రోహి జోగాడుతూ పోతున్న వెంకటయ్యను చూపిం

చాడు. వెంకటయ్య నీరసంతో, తీవ్ర జ్వరంతో, గుల్లలతో కాళ్ళు వేలాడేసి వూగులాడుతూ నడుస్తున్నాడు.

“ఠాం...ఠాం...ఠాం...ఠాం...ఠాం...” ఒక్కసారి ఐదుగుళ్ళు వెన్నులోపడి, పొట్ట గుండెలు పచ్చడి పచ్చడి చేశాయి. పడిపోయాడు. నెత్తురుధారల్తో నేలతల్లికి వీలునామా రాస్తున్నాడు. జేబులోవున్న పర్సుతీసి నోట్లు చించిపారేస్తున్నాడు. కళ్ళు తేలిపోతున్నాయి.

“వాళ్ళంతా ఎటుపోయారు లంజాకొడకా...”

“నాకు తెలియదురా కొడకా...అబ్బా...కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్” అంటూ వాళ్ళు దగ్గరికి వచ్చేప్పటికి కళ్ళుమూశాడు. మిగతా ముగ్గురు కామ్రేడ్స్ క్షేమంగా తప్పుకున్నారు.

“వీడి పేరేంటి?” విద్రోహిని ఒక గూర్ఖాకమాండరు అడిగాడు.

“వీడేనండి మొగిలి వెంకటయ్య. చాల ముఖ్యుడు. జ్వరం వుండబట్టి, ఆయుధం లేదు కాబట్టి కాని లేకపోతే దొరకడు. ఒకసారి చచ్చేగాయం తగిలినా తప్పుకున్నాడు” అన్నాడు సంతృప్తిగా, సంతోషంగా ద్రోహి.

“ఏ వూరు?”

“చెర్లపాలెం. ముఠారాసు. కూలిచేసుకొని బ్రతికేవాడు. నైజాం కాలంనుంచి పార్టీలో చేరి పెద్ద నాయకుడయ్యాడు...” అన్నాడు. ఈ ద్రోహి నమ్మించి మిల్టరీని తీసుకొచ్చి ద్రోహం చేశాడు. ఇహ మానవత్వానికి చిహ్నమయిన వెంకటయ్య లేడు!!

# వీరహనుమాన్

రాత్రి ఎంత పాపిష్టిది! నెత్తురు పిండి, అందులో తడిసి, తప్పతాగి గడిచింది! రాత్రి వెళ్ళిపోయినా, అదిచేసిన భీభత్స చిహ్నాలు చెరిగిపోలేదు! అది త్రాగిన నెత్తురు డాగులు, నమిలిన ఎముకల శల్యావశేషాలు ప్రస్ఫుటమవు తున్నాయి-పడుతున్న ఎండపొడలో!

తెల్లారినా సూర్యాపేటలో జనసంచలనం అంతగా లేదు ప్రజల ముఖాలమీద భయం భయానకంగా అవ హించింది కదలిక లేదు. అందరూ ఎవరినిచూసి వాళ్ళు జడిసిపోతున్నారు. పక్కన తిరిగే మనిషిని పగవాడిగా భావిస్తున్నారు. వినే మాటను మృత్యుసంకీర్తనగా బాధ పడుతున్నారు. ఒకరినిచూస్తే మరొకరికి అనుమానం, భయం, ద్వేషం, అసహ్యం - సూర్యాపేటలో పెరిగిపోతున్నాయి. చైతన్యరహిత ప్రకృతికూడ ఆందోళన పరుస్తోంది ప్రాణాలు కనుకొలుకుల్లో, అభిమానాలు అరిచేతిలో, ఆస్తులు నిరాశ లత చాటున దాముకొని కుంగిపోతున్నారు.

ఇవాళ మరీ భయంగా, బాధగా, భీభత్సంగా వుంటా నికి కారణం రాత్రి జరిగిన ఘోరం - ఒక క్రూరమయిన హత్యాకాండ. చిల్లంచర్ల మూర్తి, ఆయన భార్య రామ నరసమ్మను యాభైమంది రజాకార్లు ఒక విద్రోహి నాయ కత్వాన పోయి హత్యచేశారు. దారుణంగా హత్యచేశారు.

ఆ దంపతు లిద్దరు ఇవాళ యూనియనుకు వెళ్ళడానికి ప్రయాణమయ్యారు. రాత్రి అంతా సద్దుకొని పెంచుకుంటున్న ఇద్దరు పసిపిల్లలకు కావలసిన వస్తువులు, బట్టలు కొని, తమకు కావలసిన డబ్బు, సామాను తీసికొని వూళ్ళో మిత్రులకు, బంధువులకు చెప్పి సిద్ధమయ్యారు. అర్ధరాత్రప్పుడు రజాకార్లు కత్తులు, గండ్రగొడ్డళ్ళు, బరిసెలు, ఈటెలు, బాకులు తీసికొని, గగ్గోలుచేస్తూ, రజ్వీనినాదాలిస్తూ నోటికివచ్చిన బూతులుకూస్తూ ఇంటిమీద పడ్డారు. ఇప్పటికే అదిరించి, బెదిరించి మూర్తిదగ్గర చాల డబ్బు, వస్తువులు కాజేశారు. ఇప్పుడు మళ్ళీ ఇంట్లో మైమరచి సుఖనిద్రలోవున్న మూర్తి, ఆయన భార్య సరసమ్మను కాళ్ళు, చేతులు కట్టి, ఇంట్లో ఆస్తి కొల్లగొట్టి, వాళ్ళు 'ఇదేమి అన్యాయ'మని మొత్తుకుంటుంటే పక పక నవ్వుతూ, గొడ్డళ్ళతో నరికారు. బరిసెలతో పొడిచారు. కత్తులతో కుమ్మారు. ఈటెలతో చీరారు. క్షణంలో మూర్తి, రామసరసమ్మ తుండాలు తుండాలై, ముక్కలు ముక్కలై, తలొకచోట, కాళ్ళు మరొకచోట పడి, నెత్తురు వరదలలో తేలాడుతూ, పుట్టి, పెరిగిన ఇంట్లో పడి మరణించారు. ఈ అమానుషం జరుగుతుంటే వూరంతా క్రోధంతో తల బాదుకుంది. తల్లడిల్లింది. కాని 'అది తప్పు; అలాచేస్తారేం' అని అడిగే ధైర్యం, వీలు వక్కరికీ లేదు. ఎలా వీలుంటుంది? వూళ్ళో వున్న ప్రభుత్వ భవనాలు, ఆఫీసులు, పోలీసు, మిల్టరీ, ఆఫీసర్లు, న్యాయాధికారులు, పెద్దలు- అంతా రజాకార్ల వెంటవుండి, అండగా నిలిచి అన్ని సహాయ సానుభూతులిచ్చి ఈ అన్యాయం కావాలని

చేయిస్తున్నారని తెలుసు! నిత్యం జరిగే తంతే ఇది! అనుదినం ఎక్కడో, ఏ వీధినో ఇలాంటి దారుణం జరుగుతూనే వుంది! ఎవరివంతు ఎప్పుడు వస్తుందనే వూహాలో, ఆలోచనలో అంతా దిగబడివున్నారు! వీలయినన్ని మార్గాలు వెదికి యూనియనుకు పారిపోతున్నారు!

అశాంతి, అరాజకం, అసంతృప్తిలో మగ్గిపోతున్న ప్రజల కుటుంబజీవితం విచ్ఛిన్నమయింది. ఎవరిదారి వాళ్ళు చూసుకొని నిజాం ప్రభుత్వ కోరలనుంచీ, రజాకారు రాక్షసాలనుంచీ బయటపడే ప్రయత్నంలో వున్నారు. కాని ఈ అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి పోరాడాలనే కుతూహలం, కాంక్ష, దీక్ష కొంతమంది ప్రజల్లో బలంగా వుంది. వారి హృదయాలలో వుదయించి, కోటి సూర్యప్రభలతో బయటపడుతున్న, ప్రవర్ధమానమవుతున్న చైతన్యం ప్రభుత్వానికి ప్రాణగండంగా తయారయింది.

కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెసు, ఇంకా అనేక ప్రజాతంత్ర పార్టీలు, పెద్దలు ప్రజల్ని సమీకరించి నిజాంప్రభువును గద్దె దించాలని ఆందోళన చేస్తున్నారు. స్టేటు యూనియనులో చేరాలని వుద్యమం లేవదీశారు. దీన్ని అణిచివేయడానికి ప్రభుత్వం విపరీత నిర్బంధ విధానాన్ని ప్రవేశపెట్టింది. రజాకారు రాక్షసుల్ని స్వేచ్ఛగా కళ్ళాలు విప్పి ప్రజలమీద విసిరింది. ఈ నిర్బంధ విధానాన్ని ప్రజలు ఒకవేపు తీవ్రంగా ఎదుర్కొంటున్నారు.

ఇవాళ జరిగిన అన్యాయానికి అసమ్మతిగా సూర్యాపేటలో పెద్ద వూరేగింపు జరిగింది. వందలమంది ప్రజలు

పాల్గొన్నారు. 'నిజాం నవాబు గద్దె దిగాలి! నిజాం సంస్థానం యూనియన్‌లో చేరాలి! నిర్బంధ విధానం నశించాలి! రజాకారు రాక్షసాలు నశించాలి' అని నినాదాలిస్తూ ప్రజలు పెద్ద వూరేగింపు చేసి, రజాకార్లు, నిజాం పోలీసు నిర్బంధాన్ని ఎదిరించి బహిరంగ సభ పెట్టారు. సభ జయప్రదంగా ముగిసింది.

నిత్యం జరిగే ఘోరాలతోపాటు, రాత్రి జరిగిన ఘోరాన్ని, ప్రజల ఆవేదనను హనుమయ్య చూశాడు. ఆందోళనపడ్డాడు. వూరేగింపులో, బహిరంగసభలో పాల్గొన్నాడు. ఖిన్నుడై యింటికెళ్ళాడు. తలనొప్పి తలకిందులు చేస్తోంది. వళ్ళంతా జ్వరం వచ్చినట్లు మండిపోతూంది. సాయంత్రం వచ్చి మంచంపట్టాడు. అన్నానికి లెమ్మనిఇంట్లో అంతా ఆందోళన పడుతున్నారు. చెయిచూపిస్తే నాడి బాగానేవుంది. జ్వరచిహ్నాలు లేవు. ఇంట్లో వాళ్ళగోడు పట్టించుకోకుండా 'హనుమయ్య దుప్పటి నిండా కప్పుకొని కాళ్ళు తన్నిపట్టి పడుకున్నాడు. మనస్సు వికలమయింది. మనోవ్యధ మంచుగడ్డలమధ్యహృదయాన్ని బంధించి నొక్కి వేస్తూంది చల్లగా మెల్లగా.

“నేను అటో ఇటో తేల్చుకోవాల్సిన రోజులు నిత్యం తలుపు తడుతూన్నాయి. ఎటువేపు మొగ్గుదామన్నా గుండె ధైర్యం చాలడంలేదు. ఈ కష్టదినాలలో నా నిజాయితీ, నీతి తమ నిజ స్వరూపాలతో బయటపడేట్టున్నయ్! పదిమందిలో వున్నప్పుడు, అంతా అనుకూలంగా జరుగుతున్నప్పుడు, ఏవీ ఎదురు, కష్టం కనపడనప్పుడు ఎంతయినా ముందుకురికి

సేవచేయొచ్చు! త్యాగం చేయొచ్చు! కాని పరిస్థితి ప్రమాదంగా పరిణమించినప్పుడు, సహచరులకంటే శత్రువు బలంగా వున్నప్పుడు ఆత్మధైర్యంతో నిలబడి శత్రువును ఎదిరించడం ఎంతకష్టం!

చేసే గుమస్తా వుద్యోగం వదులుకున్నా! పంతులు పనికి తిలోదకాలిచ్చా! కమీషను వ్యాపారానికి నీళ్లువిడిచా! ఇదంతా నేను పార్టీ కార్యక్రమం చేద్దాం అనే వుబలాటంతో, వుత్సాహంతో చేశాను! కాని పార్టీ కామ్రేడ్సంతా చేస్తున్న త్యాగం, చాకిరి చేయలేకపోతున్నా! పరిస్థితి బాగున్నప్పుడు అందరితోపాటు చేశా! ఇప్పుడో చేయాలనే కోరిక తప్పితే ఆచరణలో వెనకపడుతున్నా! అదీ, ఇల్లంతా నేనే పోషించాలి! నానా అవస్థలుపడి సంపాదిస్తేకాని పొయిలో పిల్లి లేవదు! అంచేతే మొన్న సింగరేణికాలనీలో మళ్ళీ గుమస్తాగా చేరా! చుట్టూ జరుగుతున్న స్వాతంత్ర్య సంగ్రామ సంగీతం నన్ను ఆ పని చేయలేకుండా చేసింది! అది వదులుకొచ్చాను! ఇలా వుట్టికి స్వర్గానికి అందకుండా వుంటే లాభం లేదు! ఏదో తేల్చుకోవాలి! పార్టీ నన్ను రంగంలోకి వచ్చి పోరాడమని చెపుతోంది. వాళ్ళకు తెలీదు-నేను పరిపూర్ణ కమ్యూనిస్టును కాదనీ, నాలో చాలా లోట్లు, బలహీనత లున్నాయనీ!

అమ్మో, నేను ఆయుధం పుచ్చుకొని రంగంలో కెళ్లాలనే ఆలోచన తట్టినప్పుడు గుండె లాగినంత పనిఅవుతుంది! నేను పోరాడలేను. అది నాకు చేతకాని పని! రజాకార్లు, మిలట్రీ అంత పెద్ద ఆయుధాలతో, జీపులతో, వ్యానులతో

వచ్చి పైన పడుతుంటే తుస్సుమనే బర్మారుతో పోరాడేది ఎలా? ఎన్నడూ తుపాకి ముఖంకూడ ఎరుగను! తుపాకి దెబ్బ వింటే వళ్ళు జలదరిస్తుంది! దళాలలో వుంటే నానా అవస్తలు పడాలి–తిండి వుండదు. సరిగా విశ్రాంతికి, స్నానానికి వీలుండదు! నేను ఆ కష్టాలు పడలేను! ఒకవేళ చిక్కామా ఇహ రజాకార్లు వెంటనే చావనీయరు! ముక్కలు ముక్కలుగా తరిగి, చీం, చెక్క వూరగాయ పెడతారు! అది తలుచుకుంటే ఇప్పుడే ప్రాణం పోయేట్టుంది. వాళ్ళు ఎంతకయినా తగుదురు. ఆ నరకయాతనలు నేను పడలేను. నే నిప్పుడు పార్టీ పని చేయలేను. ప్రజలపక్షాన నిలబడి పోరాడలేను.

అయితే నేను జరిగే ఘోరాలన్నీ చూస్తూ వూరుకోవాల్సిందేనా? ఈ హత్యలు, అవమానాలు, అరాజకం, అవినీతి అడ్డుకోడానికి నేనేం చెయ్యొద్దా? నేను పార్టీ సభ్యుణ్ణే అయిగూడా ప్రజలు, పార్టీ కష్టసముద్రంలో వున్నప్పుడు వుపయోగపడకపోతే సార్థకమేంటి? నేను ప్రతి వుద్యోగం మానుకుంది పార్టీపని చేద్దామని కాదా? ప్రజలంతా పార్టీ నాయకత్వాన నిరంకుశ నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడుతుంటే, నేను తప్పుకొని, పొట్ట చేత పట్టుకొని ఏమీ పట్టనట్టు తిరిగేదా? అలా వీలులేదు. నా వంతు త్యాగం నేనూ చేయాల్సిందే! దేశం స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నప్పుడు, ఏ మానవుడూ నిర్లిప్తంగా వుండలేడు. వుండకూడదు. ప్రజలు జాతీయ విముక్తి సంగ్రామం సాగించేప్పుడు ఏ నిజాయితీ పరుడూ పాల్గొనకుండా వుండలేడు. అలా చేయడం ద్రోహం. అదీ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయివుండి,

పార్టీ ప్రతిఘటనోద్యమాన్ని నడుపుతున్నప్పుడు, నాయకత్వం వహిస్తున్నప్పుడు, ఉద్యమానికి దూరం కావడంకంటె విప్లవ విద్రోహం మరోటివుండదు. నేను తప్పకుండా ఆయుధం పట్టి రజాకార్లను హతమారుస్తాను. నిరంకుశ పరిపాలనను నామ రూపాలు లేకుండా తుడిచి పారేస్తాను... ఇంట్లో సంగతేంటి? నేను పోతే అమ్మా, తమ్ముడు అవస్థపడరా?......ఛా... ఇంటిసంగతి దేశం ధ్వంసం అవుతున్నప్పుడు ఆలోచించే వాడెవడయినా వున్నాడా?... నే నా కష్టాలు భరించగలనా, పోరాడతానా......ద్రోహిగా కష్టాల కాగలేక తయారవు తానేమో? అలా ఎప్పుడు జరగదు.జరగడానికి వీలులేదు... నాకంటె వెనక పార్టీలోకి వచ్చినవాళ్ళు, మొన్న మొన్న కళ్ళు తెరిసినవాళ్ళు, పొలం పనిచేసే రైతుకూలీలు బ్రహ్మాం డంగా ప్రతిఘటనోద్యమం నడుపుతుంటే నా కెందుకు ఇన్ని సందేహాలు? నేను అందరికంటె నేర్పుగా పోరాడగలను. పోరాడతాను......" ఇలా పరి పరి విధాల హనుమయ్య స్వప్నసౌధాలలో, ఆలోచనా తరంగాలలో విహరిస్తూ న్నాడు; ఈదుతున్నాడు......

## II

హనుమయ్య దళాలలోచేరి అప్రతిహతంగా పోరాడు తున్నాడు. రజాకార్లు హనుమయ్యదళం అంటే హడలి చస్తు న్నారు. భూములు పంచే కార్యక్రమం చాల నిపుణతతో నిర్వహిస్తున్నాడు. ఆయన అంతకు ముందే బాగా చదువు కున్నవాడు. ఉపాధ్యాయ వృత్తికూడ చేశాడు. అందుచేత

కామ్రేడ్స్‌ను అభివృద్ధి చేయడంలో కొత్తపద్ధతి ప్రవేశ పెట్టాడు. దళంలో కామ్రేడ్ మిలిటరీ శిక్షణతోపాటు రాజకీయ పరిజ్ఞానాన్ని విధిగా అలవరుచుకునేట్లు చూస్తున్నాడు. దైనందిన కార్యక్రమంలో చదవను, రాయను ప్రధాన బాధ్యతగా కామ్రేడ్స్ ఎంచేట్లు చేశాడు. దళం అంతా క్షుణ్ణంగా పార్టీ సారస్వతం చదువుతూంది. చైనా ఎర్ర సైన్యం, బీళ్ళు దున్నేరు, బోల్షివిక్ పార్టీ చరిత్ర, స్టాలిన్ గ్రాడ్ వీరోచిత ప్రతిఘటన, ఇంద్రధనుస్సు, ఆదర్శప్రేమ మొదలయిన పుస్తకాలు ఆ కామ్రేడ్సంతా చదివారు. మార్క్సిజాన్ని గురించి క్లాసులు పెట్టి రాజకీయ స్థాయి పెంచాడు. ప్రజలుకూడ పార్టీ సారస్వతం చదివేట్లు, చదువుతుంటే వినేట్లు హనుమయ్య చేస్తున్నాడు. దీనివల్ల ఉద్యమం మంచి నిర్మాణంలో, కట్టుదిట్టంగా దినదినాభివృద్ధి చెందుతూంది.

కామ్రేడ్ హనుమయ్య పార్టీ సర్క్యులర్లు, పాలసీ, ఎత్తుగడలు, వ్యూహం కామ్రేడ్స్ దరిచేత చదివించి, విమర్శకు పెడుతున్నాడు. ఎవరికితోచిన అభిప్రాయాలు వాళ్ళు యిస్తున్నారు. ఎవరి విమర్శ, ఉద్దేశం వాళ్ళు విడివిడిగా తెలియజేస్తున్నారు. దీంతో పై కమిటీలకు, క్రింది కమిటీలకు నిత్యసంబంధాలు దృఢపడటమే గాక, కిందినుంచి పైదాకా పోరాటయంత్రం మంచి ఆర్డరులో వుంటానికి వీలుకల్గింది.

సూర్యాపేటలో వేలాది మిలిటరీ, రజాకార్లు నివాసం ఏర్పరుచుకొని తాలూకానంతా నానాహింసలు, చెరలు పెడుతున్నారు. సూర్యాపేట వీధుల్లోకి వస్తే కనపడేది ప్రజలు కాదు-మిలిటరీ. 'బుర్రు'మని మోత వినపడితే బస్సులని భ్రమ

పడకూడదు-మిలిటరీ వ్యానులు. ఎక్కడ చూసినా మిలిటరీయే! ఎటువేపు వెళ్ళినా మిలిటరీ వ్యానులే!

నాలుగూళ్ళకు నాలుగూళ్ళకు మిలిటరీ క్యాంపులు, రజాకారు క్యాంపులు పెట్టారు. వాళ్ళ నిత్య కార్యక్రమం చుట్టూవూళ్ళను చిత్రహింసలు పెట్టడం, నిలువుదోపిడీ చేయడం. దోచుకోని ఇల్లూ, దెబ్బతగలని వల్లూ, మానభగం జరగని బజారూ సత్యం వాపులులేని వూరూ చూద్దామన్నా లేవు.

సూర్యాపేట నుంచి జనగాం పోయే రోడ్డుమీదుగా మిలిటరీ సంచలనం మితిమీరిపోయింది. ఈ రోడ్డుమీదుగా
మిలిటరీ సంచలనం మితిమీరిపోయింది. ఈ రోడ్డుమీదుగా
వందలాది మిలిటరీ వ్యానుల్లో వచ్చి, చుట్టూ వూళ్ళమీద దాళ్ళు చేసిదోచుకొని, దొరికిన వాళ్ళను కాల్చిపారేసి, కంటికి కనపడ్డ స్త్రీలను అవమానించి సూర్యాపేట చేరుకుంటున్నారు. దళాలు యీ మరాగతాన్ని ఎదుర్కోడానికి సాధ్యపడటం లేదు.

ప్రజల జీవితం దుర్భరమయిపోయింది. కుటుంబ జీవితం ఛిద్రమయింది. సకాలంలో దున్నక, విత్తనాలు చల్లక, వేసిన పైరు సరయిన పోషణలేక — పొలం అంతా బీళ్ళుపడ్డది. ఇళ్ళల్లోవున్న ధాన్యం, ఆస్థి, వస్తువులు నిజాం ప్రభుత్వ మిలిటరీ, రజాకార్లు దోచుకపొయ్యారు. ఇళ్ళుకూడ కొన్ని పడగొట్టారు. తినటానికి తిండి లేదు. ఉంటానికి ఇల్లు లేదు. ఆ దిక్కులేని జీవితం గడుపుదామన్నా రక్షణ లేదు,

ఏ నిమిషాన ఏ విపత్తు విరుచుకొని నెత్తిన పడుతుందో అని ప్రజలు పంచప్రాణాలు బిగబట్టి బ్రతుకుతున్నారు.

నిత్యం నరకం అనుభవించలేక, దుస్సహ జీవితం జీవించలేక, తమ్ముతామే పీక్కుతినలేక, మృత్యువునోటిలో నిరంతరం నానలేక రోడ్డుకిరువైపుల ప్రజలు విధిలేక ప్రభుత్వ దుర్మార్గం ప్రతిఘటించ దలిచారు.

ఒక సుదినం సూర్యోదయం చూడకముందే సంతోష తరంగిత హృదయులై ధ్వంసమయిన సూర్యాపేట, జనగాం రోడ్డును చూసింది. ప్రజలు సమూహాలుగా రోడ్డుమీదపడి, నాశనంచేసి, చదునుచేసి, దున్ని—వ్యానులు, మిల్టరీ రాకుండా తెల్లారేప్పటికి చేశారు. రోడ్డు ఎక్కడికెళ్ళిందో ఎవరికీ తెలియదు. ఏమయిపోయిందోనని అందరూ ఆశ్చర్య చకితులయ్యారు.

ఈ సంఘటన ప్రభుత్వాన్ని సూదులతో నిలువెల్లా పొడిచింది. ఎక్కడెక్కడి పోలీసు, మిల్టరీ, రజాకార్లు, రోడ్డుమీద కుప్పలు తెప్పలుగా దిగారు. రోడ్డుకిరువైపుల కనపడ్డ రైతులను, కూలీలను తీసుకొచ్చి కాల్చి, రోడ్డుమీద 'గిజ గిజ తన్నుకునే' వాళ్ళను పడేసి పైన మట్టిపోసి రోడ్డు పోస్తున్నారు. చుట్టూ గ్రామాలమీద పడి రజాకార్లు, మిల్టరీ క్రోధంతో కసితీర్చుకుంటున్నారు. ప్రజలమీదపడి అన్యాయంగా, అడ్డలుగా కాల్చిపారేస్తున్నారు. కొన ప్రాణాలతో వున్న వాళ్ళను తెచ్చి గండ్లలోవేసి పూడుస్తున్నారు.

ఈ వార్త విన్న హనుమయ్య అరణ్యవాగులో వుతుక్కుంటున్న బట్టలు వదిలి, కోపోద్దీపితుడయి దళాన్ని

వెంటబెట్టుకొని బయలుదేరాడు. చుట్టూ గ్రామాలలో హను మయ్య వస్తున్నాడన్న సమాచారం చేరి ప్రజలు కోలాహలం చేస్తూ ఎదురెళ్ళి స్వాగతం చెప్పారు. గ్రామ వలంటీరు దళాలు పది హనుమయ్య దళంలో కలిశాయి.

వేలాదివేల ప్రజలు, దళాలు, హనుమయ్య రావడం చూసి మిల్టరీ, రజాకార్లు వెనక్కి తగ్గారు. తరిమి తరిమి దళాలు రజాకార్లను, మిల్టరీని సూర్యాపేట పరుగెత్తించాయి. మరురోజు పెద్దపెట్టున మిల్టరీ వచ్చింది. హనుమయ్య ముందే జాగ్రత తీసుకొని దళాలను మాటుంచి తిప్పి కొట్టాడు. ప్రభుత్వ ప్లానులన్నీ భగ్నమయ్యాయి. ఆరోడ్లు అలానే నెలలు పాడుపడ్డది ఇది ఆదర్శంగా తీసుకొని ఇతర ప్రాంతాల దళాలుకూడ ఆవేపు రోడ్లను ధ్వంసం చేశాయి, రోడ్లకు, మిల్టరీ వ్యానులకు భద్రత నశించింది.

జాజిరెడ్డిగూడెం కేంద్ర ఆర్గనైజరుగా, మిల్టరీ కమాం డరుగా హనుమయ్య పనిచేస్తున్నాడు. తన కేంద్రాన్ని చాల సుశిక్షణతో వుంచాడు. ప్రజల్లో మంచిపేరు సంపాదించాడు. అపారంగా పార్టీ విశ్వాసం చూరగొన్నాడు. "హనుమన్నా! హనుమన్నా అంతా ఆగమయిపోయిందే, నువ్వురుకుతా వత్తేకాని కాదు" అంటూ నురుగులు కక్కుతూ, రొప్పుతూ ఒక నడికారు రైతు హనుమయ్య దళం దగ్గరికి పరుగెత్తు కొచ్చి చెప్పాడు.

"ఏమిటి? ఏమయిందేమిటి? నిదానంగా చెప్పు" అడి గాడు హనుమయ్య ఆ రైతును.

"ఇంకేముంది! కొంప మునిగింది! మా వూరంతా

రజాకార్లు దోచుకొని పోతుండ్రు! నీవు చప్పున బయలు దేరవే!" అంటూ ఆ రైతు కడుపులోని ఆవేదనను, ఆదుర్దాను వెళ్ళపోసుకుంటున్నాడు.

"ఎంతదూరం పోయారు? ఎంతమంది వున్నారు?"

"వాళ్ళు ఊరు దాటకముందే నేను మనోళ్ళ తోలితే వురికొచ్చా! ఇప్పుడు నువ్వొత్తే వాళ్ళు చిక్కుతారు..."

"నరే నువ్వు పద! నేను వస్తాను" అని ఆ రైతును హనుమయ్య సాగనంపాడు. ఏ దారిన తాను వచ్చేది, ఎక్కడ తన్ను కలుసుకొని అక్కడి నమాచారం చెప్పాలిన్నదీ విపులంగా చెప్పాడు. ఆ రైతు సంతుష్టిగా దళంకేసి చూసి నమస్కరించి, నిష్క్రమించాడు.

పొద్దు వాటాలింది. మబ్బులు అక్కడక్కడా నల్లగా పట్టి వుండటంవల్ల వాతావరణం చల్లగావుంది. వెలుగుపల్లి పొలిమేరలో గడ్డితుప్పలు, జెముడుపొదలు, మోదుగ చెట్లు, జిల్లేడు, తంగేళ్ళు పత్తుగా పయ్యారంగా వున్నాయి. దాపులో చిన్న వాగుంది. వాగంతా ఎగుడుదిగుడుగా, మెరకపల్లాలతో వుంది. వానలున్నప్పుడు వరదొస్తుంది. ఎండలు కాస్తే కన్ను తడుపుకోడానికి ఒక్క చుక్క దొరకదు.

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్...ఠణ్..."

"ఠాం ఠాం ఠాం ఠాం ఠాం ఠాం..."

ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..."

"ఢమ్ ఢమ్ ఢమ్ ఢమ్..."

హఠాత్తుగా నాలుగువేపులనుండి ఆడుతూ, పాడుతూ

తూలుతూ, వూగుతూ బళ్ళలో పోతున్న రజాకార్ల మీద హనుమయ్య దళం మాటు కాసి కాల్పులు సాగించింది.

"అల్లా...మా...మరగయా"

"...హో...అ...తేరి యమ్మ..."

"......మా...కే...మరగయా" ఏడ్పులు, పెడ బొబ్బలు పెడుతూ మృత్యురోదన చేస్తూ బళ్ళువదిలి ఆయుధాలు పారేసి రజాకారు గుంపు చిన్నాభిన్నమయింది. చెట్టు కొకరు గుట్టకొక్కరుగా పారిపోయ్యారు. తెలుగుపల్లి ప్రజలు కోలాహలంచేస్తూ, సంబరాలు పడుతూ రంగస్థలం చేరారు. ఆరు బళ్ళనిండా వున్న కోళ్ళు, ధాన్యం, వస్తువులు, వంట సామాగ్రి—హనుమయ్య చేతిగుండా ఎవరివి వాళ్ళకు అందచేశాడు. మంచి మేకపోతులు, పాలేళ్ళు వరి గుంపుచేసి తోలుకొచ్చారు రజాకార్లు. అవికూడ సొంతదార్లకు అప్పజెప్పాడు.

రోజూ మిలటరీ, రజాకార్లు దోచుకొనిపోతున్న ధాన్యం మధ్యలో దాడిచేసి, నిలేసి, జయించి ప్రజలకు పంచిపెడుతున్నాడు. ప్రజలు పంచుకున్న భూములు దగ్గరుండి సంరక్షించి ప్రభుత్వం దురాక్రమణ చేయకుండా అరికట్టాడు. నకిరేకల్లు గుర్రాల దళాలను క్యాంపుమీద దాడిచేసి హత మార్చాడు.

భూమి పంపిణీ కార్యక్రమంలో అసమాన శక్తి సామర్థ్యాలతో పాల్గొంటున్నాడు. జాజిరెడ్డిగూడెం భూమి పంచాడు. తుంగతుర్తి దేశముఖు భూములు దగ్గరుండి పంచాడు. సాల్ పేట, కాసర్లపాడు వరసాయిపల్లి ఇత్యాది

గ్రామాలలో పంచాయితీ ప్రభుత్వం ఏర్పరిచాడు. భూస్వాములు మంచి చేసుకోను విందులకు పిలిచినా, స్నేహితాలు కలప ప్రయత్నించినా చాల నిక్కర్షగా, నిర్దాక్షిణ్యంగా వుండి—వాళ్ళ దుష్కృత్యాలు ఎదిరించి పోరాడేవాడు. వాళ్ళకు దూరంగా ఉంటున్నాడు.

దాళ్ళలో సంపాదిస్తున్న దిగ్విజయాలు, ప్రజలలో పెరిగిపోతున్న పలుకుబడి — హనుమయ్యను అభేద్యమైన ప్రతిఘటనోద్యమాన్ని నిర్మించేట్టు చేశాయి నిజాంసైన్యాలు రజాకార్లు ఆశలు వదులుకున్నారు. దాడి కెళదామనే ఆలోచన తడితే, తగిలిన గాయాలు సలువు పెడుతున్నాయి. నిర్విఘ్నంగా, నిర్విచారంగా హనుమయ్య దళం పోరాటం ముందుకు తీసికెళ్తోంది...

# III

యాక్షను జరిగింది. రజాకార్లు, నిజాంమిల్టరీ తొక్కిన త్రోవను యూనియన్ సైన్యాలు తొక్కుతున్నయి. అమానుషంగా ప్రవర్తించడంలో, పరిపాలించడంలో రజాకార్లను, మిల్టరీని, నిజాంనవాబును తలదన్నారు. వచ్చి రావటం తోనే పార్టీమీద, దళాలమీద దాడి ఆరంభించారు. ప్రజలను విపరీతంగా హింసపెడుతున్నారు. పార్టీ వ్యక్తుల్ని, సానుభూతిపరుల్ని, మిత్రుల్ని వెంటాడి వేధిస్తున్నారు, వేటాడుతున్నారు.

"అందరు రాజీనామాలు చేయండి, బ్రతికి బయట పడతారు! లేదా మిమ్మల మరిచిపోండి! మీరంతా ఎక్క

దుండేదీ, మీ రక్షణ స్థలాలు' ఏవ ఋందీ మాకు బాగా తెలుసు! మేం నైజాం మిల్టరీ, రజాకార్లం కాదు—యూని యన్ సైన్యాలం! భారత ప్రభుత్వం అంతా మా వెనకవుంది! ఆరితేరిన మిల్టరీ మాకు అండదండవుంది. అతి ప్రమాద మ ఋన ఆధునిక ఆయుధాలు వుపయోగిస్తాం! విమానాలు తెచ్చాం! మిమ్మల అడవుల్లో ఏరిపారేస్తాం! బాంబులేస్తాం! టాంకులుపయోగిస్తాం! మెషీను గన్లుతో పేల్చి పారేస్తాం! జాగ్రత! పోరాటం-గీరాటం అనే పిచ్చిభ్రమలు వదులు కోండి! మర్యాదగా లొంగి ఆయుధాలిచ్చి, క్షేమంగా బ్రతి కండి! మళ్ళీ ఒకసారి బాగా చూడండి! ఆలోచించండి— ఎన్నివేల సైన్యంతో వచ్చామో, ఎంత ఆధునిక ఆయుధ సంపత్తివుందో, ఎంత గట్టివునాదులు కల్గిన ప్రభుత్వం మా వెనకవుందో!" ఇలా అనుదినం మిల్టరీ పార్టీని, దళాలను, పార్టీసానుభూతిపరుల నుద్దేశించి వుపన్యసిస్తోంది, ఉధృతంగా ప్రచారం చేస్తోంది.

"మేం నైజాం ప్రభుత్వం కాదు. ఏ ఆట ఆడినా చెల్లుబడి అవడానికి. యూనియన్ సైన్యాలు అండతో కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలో వుందని తెలుసుకోండి! వెనకటిమల్లే యిష్టమొచ్చినట్లు వ్యవహరించారా! దళాలకు తిండి, బట్ట అందజేసి పోషించారా మీ నామరూపాలుండవు! కమ్యూనిస్టుపార్టీతో సంబంధం వదులుకోండి! దళాలలో చేరడం మానుకోండి. దళాలలోవున్న మీ బంధువుల్ని, కొడుకులు-కూతుళ్ళను పిలిపించి రాజీనామా లిప్పించండి! దళాలకు సహాయం చేయొద్దు. ఆవగింజంత దళాలతో

సంబంధం వుందని తెలిస్తే మరణశిక్ష విధించబడుతుంది. పోరాటం, స్వాతంత్ర్యం, అందరికి భూమి వసతి, తిండి అనే భ్రమలు, నినాదాలు, ఆందోళన వదులుకోండి! మీరేం మాట్లాడక్కరలేదు! అన్నీ మాకు తెలుసు. మేం మీ యోగక్షేమాలు శ్రద్ధగా చూస్తాం! పంచుకున్న భూములన్నీ జమీందార్లకు అప్పగించండి! దేశముఖుల ఇళ్ళల్లో తీసుకెళ్ళిన ధాన్యం, సామగ్రి వడ్డీతోసహా వాళ్ళయి వాళ్ళకు ముట్టజెప్పండి! నిమ్మళంగా మేం సంస్కరణలు ప్రవేశపెడతాం.

మా దగ్గరి ఆయుధాలు చూడండి! టాంకులు, మెషిన్ గన్‌లు చూడండి! వాటితో కొండలు పిండవుతాయి. దళాలన్నీ ఏరిపారేశాం! ఎక్కడున్నా ఒకటు అరా వున్నా వారం రోజుల పని. మాకు ఎదురు మాట్లాడొద్దు! ఎదిరించి పోరాడొద్దు సంగంతో సంబంధాలు తెగతెంపులు చేసుకోండి! లేదా సర్వనాశనం కావాలని చేతులారా నెత్తిమీదికి తెచ్చుకోండి" అంటూ యూనియన్ సైన్యాలు ప్రజల్ని హడలగొడుతున్నాయి, విషప్రచారం విపరీతంగా చేస్తున్నాయి.

ప్రజలలో, దళాలలో ఉత్సాహం పరివ్యాప్తి చెందడానికే యూనియన్ సైన్యాలు పెద్ద హడావిడి, దాళ్ళు చేస్తున్నాయి. వేలాది సైన్యాలు గ్రామాలలో ప్రదర్శనలు చేస్తున్నాయి! కొత్తగా రౌడీలను కాంగ్రెసు బురఖా తొడిగి సి.ఐ.డీ.వృత్తికి పెట్టాయి. మిలటరీతో పాటు దిగిన జమీందార్లు, పటేల్ పట్వారీలు సైన్యాల అండ చూసుకొని ద్వేషంతో ప్రజల మీద విరుచుకపడ్డారు.

హనుమయ్య స్వైరవిహారం చేస్తున్న మృగాలను అదుపులో పెట్టదలిచాడు.

"ధన్ ధన్ ధన్ ధన్......"

"ఓ...ఆఁ...పడుకోండి! కిందపడండి" అని కేక లేస్తూ వ్రరిగా అరుస్తూ జీపులోనుంచి కింద దుమికి పడు కుంది మిల్టరీ–హనుమయ్య మెరుపుదాడికి తట్టుకోలేక. జాజి రెడ్డిగూడెం వచ్చి ప్రజల్ని హింసించి, ఆఫీసర్లు, మిల్టరీ జీపులో విజయగర్వంతో పోతున్నారు హనుమయ్య దళం మిట్టమధ్యాహ్నం అనే చింత లేకుండానే ఎదురెళ్ళి, మాటు కాసి కొట్టింది. టైరుపగిలిపోయింది; జీపు ఆగింది. మిల్టరీ. ఆఫీసర్లు కిందపడ్డారు.

"ఠాం...ఠాం...ఠాం"

"అ...ఁహా...అమ్మా..." ఒక మిల్టరీ వాణ్ణి మృత్యువు మింగింది. మొదట దెబ్బకొట్టి దళం నిశ్శబ్దంగా చాలసేపు వుండగానే పడుకున్న మిల్టరీ దళం వెళ్ళిపోయిం దనుకుంది. ఒకడు లేచి అటూ ఇటూ పారచూస్తున్నాడు. హనుమయ్య గురిచూసి కొట్టాడు దెబ్బకి గిలగిలతిరిగి నేలకరి చాడు.

"ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్ ధన్......" మిల్టరీ బ్రెన్‌లు, సబ్ మెషీనుగన్లు భయంతో విపరీతంగా కాలు స్తూంది. దళం నవ్వుతూ, గుళ్ళు వృధా చేయకుండా, నినాదా లిస్తూ, చల్లగా తప్పుకుంది. మిల్టరీ సాయంత్రందాకా, అదన పుబలం సహాయంతో వచ్చిందాకా అక్కడే పడుకొని

కాలుస్తూంది. చుట్టూ వూళ్ళలో ఈ గుళ్ళధ్వని ప్రతిధ్వనిస్తూంది. గట్లు, గుట్టలు ప్రతిధ్వని పలుకుతున్నాయి.

ఈ వార్త ప్రజలకు ఆనందోత్సాహాలు అమితంగా అందజేసింది. దళాలు నూతనోత్సాహంతో విజృంభించాయి. యూనియను సైన్యాలు మింగుడుపడని బ్రహ్మరాక్షసులు మాత్రం కావని దళాలు, ప్రజలు ఆత్మవిశ్వాసం తెచ్చుకున్నారు.

సూర్యాపేటలో కొంత భాగం, భువనగిరిలో కొంత భాగం హనుమయ్య చూస్తూన్నాడు. పార్టీ నిర్మాణకార్యా, మిలటరీకార్యా నాయకత్వం ఈయనే వహిస్తున్నాడు.

యూనియనుమిలటరీ దాళ్ళు తీవ్రమయ్యాయి. వూళ్ళ మీదికి వచ్చే గస్తీదళాలను హనుమయ్య తిప్పికొడుతున్నాడు. కాని మైదాన ప్రాంతమంతా యూనియను సైన్యాలు సైనిక కేంద్రంగా చేశాయి. ఎక్కడ చూసినా మిలటరీయే!

దళాలను పార్టీ అడవి ప్రాంతానికి తిరోగమనం చేయమన్నది. అడవిప్రాంతంలో రక్షణ తీసుకుంటూ వుద్యమాన్ని, పోరాటాన్ని విస్తృతం చేయడానికి పార్టీ నిర్ణయించింది.

సూర్యాపేట దళాలను భువనగిరి దళాలను కామ్రేడ్ హనుమయ్య అడవిప్రాంతం రిట్రీట్ చేయించాడు. వెంటాడుతున్న మిలటరీని ఎదురు దెబ్బ కొట్టి వెనక్కి తరిమాడు.

అనేకసార్లు క్యాంపులమీద దాడిచేసి ప్రభుత్వ గుండెలు కొల్లగొట్టాడు. రణరంగమంటే కుప్పించి దూకే

హనుమయ్య యూనియన్ మిల్టరీకి కొరకరానికొయ్యగా తయారయ్యాడు. ఈయనున్న మిగడానికి మిల్టరీ ఎత్తుమీద ఎత్తు వేస్తుంది.

ఇప్పుడు హనుమయ్యను ఏరియాకమిటీసభ్యుడుగా తీసుకున్నారు, సాటిలేని ప్రజానాయకుడయ్యాడు.

భువనగిరి సమీప అడవుల్లో పెద్దన్న, హనుమయ్య అన్నం తినడానికి ఇ న్నళ్ళు కుట్టుకుంటున్నారు. పెద్దన్న చాల ముఖ్యమయిన కామ్రేడ్. ఈయన మరో జోనుకమిటీనుంచి హనుమయ్యతో మాట్లాడటానికి వచ్చాడు. మూడురోజులనుంచి దీర్ఘచర్చలు జరిగాయి. అంచేత నిద్రలేక చాల నీరసంగా వున్నారు. దళకేంద్రం దూరంగా వుంది. వాళ్ళిద్దరు రహస్యసమాలోచన నిమిత్తం వేరుగా వున్నారు. పని అయి పోయింది. ఈ రాత్రికి యిద్దరు విడిపోయి ఎవరి ప్రాంతం కేంద్రం వాళ్ళు వెళ్ళిపోతారు.

ఎండ తీక్షణంగా కాస్తున్నా, మద్దిచెట్లు, టేకు, మసిర చెట్లు, మాబుళ్ళు దట్టంగా వుండటంవల్ల వాళ్ళమీద అంతగా ఎండపొడ పడటంలేదు. అరణ్యంలో చెట్లకింద ఎంత ఎండలున్నా చల్లగానే వుంటుంది. ఎప్పుడూ నీడ పండివుంటుంది.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......"

"ఆఁ...అబ్బా ... చచ్చిపోతున్నా హనుమయ్యా ...తప్పుకో నువ్వు...కమ్యూనిష్టుపార్టీ ...జిం..దా..బాద్" అంటూ అకస్మాత్తుగా బ్రెన్ గుళ్ళు నాలుగు గుండె, పొట్ట మీద తగిలి ఛిద్రం కాగా పెద్దన్న తక్షణం ప్రాణం వది

లాడు! హనుమయ్యకు ఏం చేయాల్సింది తోయటం లేదు. చేతిలో ఆయుధం లేదు.

"ధన్ ధన్ ధన్ ధన్..." చుట్టూ మిల్టరీ మాట్లుకాని ప్రళయంగా నిప్పులు కురిపిస్తున్నది.

హనుమయ్యకు ఆలోచిస్తే ఫలితం మరింత అధ్వాన్నంగా తయారయ్యేట్టు కనపడ్డది. పదిగజాలదూరంలో కామ్రేడ్ పెద్దన్న నెత్తురుమడుగులో తేలుతున్నాడు. ఎర్రగా జారిన నెత్తురు హనుమయ్య క్రోధానికి పదును పెట్టింది. కళ్ళు కెంపెక్కాయి. పెద్దన్న చేతిలో ఆయుధం వుంది. అది ఆయనతోపాటు మరణించినట్టు మౌనముద్రవహించింది. హనుమయ్య నేలమీద పడుకొని, నెమ్మదిగా పాకిపాకి పెద్దన్నను చేరాడు. మిల్టరీ ఇది చూసి వత్తుకొని, వరుసుకొని పైకురికి వస్తోంది. విపరీతంగా కాలుస్తున్నారు. గుళ్ళు తల నొరుసుకొని పోతున్నయి. 'టపటప' చెట్ల ఆకులు రాలుతున్నయి. కొమ్మలు తునిగి పడుతున్నయి. చెట్లు 'చిటకుట' లాడుతున్నాయి. "ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..." హనుమయ్య విలయకాలరుద్రుడులాగా విజృంభించి, పెద్దన్న స్టెన్‌తో పెద్దన్న శవం రక్షణతీసుకొని మిల్టరీకాళ్ళు చల్లబరిచాడు.

రెండువేపుల తీవ్రస్థాయిలో కాల్పులుసాగాయి. హనుమయ్య రౌద్రజ్వాలల తీవ్రతకు మిల్టరీ తట్టుకోలేక తగ్గి తప్పుకొని త్రోవ యిచ్చింది. పెద్దన్న కళ్ళు వత్తి, శరీరం నిమిరి, ఒకసారి విప్లవాభివందనం చేసి, ఎర్రసైనికుని విడికిలితో వీడ్కోలు చెప్పి మిల్టరీ మధ్యగా హనుమయ్య క్షేమంగా తప్పుకున్నాడు.

మిలట్రీదాళ్ళు వర్ణనాతీతంగా వున్నాయి. ప్రజలు తుపాకులనీడల్లో మగ్గుతున్నారు. దళాలు తీవ్రనిర్బంధంలో చెప్పరాని చెరలు పడుతూన్నాయి.

వూళ్ళోకి ఒక కామ్రేడ్ అన్నం తీసుకురాను వెళ్ళాడు. ఉదయం తొమ్మిది గంటలు అవలేదు. వూరి బయట వాగులో హనుమయ్య, మరో ఇద్దరు కమాండర్లు, ఇద్దరు కొరియర్లు వున్నారు. నెలరోజులబట్టి కడుపునిండా తిండి, నిద్ర, స్నానం, విశ్రాంతి లేదు. ఇవాళ వూరిసమీపం వచ్చాం, అన్నం దొరకబోతూందని కామ్రేడ్సంతా కోలాహలం చేస్తూన్నారు; వువ్విళ్ళూరుతున్నారు. మధుర మనోహరంగా కలలుకంటున్నారు. గీతాలు ఆలాపిస్తున్నారు. కథలు చెప్పుకుంటున్నారు కబుర్లలో మునిగి తేలుతున్నారు.

"ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్ ఠణ్..." హఠాత్తుగా కామ్రేడ్స్మీద నాల్గువేపులనుంచి కాల్పులు జరుగుతున్నాయి. అంతా అరక్షణం స్తబ్ధులయ్యారు. ఆశ్చర్యచకితులయ్యారు. ఎటు పారచూసినా రక్షణలేదు. అంతా మైదానం దుబ్బులు, గడ్డలు, మిట్టలు వుంటే మిల్ట్రీ అవి ఆక్రమించి రక్షణతీసుకుంది. ధారాపాతంగా అగ్నివృష్టి కురుస్తున్నారు.

"అబ్బా... ఆ...హా...ఎర్రజండా..జిం...దా..బాద్" అప్పుడే ఒక కొరియరు కుప్పకూలాడు.

ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ..."హనుమయ్య, తతిమ్మా ఇద్దరూ కమాండర్లు —ముగ్గురు మూడువేపుల వున్నచోటే కాస్త జరిగి వడుకొని క్రాస్ఫైర్ చేస్తున్నారు.

"భయంలేదు కామ్రేడ్స్! తుది నెత్తురుబొట్టు చిందిందాకా పోరాడండి! దేశంకోసం, ప్రజలకోసం, కమ్యూనిస్టు పార్టీకోసం చావడంకంటె మహత్తరమయిన పని, అంతకంటే గర్వపడే కార్యం మరోటిలేదు! మనం ప్రమత్తంగా, పరధ్యానంగా వున్నప్పుడు విద్రోహులు పైనబడ్డారు! అయినా వాళ్ళను పదిమందినీ బలితీసుకోందే మనం మరణించం! పోరాడండి—గుండెలు తుపాకిగుళ్ళు చేసి! ఆయుధాలు పర్వతాలు చేసి! హస్తాలు అనంతకాలసర్పాలు చేసి! జయం మనది! జగత్తు మనది! భవిష్యత్తు మనది!... కాల్చండి! విప్లవం జయిస్తుంది!" అంటూ సింహగర్జన చేస్తున్నాడు హనుమయ్య—చిచ్చులపిడుగులాగా స్టెన్‌తో శత్రువు గుండెలు అదరగొడుతూ.

"ఎందుకు చస్తారురా కొడకల్లారా! ఆయుధాలు అవతల పడేసి, చేతులెత్తండి! లొంగిపోండి!... అట్లానే కాల్పులు సాగించారా క్షణంలో మీరంతా స్వర్గంచూస్తారు! జాగ్రత్త! మేం గూర్ఖాలం! మీ నెత్తురు తాగంది వదలం!... ఏమంటారు బద్మాష్..." అంటూ నలభై మంది మిల్టరీ తిలో గొంతుతో మొరుగుతున్నారు.

"మీరు పోరాడేది కమ్యూనిస్టులతో అని గుర్తుచుకోండి కుక్కల్లారా! ఎవరి పిడికెడు అన్నం పేస్తే వాళ్ళబూట్లు నాకే ఫాసిస్టు ప్రభుత్వసిబ్బందిము కాదు! తెలుగుజాతి విముక్తిసంగ్రామ సైనికులం! కమ్యూనిస్టులం! తెలుగుజాతి వీరులం! విప్లవనేతలం! తల తెగిపడుతున్నా విప్లవకారుడు ఎత్తిన ఎర్రజెండా దించడు! పోరాడండి, అటో ఇటో తేల్చుకొని పోదాం! ఒక్కటి మాత్రం జ్ఞాపకం వుంచుకోండి! మీరు

పదిమంది చావండి మేం అయిదుగురం చావం! ఒకవేళ మేం చనిపోయినా మీ జాతిని, ప్రభుత్వాన్ని హతమార్చను అశేష ప్రజలున్నారు...కాల్చండి" అని హనుమయ్య సమాధానం చెప్పాడు.

రెండువేపుల సంకులసమరం సాగింది గంట రెండు గంటల పోరాటం వృధ్ధులను చూసి శేక మెల్లగా తగ్గుకుంటున్నాయి. నాలుగంటల పోరాటం!! అబ్బ అప్పుడే వంటిగంట యింది!! తుపాను ప్రళయ ప్రళయంగా విచి ప్రశాంత—ప్రేత భూ కాంతితో సద్దుమణిగింది!

ఐదుగురు కామ్రేడ్స్ అస్తమించారు! మిల్టరీకుక్కలు వేడి నెత్తురుకక్కి కళ్ళుమూశాయి! ముప్ఫయిమంది మిల్టరీ వాళ్ళు తీవ్రంగా గాయపడ్డారు! పదిహేనుమంది శవాలను హైదరాబాదు తీసికెళ్ళారు.

ఒక విప్లవ మహాకవిగీతంవంటి జీవితం గడిపిన గాలి హనుమయ్య మర్కటాలూకాకు అంకితమయ్యాడు!



# పంచపాండవుల గట్టు

తెలంగాణాలో అడుగడుగూ పవిత్రమైంది. పల్కరిస్తే పలుకుతుంది. పుట్టుపుర్వోత్తరాలడిగితే పురాణం వుంటుంది చెవుతుంది. ప్రతి చెట్టూ. గుట్టా, గట్టూ, మిట్టా చరిత్రాత్మకమైనవే! ఎందుకు అరణ్యం అంత పచ్చగా, సౌందర్యం తొణుకుతూవుందో అడిగితే—ఒక కావ్యం చదువుతుంది! ఏ ఆదర్శం, ఆశ, ఆకాంక్ష తన్ను పదికాలాలు జీవించేట్టు చేస్తున్నాయో చెప్పమంటే ఒక భారతం తెరుస్తుంది! ఏ గట్టు దగ్గర అలిసి వున్నా, మరేగుట్టవద్ద విశ్రాంతిగా కూర్చునా—పురావీరచరిత్ర సంకీర్తనలు వినిపిస్తాయి!!

పాఖాల అడవులు చరిత్రకు, సౌందర్యానికి ప్రసిద్ధమయినవి. పాఖాల చెరువు ఒక చిన్నసముద్రంలాగా చెరువుచూసి, సమీపంలోవున్న జండాగుట్ట చూడటానికి వెళ్ళాను. మనోహర ప్రకృతి ఆప్యాయంగా, ఆదరంగా ఆహ్వానించింది. ఆశీర్వదించింది. ఆ అరణ్య అందం నన్ను మహాదానందపరిచింది. మైకం తెచ్చింది. మైమరపించింది. సొక్కి, సోలి గుట్టకింద విప్పచెట్ల చల్లని నీడలో తల వాల్చాను. కాసేపట్లో సుఖనిద్రానిమగ్నుణ్ణయ్యాను.

పెద్దగా పాటలు, మాటలు, సంగీతాలు, వినపడుతున్నాయి. నినాదాలు, జయగీతాలు, విప్లవగీతాలు, సంభా

గాలు వినవస్తున్నాయి.. అంతా క్రమంలో, పద్ధతిలో, లయతో, స్వరంతో, మెట్లతో—సంభాషణ, సంగీతం సాగుతున్నాయి. ఏదో పెద్ద రాజకీయవేత్తలు, రాజకీయపాటకులు సమావేశ మవుతున్నట్లు అనుకున్నా, అయినా నేను వచ్చినప్పుడు నర పురుగు కనపడలేదుకదా! ఇంతలోకే ఎక్కణ్ణుంచి వూడి పడ్డారు? ఎటుచూసినా కనీసం పాక, గుడిసె అయినా కనపడ లేదె! ఎక్కణ్ణుంచి ఈ సంచలనం అవతరిస్తోంది? తర్జన-భర్జన పడుతున్నా... ఇంకా సంభాషణ వినపడుతోంది... ముగిసి పోతోంది...

“జయం మనదే! తాత్కాలికంగా శత్రువు సంఖ్యలో ఎక్కువ అవటంవల్ల వాడిదే పైచేయిగా కనపడ్డా చివరకు గెలిచేది మనమే. కోయగూడేలన్నీ నాశనంచేసి మనవాళ్ళను ఇక్కడ లేకుండా చేయాలని కలలు కన్నాడుకదా! బ్రిగ్స ప్లానుతో కోయప్రాంత ప్రతిఘటనోద్యమ నామరూపాలు లేకుండా చేశామని వూహించాడు. ఆచరణలో రుజువయిం దేమిటి? ఎన్ని గూడేలు వాడు నాశనం చేసినా, క్యాంపుల దగ్గరకు తీసుకపోయినా ప్రతిఘటన బ్రహ్మాండంగా సాగు తోంది. క్యాంపుల కెళ్ళకుండా పార్టీ పిలుపు అందుకొని చాల కుటుంబాలు ప్రజలు అడవికి తరల్పుకొని పోరాటకార్య క్రమం ముందుకు తీసుకపోతున్నారు. క్యాంపుల దగ్గరున్న కోయకుటుంబాలుకూడ ప్రాణాలు తెగించి పార్టీకి సహాయం చేస్తున్నారు. శత్రు వ్యూహాలు, ఎత్తుగడలు, ఆచూకి అంద జేస్తున్నారు. అంచేత శత్రువుతినే దెబ్బలు మన బలాధిక్య

తను తోడ్పడుతున్నాయి. మనవాళ్ళు ఎన్నాళ్ళు ప్రజా సముద్ర గర్భంనుంచి పోరాటం సాగిస్తుంటారో అన్నాళ్ళు శత్రువు ప్లానులు, ఆశలు కట్టగట్టి నీళ్ళలో పారేసినట్టే!

"నల్లగొండ జిల్లాలో వుద్యమం చాల దెబ్బతిన్నదని వార్తలు వస్తున్నాయి..."

"మైదాన ప్రాంతంనుంచి అడవి ప్రాంతం తాలూకాలకు వుద్యమం రక్షణకు, విస్తృతికి వెళ్ళింది. అంతేకాని అక్కడి వుద్యమం అంతరించలేదు. పై పెచ్చు శాఖోపశాఖలుగా విస్తృతమవుతోంది. దేవరకొండ, మిర్యాలగూడెం, భువనగిరి, తాలూకాలలో ముందెప్పుడూ లేని వుద్యమం మూడుపూవులు ఆరుకాయలుగా ముందుకు పోతూంది..."

"విన్నారో లేదో మనవాళ్ళు ఆదిలాబాద్, కరీంనగర్, మహబూబ్‌నగర్, బస్తరు ప్రాంతాలకు పోరాటం విస్తృతం చేశారు. ఆంధ్రలో మనకు అండగా ప్రతిఘటనోద్యమం సాగుతోంది. కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలలో పోరాటం తీవ్రరూపం తీసుకుంది. దీంతో శత్రువు చిత్తు—చిత్తు అవుతాడు. వాడిబలం బహుముఖాలుగా కేంద్రీకరించాల్సి వస్తోంది. ఒక కాలు యిక్కడుంటే మరో కాలు నల్లమల అడవిలో వుండాల్సి వచ్చింది. ప్రత్యేక ప్రాంతంమీద కేంద్రీకరించలేక పోతున్నాడు. ప్రజల్లో అసంతృప్తి. అలజడి అసహ్యం ఎక్కువయ్యాయి. ఆంధ్ర—తెలంగాణా ప్రజలు ముక్తకంఠంతో కాంగ్రెసుప్రభుత్వాన్ని శపిస్తున్నారు, ద్వేషిస్తున్నారు. శత్రువుగా చూస్తున్నారు...ఈ నిరంకుశ ప్రభుత్వం రోజులు దగ్గరపడ్డాయి"

"ఇక్కడే కాదు, చైనాలో మన ఎర్రసేనలు నాన్ కింగ్‌ను పట్టుకున్నాయి. చుంకింగ్ పడిపోయింది. షాంఘై పడిపోయింది. రేపో ఎల్లుండో దేశం అంతా విముక్త మవుతుంది. జంక్షైషేక్ సైన్యాలు పారిపోతున్నాయి. శరణు కోరి ఎర్రసైన్యాలకు లొంగుతున్నాయి. మలయాలో గెరిల్లాలు బ్రిటీషు వృద్ధ సింహం జూలుపట్టి ఆడిస్తున్నారు. బోసినోట్లో వున్న మూడు,నాల్గు పళ్ళు పీకిపారేశారు. వీట్‌నాంలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించారు. ఫ్రెంచి పరప్రభుత్వానికి వ్యతిరేకంగా వీట్‌నామ్ ప్రజాసేనలు పోరాడుతున్నాయి. విజయ పరంపరలను వరిస్తున్నాయి..."

"అలు చూడండి! అక్కడ ఎవరో సి.ఐ.డి. లాగుంది పడుకున్నాడు. వీడి తస్సాదియ్యా వీడికెంత ధైర్యం! ఎన్ని గుండెలు! ఒక్కడే వచ్చి అంతా ఆరా తీస్తున్నాడు! ఎవడో చూద్దాం పదండి!"

ఈ చివరి వాక్యంలో 'అమ్మో' అని గావుకేకపెట్టి, వులిక్కిపడి లేచాను. తల తిరిగిపోయింది. నిజంగా వాళ్ళు గెరిల్లాలు! నన్ను సి. ఐ. డి. అనుకొని ఖతం చేయడానికి వస్తున్నారు! ఏదో వాళ్ళు రాజకీయాలు మాట్లాడుతున్నారు గదా అని, మంచి నిద్రలోనల్లా చెవులు అప్పగించి విన్నా. వాళ్ళు నన్ను పసికట్టి పైకి దూకివస్తునారు. ఇంకేముంది!! భయపడి కళ్ళు తెరిచాను, వళ్ళంతా యింకా వణుకుతూనే వుంది, ముచ్చెమటలు ధారకడుతూనే వున్నాయి, లేచి పరుగెత్తే ప్రయత్నంలోవున్నా, కాళ్ళు లేవడంలేదు.

చుట్టూ పరికించి పారచూశాను. అడివంతా

మధ్యాహ్నం నిశ్శబ్దంలో నిశ్శబ్దంగా వుంది. చెట్లు వృక్షాల లూగుతున్నాయి. నిలువెత్తున పెరిగిన పచ్చని గడ్డి సిగ్గు పడుతూ తలొంచింది. ప్రకృతంతా గంభీర మౌనముద్ర వహించింది. జండా గుట్టకేసి ఎంత గుచ్చి,గుచ్చి చూసినా నా వేపు చూడటంలేదు. 'ఏమిటీ గందరగోళం?' అన్నట్టుముఖం పెట్టినా మాట్లాడటంలేదు. ఎవరూ ఎటుచూసినా కనపడటం లేదు. ఏ సంచలనం, సంచారం, సంభావన లేదు! నాకు కొంచెం ధైర్యం వచ్చింది. చెమట చల్లగా జారిపోతోంది. బయలుదేరాను. అంతా నిద్రలో ఏదో స్వప్నం చూసి భ్రమించా ననుకున్నా. వెళ్ళిపోదామని లేచాను. అయినా ఎవరయినా, ఎక్కడైనా నక్కివున్నారేమో? నన్ను బయలుదేరటం చూసి పైన పడతారేమో? సి.ఐ.డి.గా వచ్చి వాళ్ళ ఆచూకి తీసుకొని పారిపోతున్నాననుకుంటారేమో? అంత అపాయం నెత్తిమీదికి తెచ్చుకునేకంటే, నిలబడి ధైర్యంగా ఒకటికి పదిసార్లు కేకలేసి పిలుద్దాం అనిపించింది. ఎవరయినా వున్నారా దగ్గరికి వస్తారు. సి.ఐ.డి.ని కాదని తెల్సుకొని వెళ్ళిపోతారు. లేకపోతే అన్ని విధాలా ఇబ్బంది వస్తుంది అని అనుకొని ఆలోచించి నిశ్చలంగా, నిర్మలంగా నిలబడ్డాను. పరిసరాలు ప్రతిధ్వనించేట్లు కేకలు మొదలెట్టాను.

"ఏమండోయ్...ఎవ రక్కడుండీ?...హోహోయ్... ఇక్కడెక్కడన్నా మంచీళ్ళు దొరుకుతాయా?...పరసంపేట వెళ్ళే దో వెటుంది?...హో హో...ఎవ రటు పోయేది? కాస్త దారి చెప్పండి..." ఇలా పెద్ద-పెద్దగా, గొంతు పగిలి పోయేట్లు కేకలు పెట్టాను. ప్రతి పలుకులేదు. గుట్ట మాత్రం ప్రతిధ్వనిస్తుంది పీలగా, బలహీనంగా, బాధగా.

అరిచి అరిచి గొంతు నెప్పెడుతోంది. ఎవరూ లేరని, నా ధర్మం నేను నిర్వర్తించానని, మరేం ప్రమాదం పైన పడటంలేదని నిశ్చయించుకొని దారిపట్టాను. దూరంగా ముందువేపు పాఖాల చెరువు నీళ్ళు పాలసముద్రపొంగులా కనపడుతున్నాయి. చుట్టూ అరణ్యరాణి వింతవింత రంగుల చీర, రవిక ధరించి విచిత్ర స్వరూపంతో, పుష్కలంగా సొగసు, సోయగం, సౌందర్యం పుట్టిపడుతుంటే వయ్యారంగా నల్లాపాలాడుతూంది నత్తిమీది పొద్దు జరగలేక ముందుకు జరుగుతూంది. మందంగా మందమారుతం కదులుతూంది.

"ఎందుకొచ్చావు ఇక్కడికి?" హఠాత్తుగా ఒక ప్రశ్న సమ్మెట వేటులా వీపుమీద తగిలింది. గుండెలు దడదడలాడాయి. కుంగిపోతూ, వణుకుతూ వెనక్కి తిరిగిచూశాను. ఎవరూ లేరు ఆందోళనతో సతమతమవుతున్న నేనే ఎవరో పిలిచినట్లు భ్రమించాననుకొని మళ్ళా నడకసాగించాను.

"ఇదో నిన్నేనయ్యా! ఎక్కడి కెళ్తున్నావు?" తీవ్ర స్వరంతో అదే గొంతు గజగజలాడాను. కంపించిపోయాను.

"నరసంపేట... వె... ళ్తున్నా" నీళ్ళు నములుతూ, చేతులు కట్టుకొని వినయ విధేయతలతో వెనక్కి తిరిగి మనవి చేశాను...

"ఇక్కడి కెందుకొచ్చావు?" గద్దించి పలుకుతున్న కంఠం.

"పొరపాటున వచ్చా! క్షమించండి..." ఏదో మహాపరాధం చేసిన వాడికిమల్లే ముఖంపెట్టి క్షమాభిక్ష అడిగాను.

"అడిగేదానికి సమాధానం చెప్పు. తర్వాత క్షమాపణలు కోరుకోవచ్చు. ఎందుకొచ్చావిక్కడికి?"

మాట్లాడేది ఎవరో కనపట్టంలేదు. అయినా సమాధానం చెప్పంది తప్పుతుందా? స్పష్టంగా, మొలలో చేయ్యేసి నిలేసి మాట్లాడుతున్నట్టు అడుగుతుంటే! అధికారం చలాయిస్తుంటే.

"తెలంగాణా అడవులు చరిత్రలు చెపుతాయంటే విందామని వచ్చాను. ఈ గుట్ట, అడవి చూసిపోదామని ఇటు వేపు వచ్చాను బడలిక, అలసట నడవనీయకపోతే కాస్త పడుకొని కన్ను కునికాను. మీకు అభ్యంతరం లేకపోతే మీరెవరో, ఎందుకు నన్నింత గట్టిగా గుచ్చి-గుచ్చి అడుగుతున్నారో చెప్పండి" చాల జాగ్రతగా తూచి, తూచి సమాధానం చెప్పాను.

"ప్రభుత్వం సి.ఐ.డీ.వి కాదా?"

"ఎంతమాటన్నారు! అంత దుర్మార్గానికి పాల్పడే దౌర్భాగ్యుణ్ణి కాదు! ప్రజలు అష్టకష్టాలతో, అవస్తలతో, ఆత్మార్పణతో సాగించే ఈ స్వాతంత్ర్య సమరాన్ని నేను వేయినోళ్ళ కీర్తిస్తాను! అభినందిస్తాను! ఆరాధిస్తాను. ఈ నిరంకుశ ప్రభుత్వాన్ని ద్వేషించే స్వాతంత్ర పిపాసుల్లో నే నొకణ్ణి" అన్నాను దుడుకుగా అభిమానం దెబ్బతిని తిరగబడగా.

"ఏం కావాలి యిక్కడ మీకు?"

"ఇక్కడ ఏ మహాచరిత్రయినా అట్టడుగున పడివుంటే నాకు చెప్పండి. ఆ బంగారు చరిత్ర తవ్వి తీసి, మెరుగులు దిద్ది జగత్తుకు వినిపిస్తాను."

"మీరేం చేస్తుంటారు?"

"నేను కవిని"

"ఓ, అలా చెప్పరూ! అయితే ఇలా రండి! కూర్చోండి" అన్నదా గొంతు వాత్సల్యం వలకబోస్తూ. ప్రశాంత చిత్తంతో ప్రమోదభరితంగా పొదరింటి పక్కన కూచున్నా. ఆ మాట్లాడే అదృశ్యవాణి ఎవరో నాకు అవసరంలేదు. నాకు కావల్సింది — ఆ చెట్లకిందా, గుట్టకిందా, పచ్చని పొదరిళ్ళ హృదయంలో అణిగిమణిగున్న జీవిత సత్యాలు.

"ఈ ప్రదేశం చారిత్రాత్మక మయిందా?" ప్రశ్నించాను.

"అవును"

"చెప్పండి"

"జాగ్రతగా, శ్రద్ధగా విను. జీవితానికి సార్థకత దేశంకోసం, జాతి శ్రేయస్సుకోసం జీవితం అంకితం అయినప్పుడే వుంటుంది. తమ ఆశల్ని, ఆస్తుల్ని, ఆప్తుల్ని త్యజించి కిరాతక నిజాం ప్రభుత్వాన్ని, కర్కోటక కాంగ్రెసు పరిపాలనను ఎదిరించి పోరాడి, పోరాటంలో వరిగిన ఐదుగురు మహా వీరుల చరిత్ర నీకు చెప్తాను. ఆ వీరు లిక్కడే ఏడాదినాడు మరణించారు. వారి సమాధులను గౌరవించడానికి, వారి స్మృతిని మధురతరం చేయడానికే ఈ అరణ్యం యింత శోభాయమానంగా వుంది! వారి సమాధులను అరణ్యం వుద్యానవనంగా, నందనవనంగా మార్చి తన అనంత ప్రేమ హృదయాన్ని వ్యక్తపరుస్తోంది. తన సౌందర్యంతో, చల్లని

హస్తాలతో వారి ఆత్మలకు శాంతి ప్రసాదిస్తోంది. వారు కూడ నీతో మాట్లాడతారు.

ఇహ వినండి! యూనియన్ సైన్యాల రాక్షసదాళ్ళతో దళాలకు తిండి, సప్లయిలు అందటం చాల కష్టమయింది. పోరాట యంత్రాన్ని, దెబ్బతీయడానికి మిల్టరీ చాల కృషి చేసింది. పార్టీ సంబంధాలు, మార్గాలు ఛేదించడం ప్రధాన కార్యంగా తీసుకుంది. పాఖాలలో ఈ ప్రాంతపు రెండు దళాలు పార్టీ సంబంధం పోగొట్టుకున్నాయి. నల్గురు కొరియర్లు కాంటాక్టులు పోయి చిక్కబడ్డారు. ఇద్దరు ఆగ్నే జిల్ల కేంద్రాలమీద పోలీసు దాళ్ళు ముమ్మరం కావడంతో తప్పుకున్నారు. వాళ్ళకు పార్టీకి సంబంధం తెగిపోయింది. ముగ్గురు మహిళా కామ్రేడ్స్ సంబంధాలు పోయి ఇటువేపు వచ్చారు. వీళ్ళంతా తిరిగి–తిరిగి ఈ జండాగుట్ట కింద చేరారు. రెండు నెలలు తిండి, స్నానం, నీళ్ళు లేవు. ఏదో అడివిలో దొరికిన ఆకు అలం తిని శల్యావశిష్టంగా తయారయ్యారు. ఒకొక్కళ్ళ వంటిమీద బెత్తెడెత్తు మట్టి పేరుకుంది. చిరపోతులు కుప్పలు-తిప్పలుగా పడి చేత్తో తాకితే చేతినిండా వస్తున్నాయి తలలు దువ్వక, క్షవరం చేయక జడలు కట్టాయి. ఒక్కొక్కసారి వాళ్ళలో వాళ్ళు 'మేం మనుషులమేనా! మాలో మానవ లక్షణాలన్నీ వున్నాయా?' అని తర్కించుకుంటుండేవాళ్ళు. పార్టీ సంబంధంకోసం నిత్యం ప్రయత్నం చేసేవాళ్ళు.

ఒకరోజు కొరియర్లు బియ్యం, పప్పు, కూర సంపాదించారు. కామ్రేడ్సంతా మహదానందపడి గంతులేశారు.

తలా కాసిని బియ్యం, పప్పు పచ్చివే తీసుకొని బొక్కు-తున్నారు. నాలుగు మైళ్ళు వెళ్ళి నీళ్ళు సంపాదించారు. మహిళా కామ్రేడ్స్ ముగ్గురూ వంట చేస్తున్నారు. అన్నం కుతకుతలాడటం, పప్పు ఘుమఘుమలించడం, చిక్కు-డు, గుమ్మడి కూర సౌరభాలు విరజిమ్మడంతో కామ్రేడ్స్‌కు పోయిన ప్రాణాలు లేచి వచ్చాయి. నోరూరా వంటకు ఎదురుగా కూర్చొని ఖాతాఖానీ వేసుకున్నారు. కొందరు జ్వరంతో మూలపడి వున్నారు.

అదుగో నాయనా గుట్టకింద ఆ మసుగు చూడు. ఆ చెట్ల చాటున—అక్క-డే యిరవై యిద్దరు కామ్రేడ్స్ వుంది. వంటచేసిన ప్రదేశం కూడ బాగా పరిక్షించి చూడు—నల్లగా కాలి కమిలిన పొయిరాళ్ళు కనబడతాయి. అక్క-డే అంతా కూర్చుంది. నివసించింది.

మధ్యాహ్నం అయింది. వంటకాల వుతూనే వున్నయి. అరుస్తున్న పేగులకు వుడుకుతున్న వంటకాలు చూపించి కామ్రేడ్స్ శాంతిపరుస్తున్నారు. సంతృప్తి పడుతున్నారు.

ఇంతలో ఒక విపత్తు నెత్తిమీద పేలింది—హఠాత్తుగా, అమానుషంగా.

ఠాం ఠాం ఠాం ఠాం ఠాం ఠాం........."

"పట్టుకోండి! కాల్చండి! తన్నడి! లంజకొడుకుల్ని వక్క-డ్ని కూడ పోనియొద్దు!.........కాల్చాండిరా! బాయి నెట్లతో కుమ్మండి!......ఒక్క-నాకొడుకును గూడ తప్పుకోనియొద్దు!" అంటూ వులిగాండ్రింపులు.

"ఠాం ఠాం ఠాం ఠాం......"

"ఆఁ......అబ్బా......హో......ఓ...వో...... ఆఁ......కామ్రేడ్స్ ఆయుధాలు జాగ్రత్త! వెంటనే తప్పుకోండి!...వో...అబ్బా..." అంటూ కామ్రేడ్స్ ఆర్తనాదాలు!

అకస్మాత్తుగా ఎనభై మంది మిల్టరీతో భూస్వాములు, మిల్టరీ ఆఫీసర్లు కామ్రేడ్స్ మీద ముట్టడించారు. గుట్టకింద మూల నున్న కామ్రేడ్స్ కేంద్రంమీద—పై కొండ బండల మీదనుంచి హఠాత్తుగా దూకారు. ఆయుధాలన్నీ అక్కడొకటి ఇక్కడొకటి పడేసి వున్నాయి. నిరాయుధంగా వున్న కామ్రేడ్స్ మీద పడి, చెలగి, చెల్లాచెదురు చేసి, వెంటాడి వధిస్తున్నారు. తలో వేపు పరుగెత్తారు. మిల్టరీ చేతికి చిక్కిన వాడ్ని చిక్కినట్టు చిత్రవధ చేస్తున్నారు. కాల్చి పారేస్తున్నారు. కామ్రేడ్స్ ఆయుధాలు వదిలి, చేతికి దొరికిన ఆయుధాలు తీసుకొని ప్రతిఘటిస్తూ పరుగెత్తుతున్నారు. అంతా గగ్గోలుగా, గందరగోళంగా, భీభత్సంగా కన్నుమూసి కన్ను తెరిచేటప్పటికి మారిపోయింది.

ఆఁ......ఆఁ......వో... దాహం... అమ్మా... కమ్యూనిస్టుపార్టీ...జిం...దా...బాద్"

"పందుల్లారా తుపాకీతో కాల్చండిరా. బాయినెట్‌తో పాటి సైనికుడ్ని చిక్కింతర్వాత పొడుస్తారురా... అబ్బా...కమ్యూనిస్టుపార్టీ.."

ఒకరుకాదు ఇద్దరుకాదు, పావుగంటలో ఐదుగురు యోధాన యోధులు నేల కూలారు.. ఇరవయి ఇద్దరులో

పదిహేడుమంది కామ్రేడ్స్ క్షేమంగా...కొందరు గాయాలతో—తప్పుకున్నారు.

నేలంతా రక్తంతో, కామ్రేడ్స్ ఖండితావయవాలతో నిండి గోడుగోడున వాపోయింది. ఈ కామ్రేడ్స్‌ను దహనం కూడ ఇక్కడే చేశారు. ఈ ఐదుగురు కామ్రేడ్స్ పేరుతో- ఆనాటినుంచీ ఈ జండా గుట్టను - పంచపాండవుల గట్టు అని పిలుస్తారు.

నువ్వు ఇక్కణ్ణుంచి తిన్నగా పదడుగులు వేస్తుంటే- ఆ కామ్రేడ్స్ ఒక్కొక్కరు తమ పురా చరిత్ర విపులంగా వివరిస్తారు. అలా చేయండి వారి జీవితగాథలు ప్రపంచం పదికాలాలు మననం చేసుకొనేట్లు చేయండి! భావిభారత విప్లవోద్యమ మార్గదర్శకులుగా వారిని జాతివీరులుగా పూజించేట్లు, భావి చేట్లు, స్మారక దినోత్సవాలు చేసేట్లు చేయండి! నేను వెళ్ళొస్తా. సెలవు" అంటూ ఆ అదృశ్య వాణి ముగించి వెళ్ళిపోబోతూంది.

"వుండండి, వుండండి. కాస్తమీ పేరుచెప్పి వెళ్ళండి" అని ఆదుర్దాగా అడిగాను.

"నా పేరా, ప్రస్తుతానికి అంతగా అవసరం లేదు... మాటవరుసకు స్వాతంత్ర్య సంగ్రామం సాగించే సమరశీలం గాణాగా జ్ఞప్తి పెట్టుకోండి. అది చాలు" అని వెళ్ళిపోయింది. ఆమెమాట ఆగిపోయింది. ఏదో దేవలోకంనుంచి కింద పడేసినట్లుంది నా పని. ఆమె చెప్పినట్లు ఆ వీరులతో మాటాడటానికి అడుగులో అడుగు వేసుకొంటూ బయలుదేరాను.

నాలుగడుగులు వేసేటప్పటికి నేను నిద్రపోతున్నప్పుడు మాట్లాడిన గొంతులు, స్వరాలు మళ్ళా వినబడ్డాయి. ఆశ్చర్యపడ్డాను. కాస నడుస్తూనే వున్నా.

'చెప్తున్నా విను మరి' అంటూ ఆ స్థలం ఆపింది. ఆగాను. చెప్పమన్నట్టు ముఖం పెట్టి నిలబడ్డాను.

## మల్లెల లచ్చయ్య

నా పేరు లచ్చయ్య. పాఖాల తాలూకా. మా వూరు పెగడిపల్లి. మా నాన్న పేరు పాపయ్య, ముగ్గురు తమ్ముళ్లు, ఒక చెల్లి వున్నారు. మాది కోయకుటుంబం నాకు ఇరవై రెండేళ్ళుంటాయి. మాకు నాలుగెకరాల మెట్ట, ఒక ఎకరం మాగాణి వున్నయి. అవి చేసుకొని బ్రతికేవాళ్ళం. పొలంమీద ఆరు నెలలు గ్రాసం వచ్చేది. తతిమ్మా ఆరు నెలలు అడవిమీద కాయ గడ్డ ఏరుకొని బ్రతికేవాళ్ళం. సంఘం మా వూరు వచ్చిందాకా ప్రపంచం ఎలాంటిదో తెలియదు. నరసంపేట పోతే ఎటు తూర్పు అయిందీ, ఎటు పడమర అయిందీ తెలిసేది కాదు.

సంఘంవాళ్ళు మా వూరు రాగానే అందరితో పాటు నేనూ భయపడి పారిపోయాను. వాళ్ళు ఆడవాళ్ళను ఎత్తుకెళతారనీ, పట్టుకొని పోతారనీ, వూళ్ళో ఎవరు మాట్లాడిన వాళ్ళను ఎగరేసి నరుకుతారనీ, ఇళ్ళు దోస్తారనీ విన్నాను. మా వూరు వచ్చిన పోలీసు. సిపాయి, పటేల్, పట్వారీ, దేశ్‌ముఖులు అంతా అదే చెవినిల్లు కట్టుకొని చెప్పారు. నమ్మాం. సంగం వాళ్ళు వూళ్ళోకి వచ్చి చూస్తే పసిపిల్ల

లేదు. అంతా పారిపోయారు. ఇద్దరు ముగ్గురు కాళ్ళు, కళ్ళు లేని ముసలాళ్ళు గుడిసెలు పట్టుకొని వున్నారు. వాళ్ళువచ్చి ముసలాళ్ళతో వాళ్ళ కార్యక్రమ, వుద్దేశాలు, ఎక్కడ ఏం చేసిందీ చెప్పిపోయారు. ఎవర్ని ఏం అనలేదు. ఏ ఇల్లూ దోయలేదు. వాళ్ళు వచ్చిపోయిన పదిరోజులకు చుట్టూ వూళ్ళనుంచి మాకు సంఘాన్ని గురించి చాల సదభిప్రాయాలు వినవచ్చాయి. వచ్చిన చుట్టం అల్లా సంఘాన్ని గురించి కొండంతగా చెప్పేవాడు. మా దూరపు బంధువులంతా సంఘంతో బోలెడు సంబంధాలు పెట్టుకున్నారని నిమ్మళంగా తెలిసింది

నేను సంఘంతో సంబంధం పెట్టుకొని వూళ్ళోనుంచి తిండి సప్లయి అందజేసేవాడ్ని. చాలా కాలం ఇట్టా జరిగిపోయింది. అడవిలో రక్షణ ప్రదేశాలు, కొత్త సెంటర్లను నేనే ఏర్పాటు చేసేవాడ్ని. కాని నాకు ఆయుధంపట్టి పోరాడాలని ఎంతో కుతూహలం వుండేది. దళం వప్పుకోలేదు. ఎంతో నిజాయితీ, సమ్మకం పార్టీమీద విశ్వాసంచూపాను. పార్టీ వ్యక్తిగా గుర్తించడానికి విపరీతంగా పార్టీపని చేశాను.

చివరకు పార్టీ దళంలోకి తీసుకుంది. ఆయుధంఇచ్చింది నాతోపాటు పదిహేనుమంది కుర్రవాళ్ళను మా వూరునుంచి దళాలలోకి తీసుకొచ్చాను. కాని తల్లిదండ్రుల పోరు చాల ఎక్కువయింది. కాళ్ళ వేళ్ళ బడి ఏడ్చి మొత్తుకొని అల్లరి పెట్టాను. నన్ను మరో కేంద్రం మార్చమని పార్టీని కోరాను. పార్టీ వప్పుకుంది. మావాళ్ళు ఎంత ఏడ్చినా, దిగులుపడ్డా నేను మెత్తబడలేదు.

నా నేర్పు, నిపుణత, జాగ్రత, అభివృద్ధి చూసి పార్టీ నన్ను దళ కమాండరుగా తీసుకుంది. నా తల్లిదండ్రులనుకూడ మార్చాను. వాళ్లు పార్టీ అంటే పడి చచ్చేంత సానుభూతి పరులయ్యారు. ప్రభుత్వ నిర్బంధానికి తట్టుకోలేక అంతా క్యాంపులకింద కెళితే, మా అమ్మ నాన్న, కుటుంబం పార్టీ కోరిక ప్రకారం అడవికి వచ్చి పార్టీకి అండదండగా నిలబడ్డారు.

నే నిప్పుడు చదవను రాయను నేర్చుకున్నా. రామాపురం క్యాంపుమీద దాడి దిగ్విజయంగా చేశాను. అనేక మంది ప్రజాద్రోహులకు బుద్ధి చెప్పాను. ఈ రోడ్లవెంట వ్యానులు నడవకుండా చేశాను. నా రహస్య పేరయిన నందయ్య అంటే మిల్టరీ హడలిపోతుంది.

నా భార్యను తీసుకపోయి నరసంపేట క్యాంపువాళ్లు అంతా చెరిచి, ఆమెను అక్కడే వుంచుకున్నారు. అలా చేసి నన్ను వంచాలని వాళ్ళ ప్రయత్నం. వాళ్ళ అమానుషత్వం వాళ్ళ జీవనాడులను తెగించి తెగవేసే శక్తిని నాకు ప్రసాదించింది. మా కుటుంబం కూడ నానా అవస్తలు పడుతోంది. ఇవి ఏమీ నా పోరాట కార్యక్రమాన్ని కుంటు పరచలేదు. విద్రోహ మిల్టరీని వెంటాడి వేధించాను. వందలాది ఎకరాల అడివి కొట్టి రైతులు సాగు చేసుకునేట్టు చేశాను. ఈ ప్రాంతానికి ప్రజలే నాయకులు. పరిపాలకులు అయ్యారు.

కారణాంతరాల వల్ల పార్టీ సంబంధంపోయి ఇటు వచ్చాను. కామ్రేడ్స అందరితోపాటు నామీద శత్రువు

దాడిచేశాడు. ఆయుధం చేతిలో లేదు; లేకపోతే వాళ్ళం దర్ని నా పక్కడి చేతిమీదుగా హతమార్చే వాణ్ణి. కాల్చ గానే ఆయుధంకోసం కరుగెత్తే నా గుండెకు గుండు తగి లింది. మళ్ళీ గుండెపైన ఆయుధం ఆనించి కాల్చారు! ప్రాణాలతో వున్న నన్ను కాట్లో వేసి తగలబెట్టారు!

నేను సంతోషంగా మృత్యువును గ్రోలాను! బ్రతకా లనే కాంక్ష నాకు లేకకాదు. చాల బలమైనకోంక వుంది కూడా. జాతి విముక్తికోసం పోరాడుతుంటే మృత్యువు ఎదురయింది. వెనక్కి చూడకుండా దానికి ఆహుతయ్యాను. మీరంతా నే నెత్తిన జండాకింద పోరాడండి! సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించండి.

## పిచ్చయ్య

మాది నాగారం. కోయ కుటుంబీకుణ్ణి. మాది పాఖాల తాలూకే. నాకు ఇరవై మూడేళ్ళుంటాయి. పెళ్ళ యింది. పిల్లలులేరు. తండ్రిలేడు. తల్లీ—తమ్ము డున్నారు.

అనేక కుటుంబాలు ఆర్పి భూస్వామి అయిన రామి రెడ్డి ఇంట్లో జీతం చేసేవాణ్ణి. నాకు జీతం ఏమీ ఇవ్వడు. ఏదో మా నాయన బ్రతికున్నప్పుడు పది మాసికలు వడ్లు అప్పు తెచ్చుకున్నాడట! దానికింద నాల్గు ఎకరాలు-మాకున్న కాస్తపొలం కట్టుకున్నాడు. నా తమ్ముణ్ణి, నన్ను దానికింద, దాని వడ్డీకింద జీతం చేయించేవాడు. అదెన్నాళ్ళకు తీరదు. కనీసం చాకిరి చేస్తున్నందుకు అన్నం అయినా పెట్టడు. ఇంట్లో వున్న ముసలి తల్లి అడక్కొచ్చే అన్నం, అడవిలో ఏరు

కొచ్చే కాయగడ్డలు తిని నికృష్ట జీవితం పెదపురుగుకంటే హీనంగా గడిపేవాణ్ని. దానికి తోడు నిత్యం తన్నులూ బూతులు దొరగారి దగ్గిరినుంచి బహుమతులుగా వచ్చేవి.

సంఘం సంగతి విన్నాను. ఎన్నివిధాల ప్రయత్నించినా సంఘం సంబంధం దొరకలేదు. చివరకు నానా అగచాట్లుపడి సంఘంతో సంబంధం కలుపుకున్నా. కాని పార్టీ వెంటనే దళంలోకి తీసుకోవడానికి వప్పుకోలేదు. నా ఆశలన్నీ ఒక్కసారి పుటుక్కున తునిగిపోయాయి. కొన్నాళ్ళు పార్టీని అంటిపెట్టుకొనివున్న తర్వాత దళంలోకి తీసుకున్నారు

1947 నుంచి దళంలో చేరి పనిచేస్తున్నా. రజాకార్లతో పోరాడటం మహాసరదాగా వుంటుంది. వాళ్ళ కంటే పిరికితనంలో, స్వామిద్రోహంలో, పారిపోవట లో పూరకుక్కలు అనేకరెట్లు నయం! ఎన్నోసార్లు రజాకార్లను చిత్తుచిత్తు చేశాను. వూళ్ళమీద దాళ్ళు చేయకుండా తరిమాను. ఒకనాడు గూడూరు క్యాంపు రజాకార్లు, మిల్టరీ గాజులపల్లి, అయోధ్యాపురం దోచి, ప్రజలను నానా అవస్తలు పెట్టి, కల్లు, సారా దట్టంగా తాగి, ఇంపై మేకపోతులు, నాలుగు బళ్ళ దోపిడీ ఆస్థి తోలుకొని వస్తున్నారు. లబోదిబోమంటూ ప్రజలు నా దగ్గరికి వచ్చారు. నేను దళంతో వెళ్ళి దాడిచేసి పాఖాల చెరువుకు వాళ్ళను ముగ్గుర్ని బలియిచ్చాను. పదిమందిదాకా ఒకటే కాల్చడం! వాళ్ళు దోచుకొచ్చిన ఆస్థిని ప్రజలకు పంచిపెట్టాను. పాపం! అప్పుడు ప్రజలెంతగా ఆనంద సముద్రంలో ఓలలాడారు! జీవిత కష్టార్జితం లెక్క

కడితే వంద, వేయిరూపాయలు దాటదు—అది కాస్తా ఎవరో కొల్లగొడితే ఇహ వాళ్ళగతి చెప్పేదేముంది?

యాక్షను అయింతర్వాత యూనియన్ మిల్టరీ ఘోరాలు చేయడంలో నైజాంమిల్టరీ, రజాకార్లను తల తన్నింది. నాకు రైఫిలు ఇచ్చారు. ఉపకమాండరుగా తీసుకున్నారు. బాగా సారస్వతం చదివేవాణ్ని. మిల్టరీవాళ్ళన్ని తిప్పికొట్టి, ప్రజలకు, పోరాట కేంద్రాలకు రక్షణ కల్పించేవాణ్ని.

మళ్ళీ ఈ గూడూరులోనే గూర్ఖాలువచ్చి పెద్దక్యాంపు పెట్టారు వీళ్ళు ఒకరోజు మద్రివాడపోయి, అక్కడ క్యాంపు వేయను పరిస్థితి, ప్రదేశం చూసివస్తున్నారు. సాయంత్రం ఐదు గంటలవుతుంది. మేం మూడుదళాలతో వెళ్ళి పూల్ల వాగులో మాటుకాసి దాడిచేశాం. అంతలావు ఘనత వహించిన గూర్ఖాలు అల్లల్లాడిపోయారు. ధనధన పద్దెనిమిదిమంది గూర్ఖాలు కూలారు. తొమ్మిదిమంది తీవ్రంగా గాయపడ్డారు. పెద్ద-పెద్ద ఆయుధాలున్నాయని ప్రదర్శనాలు చేసిన మిల్టరీ వాళ్ళు ఇటువేపు నెలదాకా ముఖం చూపలేదు.

మా పూళ్ళో క్యాంపు పెట్టారు. ఒకరోజు వెళ్ళి వాళ్ళను అదుపులోపెట్టి వచ్చాను. తిరుమలగండి, పోల్లారం నందు మిల్టరీ వ్యానులను పట్టపగలు నిలబెట్టి కొట్టాం.

ఆయుధాలకోసం మసిగూడెం, తిర్లగండినందు రోడ్డు మీద వ్యానులపై దాడిచేశాం. నలభైమంది మిల్టరీవాళ్ళు చచ్చారు. కాని ఆయుధాలు తీసుకోడానికి వీలు లేకపోయింది.

పగలు, అదనపు సహాయం వాళ్ళకు వచ్చింది. నిర్బంధంగా కోయగూడేలను క్యాంపుల దగ్గరకు తీసుకపోను వచ్చిన మిల్టరీని ఎన్నోసార్లు తిప్పికొట్టాను.

ఇంకా కొన్నాళ్ళు నాకు జీవించడానికి వీలుంటే ఈ దాళ్ళ వృత్తాన్ని నీరుకార్చే వాణ్ని. స్వాతంత్ర్య సమర విజయోత్సవాన్ని చూడాలని ఎంతో ఆశపడ్డా! వీలులేక పోయింది. నేను సంగంలో వదిలిన పోరాటం నా సహోదరులంతా దిగ్విజయంగా సమాప్తం చేయాలి! నేను అమోఘంగా కీర్తించే, గౌరవించే, ఆరాధించే కమ్యూనిస్టుపార్టీని అందరూ అనుసరించాలి! ఇదే నా ఆఖరి కోరిక! నాకు నమ్మకం వుంది — కొద్ది నెలల్లో ప్రజాతంత్ర ప్రభుత్వం వస్తుందని!

నేను ఈ జండాగుట్టకింద కామ్రేడ్సుందరంతో పాటు పార్టీ సంబంధాలు పోయివున్నా, పక్కనున్న ఆయుధం అందుకొని మిల్టరీమీద లంఘించబోతున్న నన్ను ఆరు బ్రెన్‌గుళ్ళు తక్షణం పొట్టపెట్టుకున్నాయి. ఇక్కడే కాసిని కట్టెలువేసి ఎచ్చపచ్చిగా తగలేసిపోయారు.

## బుగ్గ కొమ్మయ్య

మాది జంగాలపల్లి, పాఖాల తాలూకా. తండ్రి పేరు నమ్మయ్య. తల్లి రామక్క. మాది కోయకుటుంబం. నాకో చిన్న కూతురుంది. మాకు బొత్తిగా పొలం పుట్ర లేదు. ఇంట్లోవున్న అందరం కెక్కలిరుచుకొని, అడివి తల్లిని నమ్ముకొని బ్రతికే వాళ్ళం.

ఏదో రెండు రూపాయల బాకీకింద గుర్ర్రపాడు దేశముఖు నన్ను జీతానికి పెట్టుకున్నాడు. అదెప్పుడో మా నాయన గండకత్తెరలో వున్నప్పుడు తెచ్చిన బాకీ. ఎన్నాళ్లు చాకిరి చేసినా అది తీరదు. అన్నంకూడ పెట్టడు. జీతం అడిగితే, అక్కరకు కావాలి కాస్త ధాన్యం అన్నా ఇప్పించమంటే, ధాన్యపుకొట్లో వేసి పెత్తగాతన్ని తాళం వేసేవాడు. ఈయన చెరనుండి ఎట్లా తప్పుకోవాలని ఎప్పుడూ ఆలోచించే వాణ్ని. ఇంట్లోకెళ్తే అంతా కడుపులు పీక్కుంటూ చావటానికి తయారయినట్లు కనపడేవాళ్ళు. నా భార్య నన్ను చూడగానే సుఖపెట్టడంలేదని ముఖం నల్లగా ఇంతది చేసుకునేది. పసిపిల్లకు కాస్త గోధిగుడ్డ కొందామన్నా వీలుండేదికాదు. ఈ నరకం నుంచి బయటపడాలని పొద్దస్తమానము ఆలోచించే వాణ్ని.

సంగం సంగతి నాలాంటి సాటి దరిద్రులు, దౌర్భాగ్యులు గొప్పగా చెప్పుకుంటుంటే విన్నాను. ఏదో సంగం నా జీవితాన్ని సముద్ధరిస్తుందని నిత్యం కలలు కనేవాణ్ణి. సంగంతో సంబంధానికి ఎన్నో ప్రయత్నాలు చేశాం. ఫలితం లేక ఒక నడిరాత్రి గొడ్ల దొడ్లోంచి లేచిపోయాను. చాల కష్టపడి సంగం సంబంధం సంపాదించాను. కొన్నాళ్ళు పోయాక పార్టీలోకి తీసుకున్నారు. దళసభ్యుడుగా, స్టాటుగా పనిచేశాను.

సందయ్య దళంలో పనిచేశాను. ఇంకో రెండు దళాలలోకూడ కొన్నాళ్ళున్నాను. సందయ్య చేసిన దాళ్ళన్నిటిలో వున్నాను.

దళాలకు కొత్త కేంద్రాలు, దారులు చూపేవాణ్ని. సాక్టుగా వుండి, ముందెళ్ళి దళానికి మార్గం క్లియర్ (క్షేమకరం) చేసేవాణ్ని. కొరియరుగా వున్నప్పుడు క్యాంపుల వార్తలు, శత్రుసంచలనం, బలాబలాలు, ద్రోహుల ఎత్తుగడలు, జమీందార్ల కుట్రలు తెలిసికొని వస్తుండేవాణ్ని.

నేను తలమునక కార్యభారంలో, పోరాట కార్యక్రమంలో వున్నప్పుడు నా భార్యను మిల్టరీ తీసికెళ్ళింది. ఘోరాతి ఘోరంగా హింసించారు, చెరిచారు. నరసంపేట క్యాంపులో కొన్నాళ్ళుంచుకొని, అక్కణ్ణుంచి హనుమకొండ అలా క్యాంపులన్నీ ఆమెను మార్చారు. తల్లిదండ్రుల్ని హింసించి చెట్టుకొకర్ని చేశారు.

నేను ఎన్ని అడ్డంకులు, అవస్థలు అడ్డుపడినా పార్టీ కార్యక్రమం నిర్విఘ్నంగా నెరవేర్చాను. నెలల తరబడి అన్నం, నీళ్ళు లేకుండా పనిచేశాను. స్వాతంత్ర్య సమరాన్ని నా శక్తికొలది పటిష్టం చేశాను. విప్లవానికి నేను చేయగలిగినంత త్యాగం చేశాను. నా సోదర ప్రజలుకూడ అనన్య త్యాగాలు, అర్పణలు చేసి విప్లవాన్ని జయప్రదం చేయగోరుతాను.

ఇక్కడ ఇరవయ్యిద్దరు కామ్రేడ్స్‌మీద దాడిచేసి నప్పుడు మిల్టరీ నన్ను కాల్చింది. తొడకు రైఫిల్ గుండు తగిలి దూసుకపోయింది. ఒక గూర్ఖా బాయినెట్టుతో నా వెన్నులో కుమ్మాడు. సజీవంగా వున్న నన్ను కాట్లో వేశారు. తన్నుకుంటూ ఇవతల పడ్డా! కట్టెలతో లోపలికి నెట్టి తగల పెట్టారు! నిరంకుశత్వాన్ని-మానవత్వాన్ని ప్రేమించే సమస్త

జనులు అలానే కాల్లో వేసి నిర్దాక్షిణ్యంగా తగలెట్టి నా ఆత్మకు శాంతిదత్తం చేయండి! నా ఆదర్శాన్ని ధగధగ వెలిగించండి!

## నర్సయ్య

మాది కొంకపాక. వరంగల్ తాలూకా. నేను చాకల్ని. కటిక పేదను. నాకు ఇరవై నాలుగేళ్ళుంటాయి. బట్టలుతికే వాణ్ని. కూలిపనికి పోయేవాణ్ని. జీతాల కుండేవాణ్ని.

నా జీవితం ఎప్పుడు గొర్రెతోకలాగ ఎదుగుబొదుగు లేకుండా వుండేది. నాకు చాల అసంతృప్తి, అశాంతి నిచ్చేది. ఈ జీవిత గోడలు పగలగొట్టుకొని బయటపడాలని తీవ్రంగా కాంక్షిస్తుండేవాణ్ని. ఎక్కడికి పోవడం? ఏమిటి చేసేది? ఎక్కడికెళ్ళినా ఈ రెక్కలు ముక్కలుగా విరగతీయంది తప్పుతుందా? అనే ఆలోచనలు వెనక్కి లాగాయి.

రజాకార్లతో, నైజాం ప్రభుత్వంతో పోరాడుతున్న పార్టీని గురించి పాకిన కథలు విన్నాను. కష్టజీవుల పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీలో నాకు స్థానం తప్పకుండా లభిస్తుందనుకున్నా. నేను దేశంకోసం పోరాడి జీవితంలో ఒక్క మంచిపని అయినా చేసినవాణ్ణి అవుదామనుకున్నా. దళాలలో చేరాను రజాకార్లను తిప్పించి — తిప్పించి, తరిమి ముప్పతిప్పలుపెట్టి ఆరుచెర్ల నీళ్ళు తాగించాను. పార్టీలోకొచ్చింతర్వాత చదువు నేర్చుకున్నా. అనేక పుస్తకాలు చదివా. ఒక కొత్త జీవితాన్ని చవిచూశాను. కొత్తకాంతి, రక్తం నన్ను ఆవేశించి నిలువెల్లా వెలిగించాయి.

ముప్పారం దళంలో పనిచేశాను. అనేక దాళ్ళల్లో

పాల్గొన్నాను యూనియన్ సైన్యాలు వచ్చిన తర్వాత కొన్నాళ్ళు దళంలో వుండి, తర్వాత కొరియరుగా పనిచేశాను. గొల్ల వేషంతో, రైతు వేషంతో, ఎద్దుల బేరగాడిలాగా, గాజుల బేరగాడిలాగా, చిత్రవిచిత్ర వేషాలతో పోయి దళాలకు తిండి, సప్లయిలు అందజేసి, వార్తలు, శత్రువు ఆచూకీ ఆరా తెలియజేస్తుండేవాణ్ణి.

నా సహసం, అమితంగా కష్టపడటం, మొండిపట్టుదల, ధైర్యం—కామ్రేడ్స్ ఎప్పుడూ గొప్పగా పొగిడేవాళ్ళు. ఏరియా కమిటీ, జోనుకమిటీలమధ్య కొరియరుగా కొన్నాళ్ళు పనిచేశాను ఏరియా కమిటీ, జోనుకమిటీల పుట్లధాన్యం, బండ్ల సామాను, ఆయుధాలు నా నక్కడి చేతిమీదుగా ఆ గట్లల్లో, గుట్టల్లో నానా అవస్థపడి దంపుచేశాను. అన్నీ అతి సురక్షితంగా వున్నాయి.

కాంటాక్టుపోయి ఈ జండాగుట్ట దగ్గరికి వచ్చి కామ్రేడ్స్‌ను కలిసికున్నా. దాడిచేసినప్పుడు మిల్టరీ నన్ను కాల్చింది. పిక్కలో గుండుదూ చారెడు వెడల్పు గాయం చేసింది. వెన్నుమీద, తొడమీద నాలుగు గుళ్ళు తగిలాయి. పడిపోయాను ఎన్నిగుళ్ళు తగిలినా నేను చావదలచలేదు. నేను అక్కడ చనిపోతే పార్టీకి బోలెడు నష్టం వస్తుంది. ఎలాగైనా ఆ మృత్యుగహ్వరాన్నుంచి బయటపడదలిచాను. పడుతూ, లేస్తూ, పాకుతూ పారిపోతున్నా, నెత్తురు ధారాపాతంగా కారుతూ నా వెంట కాల్వలాగా వెంబడించింది. మిల్టరీ వెంటాడుతూనే వుంది. వాళ్ళను తప్పుకొని దట్టంగావున్న పొదలో, గడ్డి గుబురులో దూరి నక్కాను. వంటిమీదిగుడ్డ

చించి గాయాలకు రక్తం కారకుండా అడ్డం కట్టాను. మిల్టరీ రక్తపు డాగులు అనుసరించి నన్ను వెదికింది. నన్ను చూడలేదు. వదిలి పోయింది. మిల్టరీ నల్గురు కామ్రేడ్స్‌ను కాస్త తగలపెట్టి, దొరికిన నాకెంకు ఆయుధాలు చూసి పొంగిపోతూ వెళ్ళిపోయింది.

నాకు విపరీతమయిన దప్పిక, మూల్గుడు పట్టుకుంది. బ్రతుకుతాననే ఆశ అంతరించింది. నేను చచ్చిపోతే పార్టీకి అమితనష్టం సంభవిస్తుంది. అందువలన మృత్యువుతో నత పోరి జయించ దలిచాను. కాస్త దూరంలో వున్న మురుగు కాల్వ దగ్గరికి పాకిపోయి నాలుగు దోసిళ్ళు బురదనీళ్ళు తాగి అక్కడే పడ్డాను. మరునాడు కామ్రేడ్స ఇటువేపు వస్తారనే ఆశవుంది. బాధతో మెలికలు తిరుగుతూ మర్నాడు మధ్యాహ్నందాకా అటూ ఇటూ పారచూస్తూనే వున్నా. కామ్రేడ్స వచ్చారు. పిలిచాను. దగ్గరకు వచ్చి కట్లు కట్టారు. కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. ఎత్తుకొని డోలిలో కొంతదూరం తీసుకిపోయారు. నా ప్రాణాలు కనుకొలకులలో కొట్టుకుంటు న్నాయి. దించమని చెప్పాను. దించిం తర్వాత డబ్బుఎక్కడ డంపు చేసిందీ, ఆయుధాలు, ధాన్యం ఎక్కడ దాచిందీ, ఏయే వస్తువులు ఎక్కడ పెట్టింది వివరంగా చెప్పి ప్రాణం వదిలాను. ఇవి చెప్పకపోతే పార్టీకి తీరని కష్టనష్టాలు నావల్ల వచ్చేవి. నాకు తప్ప రెండోకంటికి అవి ఎక్కడుందీ తెలీదు. కామ్రేడ్స నల్గురూ కన్నీరుతో నా గాయాలు, నన్ను కడిగి. సైనిక మర్యాదలతో నా కిక్కడే దహనసంస్కారం చేశారు. నా జీవిత ధర్మాన్ని పూర్తిగా నెరవేర్చాను! అదే నా సంతృప్తి ! !

## పనికర లక్ష్మయ్య

మాది మానుకోట తాలూకా కేసముద్రం. తండ్రి లేడు. తల్లి వుంది. నేను గొల్లను. పెళ్ళి కాలేదు. మా కున్న దల్లా ఎకరం పొలం. అది చేస్తూ కూలిపని చేసేవాణ్ని.

నైజాంకు వ్యతిరేకంగా జరిగే పోరాటం నన్నాకర్షించింది. పార్టీతో సంబంధం పెట్టుకొని, పార్టీ పనికొన్నాళ్ళు చేసి దళాలలో చేరాను. నైజాంకాలంనుండి దళ సభ్యుడిగా కొరియరుగా పనిచేశాను.

దళాలలో నేను చేయని పని అంటూ లేదు. ఏది అవసరమయితే అది అటూ ఇటూ చూడకుండా పార్టీ కోసం చేశాను. వంట దగ్గరనుంచి ఆయుధం పట్టి శత్రువు మీదకి దాడికి వెళ్ళేదాకా వున్న పనులన్నీ చేశాను చక్కగా పాటలు పాడి దళాలకు వినోదం కల్పిస్తుండేవాణ్ని. మాకు ఏ నాటకం, చిత్రం, భగోతం చూసే వీలు లేదు. మాలో మేము పాడుకునే వాళ్ళం. ఆడుకునేవాళ్ళం. బుర్రకథలు, వుయ్యాలపాటలు మొదలయినవి అప్పుడప్పుడు ప్రదర్శనలు చేసే వాళ్ళం.

ఈ జండా గుట్టకింద కామ్రేడ్స్‌మీద దాడి చేసినప్పుడు నేనూ వున్నాను. బ్రెన్ గుళ్ళు తల, తుంటిమీద తగిలి పచ్చడిగా చితకగొట్టాయి. కదలలేకపోయాను ప్రాణాలతో వున్న నన్ను కాట్లో పడేసి తగలెట్టారు నిప్పు కాకకు ఆగలేక అవతల పడుతుంటే బడితెలతో లోపలికి నెట్టారు. ఒక్క నర్సయ్య తప్ప తతిమ్మా మా నలుగురి శవాలుసగం

కాలి, కమిలి అలానే పడివుండి కుళ్ళిపోయాయి. తర్వాత ప్రజలు తెలుసుకొని వచ్చి పురుగులు పడి దుర్గంధం కొడుతున్న మనుష్యుల దహనం చేశారు కన్నీళ్ళు కుక్కుకుంటూ. నే నెత్తిన జండాను, నమ్మిన ఆదర్శాన్ని ఆత్మార్పణతో గౌరవించాను. అదే తెలంగాణంతా చేయాలి!

భారత చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించే విప్లవ చరిత్రను సృష్టిస్తున్న తెలుగుజాతి— విప్లవాన్ని జయప్రదం చేయాలి!

* * *

ఆ మహావీరుల చరిత్రలు పూర్తిగా వినేటప్పటికి— నాకు తెలీకుండా కళ్ళు కరిగి వరద కడుతున్నాయి. గుండె కొండంత బరువెక్కింది. ముఖంలో కళాకాంతి లేకుండా వేయిపుట్ల దిగులు ఆవరించి కుంగదీసింది. నీరసం పెరిగి వచ్చింది.

ఒకసారి ఆ గుట్టకు - కాదు పంచపాండవుల గట్టుకు బరువయిన హృదయంతో సాష్టాంగ నమస్కారం చేశాను. ఆ అయిదుగురు కామ్రేడ్స్ దహనమయిన ప్రదేశాల మీద తలదించి, కళ్ళ కద్దుకొని, విప్లవాభివందనం చేసి, సెలవు తీసుకున్నా !!

---

# ఒక మహాపురుషుడు

ఇవాళ నెమలిగ్రామం కళ్ళ పండుగగా వుంది. మహోత్సవాలకు వచ్చినట్టు చుట్టూ వూళ్ళ ప్రజలు ఎడతెరిపి లేకుండా నెమలి వస్తున్నారు. సాయంత్రం అయ్యేకొలదీ జనం ఇనకేస్తే రాలకుండా వూరిబయట మైదానంలో చేరుతున్నారు. కోలాహలం మిన్నుముడుతూంది. పిల్లలు, పెద్దలు స్త్రీలు. కొత్తబట్టలు కట్టుకొని, తల దువ్వి, పూలుతురిమి పెళ్ళికి ముస్తాబయినట్టు తయారయి సంతత ధారగా మైదానం చేరుతున్నారు.

ఎక్కడ చూచినా ఈలలు, కేకలు, కేరింతలు, నవ్వులు గగ్గోలు పెడుతున్నాయి. ఎటు చూసినా జనం క్రిక్కిరిసి కదల మెదల వీలు లేకుండా గందరగోళపరుస్తున్నారు. యువతీ యువకులు సంబరాలుపడటం చెప్పనలవికాకుండా వుంది. వూరంతా కల్యాణ మండపంలా వుంది. ప్రజలంతా హాస రేఖలలా వున్నారు.

ఈ హడావిడికంతా కారణం ఏమిటా అని ఆలోచిస్తే ఏమీలేదు. నెమలిలోవున్న స్టేట్ కాంగ్రెసు ఆఫీసు, కమ్యూనిస్టు ఆఫీసులు పోటీచేస్తున్నాయి- ఇదికూడా సరికాదు-స్టేటు కాంగ్రెసు ఆఫీసులోవున్న అన్నయ్య, కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులోవున్న తమ్ముడు-అంటే ఇద్దరు అన్నదమ్ములు పందేలు

వేసుకొని శక్తిసామర్థ్యాలు ప్రదర్శిస్తున్నారు. ఈ వార్త ఊరూరు పాకింది. వుదధిలాగా కదిలొచ్చింది.

పెద్దలంతా చేరారు. న్యాయనిర్ణేతలు ముందుకూర్చు న్నారు. కా. గ్రెసు, కమ్యూనిస్టు, మధ్యవర్తి న్యాయ మూర్తులు వచ్చారు. పోటీదారులు—అన్నదమ్ములు— బందరు రామిరెడ్డి, మాధవరెడ్డి వచ్చారు. ఇద్దరూ కాకీ నిక్కర్లు ధరించి, నిండుబూట్లు వేసుకొని, సైనికుడికోట్లు తొడిగి. ఆయుధాలు తీసుకొని సిద్ధంగా వున్నారు. ప్రజలు చుట్టూ వత్తుగా కూర్చుని, నిలబడి కోలాహలం చేస్తున్నారు.

"రడి" పెద్దగా న్యాయమూర్తి నొక్కి కేక పెట్టాడు.

రామిరెడ్డి, మాధవరెడ్డి పొజిషన్సులో కూర్చుని, రొమ్ము పక్క భాగాన రైఫిలు మడమ ఆనించి, ఎడమ చేతితో ముందుభాగం పట్టుకొని, కుడిచేయి ట్రిగ్గర్ మీద వుంచి కాలుకాసి గురిపెట్టి వున్నారు నిశ్చల నిశ్శబ్దం నిండా వ్యాపించింది.

"వన్" మళ్ళీ న్యాయమూర్తి పిలుపు.

అంతా వళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తున్నారు. రామిరెడ్డి, మాధవరెడ్డి ఒక కన్ను రైఫిలు 'ఫ్యూఫయిండర్' లో పెట్టి తదేక దీక్షతో చూస్తున్నారు.

"టు"— న్యాయమూర్తి.

"..................."

"త్రీ...ఫైర్" అన్నాడు న్యాయమూర్తి పెద్దగా ఖణీల్మని.

"ఢాం ...ఢాం...ఢాం..."

"ఢాం ...ఢాం... ఢాం..."

రామిరెడ్డి, మాధవరెడ్డి ధన ధన కాల్చారు. పక్షులు కెవ్వుమంటూ గుంపులుగా లేచి పోయాయి. కాల్పులు వెంటనే ఇద్దరు మనుషులు చెరువులోకి వురికారు. వారి వెంట వేలమంది వచ్చారు.

"హ్హా హ్హా హ్హా...రామిరెడ్డి ఓడిపోయాడు. కాంగ్రెసు చిత్తు అయింది. మాధవరెడ్డి గెలిచాడు!" అంటూ చెరువులోకి పరుగెత్తిన ప్రజలు గుక్కతిప్పుకోకుండా కేకలు పెడుతూ మాధవరెడ్డి కొట్టిన చుక్కకోడిన్నీ—నీటికోడిన్నీ—ఎగరేస్తూ తెస్తున్నారు.

న్యాయమూర్తులు మాధవరెడ్డి గెలిచాడని ప్రకటించారు. ప్రజలంతా జయధ్వానం చేశారు. కాని రామిరెడ్డి ఒప్పుకోలేదు. కాంగ్రెసువాళ్ళు సమ్మతించలేదు. ఈ తీర్పు అన్యాయమని గోలపెడుతున్నారు, పెద్దగా అల్లరిచేస్తున్నారు.

"సరే. ఇదలా పోనీయండి మళ్ళా పోటీకి రమ్మనండి అప్పుడయినా తేలుతుంది న్యాయం" అని గర్జించాడు మాధవరెడ్డి వుద్రేకంతో కంపిస్తూ.

"రా, చూద్దాం" అంటున్నాడు వుక్రోషంతో వణుకుతూ రామిరెడ్డి. కాంగ్రెసు వలంటీర్లు వురెక్కిస్తుంటే.

న్యాయమూర్తులు మళ్ళీ ఎవరి స్థానాలు వాళ్ళు అలంకరించారు. ప్రజలు భూమ్యాకాశాలు ప్రతిధ్వనించేట్టు జయసంగీతం పాడుతున్నారు. అంతా సాయంసమయ చల్లని కౌగిల్లో వుండగా, వినోదం ఆనందిస్తున్నారు.

"వన్" మళ్ళీ న్యాయమూర్తి.

"........."

"టు"

"త్రీ...ఫైర్"—న్యాయమూర్తి ఆజ్ఞ.

"ఠాం...ఠాం...ఠాం..." రామిరెడ్డి రైఫిలు.

"ఠాం...ఠాం...ఠాం..." మాధవరెడ్డి రైఫిలు.

ఇద్దరన్నదమ్ములు అతి జాగ్రతతో మళ్ళా గురిచూసి చెట్టుమీద పక్షుల్ని ఏకంగా కాల్చారు.

"హే హే హ్హే...హాో...ఓహోహో! రామిరెడ్డి ఓడి పోయ్యాడో! కాంగ్రెసు చిత్తుచిత్తు అయిందో" అని ప్రజలు హేళనచేస్తూ, ఈలలు వేస్తూ, విరగబడి నవ్వుతూ, ఒకరి మీద ఒకరు పడి తోసుకుంటూ మాధవరెడ్డిని ఎత్తుకొని, ఎగరేస్తూ ప్రదర్శనం చేస్తున్నారు.

న్యాయమూర్తులు, ప్రజలు ఏకకంఠంతో ఎలుగెత్తి ఓడిపోయావని రామిరెడ్డికి చెపితే అతను ఒప్పుకోలేదు. కాంగ్రెసు వలంటీర్లంతా వాడిపోయిన ముఖాలతోనే వోడి పోలేదని బుకాయిస్తున్నారు.

మాధవరెడ్డి మళ్ళీ ఛాలెంజి చేశాడు. రామిరెడ్డి ఛాలెంజి ఒప్పుకున్నాడు. కాని క్షణంలో ఓటమి—మూడో సారికూడా వరించాడు. తలవాల్చి, చిన్నబోయి కాంగ్రెసు ఆఫీసుకు, కాంగ్రెసు వలంటీర్లతో వుడుకుతూ, వదురుతూ తక్షణం పోయాడు.

"వా డెక్కడ గెలుస్తాడురా—వాణ్ని అసలే బందరు రాముడంటారు—వూరికే అనుకున్నారా" అని ఒక రైతు

రామిరెడ్డిని వూళ్ళో వాళ్ళంతా 'బందరు రాముడని' ఎగతాళి చేయడం బయటపెట్టి ఎత్తిపొడుస్తున్నాడు.

“పో...పో...పారిపోతున్నావులే పో ... గాజులు రెండు చేతుల్నిండా తొడిగించుకో” మరో రైతు గుంపు మధ్యనుండి పెద్దగా కాంగ్రెసు వలంటీర్లతో ఆఫీసుకుపోతున్న రామిరెడ్డిని మాటల ఈటెలతో కుమ్ముతున్నాడు.

సంధ్య చీకటిలో దూకి మునిగి కరిగిపోతూంది.

ప్రజలు, పార్టీ కామ్రేడ్స్ మాధవరెడ్డిని భుజాల మీద ఎక్కించుకొని, జయగీతాలు పాడుతూ, వూరంతా బ్రహ్మాండంగా వూరేగించారు.

నైజాం ప్రభుత్వానికి, రజాకార్లకు వ్యతిరేకంగా పోరాటం సాగించను కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీలు ఇక్కడ ఆఫీసులు పెట్టాయి. కాంగ్రెసు అన్న రామిరెడ్డిని వ్యతిరేకించి కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులో మాధవరెడ్డి పని చేస్తున్నాడు. ఇంట్లో తల్లిదండ్రులు, నలుగురు అన్నలు ఎన్ని ఇబ్బందులు పెట్టినా, ఏ విధంగా అడ్డుపడినా వినకుండా మాధవరెడ్డి పార్టీ కొరియరుగా, వలంటీరుగా పనిచేస్తున్నాడు. కాంగ్రెసు నాయకుడయిన అన్నకు దొరకకుండా ఇంట్లో వున్న మూడు తుపాకులు తెచ్చి పార్టీకిచ్చాడు. అన్న దీంతో రెచ్చిపోయి తమ్ముణ్ని జయించాలనే పందంతో రొమ్ము విరుచుకొనివచ్చి నానా అభాసుపాలయ్యాడు. అపజయానికి దాసోహమన్నాడు.

  

కొరియరుగా అసమాన సామర్థ్యం, నేర్పు, చొరవ, ఉపజ్ఞ చూపిన మాధవరెడ్డిని జిల్లా దళంలోకి తీసుకున్నారు. దళ సభ్యుడుగా తన ధర్మాన్ని గొప్పగా నిర్వహిస్తున్నాడు.

శీతంపేట దగ్గర ఇంకా తొలికోడి కూయలేదు. రోడ్డు బాగుచేయను నిజాం మిల్టరీ వ్యానులు అట్టహాసంగా వస్తున్నాయి. చిమ్మచీకటి వళ్ళు అక్కడక్కడా చిట్లి, తెల్లపడుతోంది.

"ఠన్ ఠన్ ఠన్ ఠన్............" ఒక్కసారి జిల్లాదళం అకస్మాత్తుగా మిల్టరీ వ్యానులమీద కాల్చింది.

"ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ ఫెళ......" మిల్టరీవ్యాను ఒకటి దూరంగాపోయి దళంమీద కాలుస్తోంది. ఒకటి అక్కడేవుండి దళంమీద బ్రెన్‌లు ప్రేలుస్తోంది. వాళ్ళకి తెలుసు-తమదగ్గర మంచి ఆయుధాలున్నాయనీ, దళందగ్గర బర్మారులు, రెండుమూడు నాట్‌గన్లు తప్ప మరేమీ లేవనీ, దళం వున్న తెట్టె పెద్ద రక్షణ ప్రదేశం కాదనీ, అంచేత వాళ్ళు తెగపడి దళంమీదికి దూకుతున్నారు; కుప్పలు తెప్పలుగా గుళ్ళు కుప్పిస్తున్నారు.

"కామ్రేడ్స్ వెళ్ళిపోవద్దు! పోరాడండి! శత్రువును తిప్పికొట్టగలం..." అని కమాండరు మిల్టరీ దెబ్బకు తట్టుకోలేక వెనక్కి తగ్గుతున్న కామ్రేడ్స్‌ను వుద్బోధిస్తున్నాడు. కాని పదిమంది కామ్రేడ్స్ చేతుల్లోవున్న బర్మారులు పేలక, శత్రువు బ్రెన్ గుళ్ళు గుండెధైర్యాన్ని పీల్చగా, నిలబడలేక రంగంనుంచి ముఖం తిప్పించారు.

శత్రువు విజయగర్వంతో వెర్రిగా కాలుస్తున్నాడు.

రాళ్ళ తెట్టె పక్కనున్న నల్గురు కామ్రేడ్స్‌మీదికి దూకుతున్నాడు. దళకామ్రేడ్స్ కాల్చే దెబ్బలు వ్యాను వుక్కుకవచం మూలంగా వాడికి తగలడంలేదు...అబ్బా అప్పుడే మిల్టరీగుళ్ళు ఒక కామ్రేడ్‌ను క్షతగాత్రుణ్ని చేశాయి.

“కామ్రేడ్ మాధవరెడ్డి! నీవు సాహసిస్తేనే మనం దక్కుతాం! మనపార్టీ ప్రతిష్ట భంగపడకుండా వుంటుంది! మన ఎర్రజండా చిన్నబుచ్చుకోకుండా తలెత్తుతుంది” అని కమాండరు పక్కనపడుకొని కామ్రేడ్స్ ఆయుధాలకు తూటాలు అందిస్తున్న మాధవరెడ్డిని అర్థించాడు. చావు బ్రతుకులమధ్య కామ్రేడ్స్ నలుగురూ నలిగిపోతున్నారు. ప్రమాదం పెదిమలు చప్పరిస్తూంది. కామ్రేడ్స్ ముందు నిలబడి.

“ఢమ్ ఢమ్ ఢమ్... ఫెళ ఫెళ ఫెళ ఫెళ్... అయ్యో... అమ్మో... ఆఁ... వూ... హో... అబ్బా...” ఒక్కసారే హఠాత్తుగా కొండలు పగిలే పెద్దధ్వని. దాని వెంటనే అనంత ఆర్తనాదాలు-ఘోరాతిఘోరంగా ఏడ్పులు, పెడబొబ్బలు. దీనికంతా కారణం మాధవరెడ్డి క్రోధంతో విజృంభించడం. కమాండరు పిలుపుతో రామిరెడ్డి మహోగ్రుడై పైకొచ్చే వ్యానుమీద, కుంభవర్షం కురుస్తున్న బ్రెన్ గుళ్ళమధ్యగా తన హస్తాన్ని ఎత్తి పిన్నులాగి గ్రెనేడ్ వ్యానులోకి విసిరాడు. ఒక్క దెబ్బతో వ్యాను అంతా నుగ్గునుగ్గుఅయింది. లోపలి మిల్టరీ చితికి పచ్చడిఅయి నెత్తురు ధారలుకట్టి వ్యాను నుంచి నేలమీదికి జారుతున్నారు. అంతా విలవిలలాడుతూ విలపిస్తున్నారు.

అతి సాహసం, శౌర్యం ప్రదర్శించి కామ్రేడ్ మాధవ రెడ్డి నల్గురు యోధానయోధులు, ప్రముఖులు, ముఖ్యులయిన కామ్రేడ్స్‌ను అపాయ ఆవరణనుంచి బయటపడేశాడు, దళం దాడి దిగ్విజయం చేశాడు.

## II

మాధవరెడ్డిని దళ కమాండరుగా తీసుకొని చాలకాలమయింది. అప్పుడే మాధవరెడ్డి దళం నిజాం నవాబు జీవనాడులు తెగేసే ముఖ్య దళాలలో ఒకటయింది.

మాధవరెడ్డి అనేక దాడుల్లో పాల్గొని రజాకార్ల దౌష్ట్యాన్ని అరికట్టాడు. నిజాం మిలిటరీ దుర్మార్గం పరిహరించాడు. దాడుల్లో, ముట్టడుల్లో ఎంతో అనుభూతి, నేర్పు, శిక్షణ సేకరించాడు. గన్నవరం రజాకార్ల మీద దాడిచేస్తే వాళ్ళు ఏడుగురు చచ్చారు. ఆయనకుగూడ తుపాకిగుండు రాసుకొని పోయింది. మరొకచోట వీపుమీద దెబ్బతగిలింది. దెబ్బలు, బాధలు, ఇబ్బందులు కొల్లగా నిత్యం పైనపడి, పేరుకొని ఆయన శరీరాన్ని వజ్రకాయం చేశాయి; ఆయన్ను వజ్రసంకల్పుడిగా మార్చాయి; ఆయన జీవితాన్ని, ఆదర్శాన్ని మహత్తరంగా, మహోన్నతంగా శాలిస్తున్నాయి.

నెమలి ఆఫీసునుంచి పన్నెండుమంది దళంతో జైత్రయాత్ర బయలుదేరాడు. ఊరూరూ గొప్పగా గౌరవించింది, ఆశీర్వదించింది, ఆతిథ్యమిచ్చింది. వూరూరులో వున్న పంచాయితీలు పరిష్కరిస్తూ దళం ముందుకుపోతుంది.

ప్రజావ్యతిరేకుల, భూస్వాముల, దురాక్రమణదారుల భూములు పంచిపెడుతూంది. రజాకార్లు, మిలటరీ అనుదినం చేసే దురాగతాలు ఎదుర్కొంటూంది. గ్రామ గ్రామాన వున్న పంచాయితీ ప్రభుత్వ పరిపాలన, భద్రతను చూస్తూ దళం మహాప్రస్థానం సాగిస్తూంది.

బురద రాఘవాపురంనుంచి వందమంది రైతులు దళానికి ఎదురొచ్చి, అడ్డుపడి, వెళ్ళనీయకుండా తమ బాధలు మొర పెడుతున్నారు. ఏమిటి విశేషం అని విచారిస్తే వాళ్ళ ఊళ్ళో ఒక పరమాంతక రజాకారు నాయకుడు వాళ్ళను పీల్చి పిప్పి చేస్తున్నాడని తెలిసింది. ఇల్లెందు తాలూకా అంతా వాడి పేరు వింటే నిద్రనుంచి వులిక్కిపడి లేస్తారు. వాడి రజాకారుగుంపు ఎదురుపడితే గుండెలాగి మరణిస్తారు

వాడి పేరు పత్తికట్ల ఇమామ్ సాహెబ్. ఒకప్పుడు తాగడానికి గంజిలేని వీడు ఇప్పుడు పెద్దడాబా కట్టాడు. ఇంట్లో వేలాది డబ్బు మూలుగుతూంది. ముక్కిపోతోంది. నలుగురు వుంపుడుకత్తెలతో వుంటున్నాడు. వూళ్ళో వాడి చేత మాటపడని స్త్రీ పురుషులు చూద్దామన్నా లేరు. చుట్టూ వూళ్ళన్నీ దోచాడు, తగలబెట్టించాడు. స్త్రీలను చెరిచాడు, హత్యలు చేశాడు. నిత్యం చేస్తున్నాడు. ఇంటినిండా దోపిడి ఆస్తి, వస్తువులు, నగలు, ధాన్యాలు కుప్పలు తెప్పలుగా పడివున్నాయి. కోళ్ళు, పోతులు అడ్డగోలుగా మేసి ఆబోతు ఎద్దులా వున్నాడు. వాడికింద ఎప్పుడూ నలభై మంది రజాకారు హంతకులు ఆయుధాలు ధరించి వుంటున్నారు. రక్షకులు వాణ్ని కళ్ళలో పెట్టి కాపాడుతున్నారు. ఈ హంతకు

అందరూ బుందరాఘవాపురంలో మంచి ఇళ్ళన్నీ ఆక్రమించి పరుల భార్యలతో, ధనధాన్యాలతో భోగిస్తూ, తప్పతాగుతూ విలాసజీవితం గడుపుతున్నారు. నిత్యం హిందూ దేవాలయాలు ధ్వంసం చేయడం, దేవుళ్ళమీద మలమూత్రాలను విసర్జించడం చేస్తున్నారు. వాళ్ళని అదుపులో పెట్టడానికి, హతం చేయడానికి ఎవరిశక్యం అవడం లేదు.

"లేరా ఇమాన్..." గద్దించి స్టెన్ మడిమతో తట్టి అకస్మాత్తుగా పైనపడి గాఢనిద్రలో మునిగివున్న ఇమాన్ సాహెబ్‌ను మాధవరెడ్డి లేపుతున్నాడు. చుట్టూ నల్గురు కామ్రేడ్స్ ఆయుధాలతో సిద్ధంగా పహారా చేస్తున్నారు.

"ఆయా బద్మాష్... కాఫర్ కా భాంచెత్... తేరి యమ్మ... వడా..." అంటూ ఇమాన్ సాహెబ్ దున్నపోతు వంటి దేహాన్ని కదిపి, కంపించి, పక్కలోవున్న రైఫిలు తీసుకొని లేవబోతున్నాడు పక్కలో పడుకొనివున్న తిమ్మారావుపేట ఒక రైతుభార్య—కలీన కమ్మస్త్రీ—వుంపుడుకత్తె లేచి లబోదిబో మంటోంది. పక్క మంచంమీద పడుకొనివున్న మరో యిద్దరు స్త్రీలు లేచి పరుగెత్తారు.

"ఆయారా మాధవరెడ్డిసాబ్ ఆయారా" అంటూ మాధవరెడ్డి స్టెన్‌తో "ఠణ్ ఠణ్" లాడించాడు వాడి గుండెను క్షణంలో. ఇమాన్ సాహెబ్ పందిలాగా పగిలి, చిదిరి, చితికి పట్టిమంచం వెతల్పు కూలి తన్నుకుంటున్నాడు. ఊరంతా ముట్టడించిన కామ్రేడ్స్ వూళ్ళోనూ ఇమాన్ సాహెబ్ ఇట్లోనూవున్న రజాకార్లను పట్టించారు. చేతికి దొరికినవాడు దోసెడు నెత్తురు కక్కి, చారెడు మట్టితిని,

మట్టిలో కలిచాడు. చేతికందినవారు బ్రతికుజీవుడా అని చెట్టుకొక్కరు, గుట్టకొక్కరుగా పారిపోయ్యారు దళం రజాకార్ల దగ్గిర ఇరవై అయిదు ఆయుధాలు స్వాధీనం చేసుకున్నారు. వూరంతా కదిలి రజాకార్లు ఎక్కడుండీ, దోపిడీ ఆస్థి ఎక్కడెక్కడ దాచి దీ గుంపులు గుంపులుగా వీధుల్లోకి వచ్చి చూపిస్తున్నారు. స్త్రీలు కసిలో రజాకార్లను వెంటాడి తరుముతున్నారు. కారం వాళ్ళ కళ్ళల్లో చల్లుతున్నారు. పచ్చడిబండలు పుచ్చుకొని వాళ్ళని చితకకొడుతున్నారు.

ఇమాన్‌సాహెబ్ కూలా దనగానే రాఘవాపురం అంతా ఆనందంతో పరవళ్ళు తొక్కింది. ఒక్కపరుగున వంటికాలిమీద వాడి ఇంటిమీద పడ్డది.

"ఈ చెంబు నాది మాధవరెడ్డి అన్నో... ఈ అరక నాదన్నో... ఈ ఎద్దు నాది... ఈ కోడె నాది... ఈ చీర నాది... ఈ తప్పెల నాది... ఈ పెట్టె నాది... ఈ పాత్రలు నావి... ఈ కాగు నాది... ఈ మంచం నాది... ఈ అందెలు నావి... ఈ వడ్డాణం నాది... ఈ నాను నాది... ఈ గొర్రు గుంటకలు నావి... నా డబ్బు వెయ్యి రూపాయలు తీసుకున్నాడు... నాది మూడు రూపాయలు. నాది మూడువందలు రొఖ్ఖం తీసుకున్నాడు" అంటూ రైతులు, కూలీలు, స్త్రీలు, పిల్లలు - ఇమాన్ సాహెబ్ దోపిడీ ఆస్థి పంచుతున్న, ఎవరిది వారికి అప్పగిస్తున్న మాధవరెడ్డికి చెప్పి, అడిగి తీసుకుంటున్నారు. తెల్లారిందాకా చుట్టూ వూళ్ళ ప్రజలు వచ్చి వాళ్ళ-వాళ్ళ ఆస్తులు, వస్తువులు తీసుకొని పోతూనే వున్నారు. వాడి ఇల్లుకూడ ప్రజలు పంచుకున్నారు.

ఎర్రని ఉషఃకిరణాలలో జలకాలాడుతూ, వేలాదివేల ప్రజల అభినందనలు అందుకుంటూ మాధవరెడ్డిదళం బురద రాఘవాపురంనుంచి సెలవు తీసుకుంది!

## III

మాధవరెడ్డి కీర్తి కెరటాలు తేలి ప్రవహిస్తోంది. నిర్మలంగా, నిశ్చలంగా— పున్నమివెన్నెల జాలులాగా, ఆయన దళం నిజాం మిలట్రీతలల్లో బల్లెలాగా మెరుస్తోంది. దేశముఖుల గుండెలల్లో గాలమయి వేధిస్తోంది.

వేలాది వేల ఎకరాల భూమి రైతు కూలీలకు మాధవరెడ్డి పంచిపెట్టాడు. మధిర, ఇల్లెందు తాలూకాలలో పంచాయితీ ప్రభుత్వం బ్రహ్మాండంగా సాగిపోతూంది. ఈ పోటీ ప్రభుత్వాన్ని ఆయన నడుపుతున్నాడు. నాయకత్వం వహిస్తున్నాడు.

ఈ మధ్యనే దళంతో వెళ్ళి ఇల్లెందుతాలూకా పర్యటించి, ప్రజాప్రభుత్వ పరిపాలన పరిశీలించి మాధవరెడ్డి ముప్ఫైమూడు తుపాకులు సేకరించి తీసుకొచ్చాడు. మొన్ననే నాగులంచ జమీందారు. 350 పుట్ల వడ్లు ప్రజలకు పంచిపెట్టాడు. వైర ప్రాంతంలో రెండువేల ఎకరాలు పంచాడు. కలకోట చెరువుకింది మాగాణి ఏడువందల యకరాలు పంచిపెట్టాడు.

ప్రజా సుపుత్రుడుగా మాధవరెడ్డి వర్ధిల్లుతున్నాడు. దినదినప్రవర్ధమాన మవుతున్నాడు !!

* * *

పగబట్టి దేశముఖులు నిజాంమిలటరీ మాధవరెడ్డిని క్రూరంగా కాటందను అహర్నిశాలు కుట్ర పన్నుతున్నారు.

కలకోట జమీందారు కర్కోటంగా కుతంత్రాలు పన్నుతున్నాడు. వీడు మాధవరెడ్డి దళం వలన చాలానష్టాలకు గురయిన వాళ్ళలో ఒకడు.

చీకటి చిక్కగా లోకంవడినిండా పేరుకుంటూంది.

"దొరో, ఓ దొరో మమ్మల నమ్ముదొరో నీతో పని పడి వత్తున్నం దొరో" అని గుంపెడు కలకోటమాలోళ్ళు పరుగులు వురుకులమీద వూరి బయట కూర్చుని దురాగతాలకు అందెవేసిన చేతులయిన మల్లిగాడు, యలమందగాడు మొదలయిన ఆరుగురు మాలగూడెం నాయకులతో మాట్లాడుతున్న మాధవరెడ్డి దగ్గరకు వస్తున్నారు.

"కామ్రేడ్ మాధవరెడ్డి! వాళ్ళను నమ్మొద్దు. వాళ్లు ద్రోహులు! కుట్రపన్ని నిన్ను చంపవస్తున్నారు. స్టెన్ ఆర్డరులో వుంచుకొని వాళ్ళను ఎదుర్కో!" అంటూ ఫర్లాంగుదూరంలో సెంట్రీ చూస్తున్న ఇద్దరు కామ్రేడ్స్ హెచ్చరిస్తున్నారు.

"అదేంటి కామ్రేడ్స్, అలా సలహా యిస్తారు! నిన్న గాక మొన్న మనం ఈ మాలపల్లికి వేలపుట్ల ధాన్యం పంచి యిచ్చాం. భూమి పంచిపెట్టాం. మనకు ద్రోహం వీరు చేస్తారు! అది ప్రజలు—పేదప్రజలు! అదెప్పటికీ జరగదు." అని మహోన్నత మానవమూర్తి అయిన మాధవరెడ్డి సమాధానం.

"లేదు దొరా. మేం కటికోళ్ళం కాదు. కన్నతల్లి రొమ్ము గుద్దే కసాయోళ్ళం కాదు. సికాళ్ళు మొక్కుతాం, నమ్ము దొరా! సంగతి దొరోరికి మనవిచేయటానికొత్తున్నం. కాల్చబాకు దొరా" అంటూ గుంపు పైకురికొస్తూంది.

“కామ్రేడ్ మాధవరెడ్డి వాళ్ళను నమ్మొద్దు! చాల ప్రమాదం! నీవు కాల్చకపోతే ఆయుధం ఇటు యివ్వు” అంటూ సెంట్రి కామ్రేడ్సు ఇద్దరూ మాధవరెడ్డి దగ్గరకు పరుగెత్తుకొని వస్తున్నారు.

“ఆ...ఓ...ద్రోహుల్లారా! నాకు ద్రోహం చేస్తున్నారా...మిమ్మల కన్న తల్లి దండ్రుల్లాగా చూసిన నన్ను చంపుతారా......మీకోసం ప్రాణాలుత్యాగాలు చేసిపోరాడే పార్టీకి ద్రోహం చేస్తున్నారా...అక్కా...నో...హో...హో...జమీందార్ల తొత్తులయి శ్రామిక జాతికే, ఆదర్శానికే కళంకం, అపఖ్యా...తి...తెస్తున్నారా...ఆ....వో...కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్” అంటూ కలకోటి మాలపల్లి ద్రోహుల గుంపు పైన పడి ఆరెలతో, కత్తులతో, బరిసెలతో కుమ్ముతుంటే మాధవరెడ్డి నేలపడి విలవిల తన్నుకుంటున్నాడు. చేతిలో లోడుచేసివున్న స్టెన్ ఉపయోగించటం లేదు. ఉపయోగిస్తే ప్రజలు చస్తారనే వుద్దేశంతో విద్రోహులకి ఆహుతి అవుతున్నాడు. సెంట్రీ కామ్రేడ్సు దగ్గరకొచ్చేటప్పటికే మాధవరెడ్డి తుదిశ్వాస వదిలాడు! కళ్ళు వెడల్పు విప్లవవీరుడు—గాదె మాధవరెడ్డి-మధిర తాలూకా రత్నకిరీటం కూలి విస్తరించాడు.

సహచరుని అస్తమయంతో శివమెత్తిన ఇద్దరు కామ్రేడ్స్ దగ్గర ఆయుధాలు లేవు. చేతిలోవున్న గ్రెనేడ్ విసిరి— అక్కడే అప్పుడే అయిదుగురు ద్రోహుల ప్రాణాలు త్రాగారు ఈ ద్రోహులు నిత్యం వూళ్ళమీద పడి మాధవ

రెడ్డి దళం పేరుతో నినాదాలిచ్చి దోచుకుంటున్నారు. ఆ విషయం మాట్లాడటానికే కామ్రేడ్స్ వచ్చారు వీళ్ళను బాగా మేపి, లంచాలు తినిపించి జమీందారులు పచ్చిద్రోహులుగా తయారుచేసి వుంచారు. అయినా విప్లవకారులెప్పుడూ వర్గంతో పాటు, వర్గ చైతన్యాన్ని దృష్టిలో వుంచుకోవాలి. అదే గీటురాయిగా తీసుకోవాలి.

ఈ దారుణం జరిగిన వారం రోజులలోనే ఆ ద్రోహులు పదిమంది ఘోరంగా మరణించారు. ఏ ఊరెళ్ళినా మాధవ రెడ్డి అన్నను చంపి వచ్చారా అని పట్టుకొని, పగలు, రాత్రి బజారు, ఇల్లు అనే విచక్షణ లేకుండా ప్రజలు ఆ ద్రోహుల్ని చిత్రవధ చేసి చంపి వాళ్ళ రక్తంతో మాధవరెడ్డి ఆత్మకు అభిషేకం చేశారు ! !

———

# బాలవీరులు

మధిర తాలూకా మకుటం బ్రాహ్మణపల్లి. ఈ గ్రామం తాలూకా ప్రతిఘటనోద్యమం నిర్మించి, నాయకత్వం వహించి నడుపుతోంది. ఇరవై అయిదుమంది వీరుల్ని దళాల లోకి పంపించింది. వీరుల్ని స్వాతంత్ర్య సంగ్రామరంగం సాగనంపేప్పుడు- తాను కదిలి నిలువెల్లా పులకించి, ఆనందాశ్రు నయనాలతో పొలిమేర దాటిందాకా వీరులతో కలిసి వెళ్ళి రెండుచేతులెత్తి నమస్కరించి, దీవించి రావటం - ఆమె సాంప్రదాయం. కాని ఇవాళ ఆమె వీరు లిద్దర్ని చెరోక చేతితో పుచ్చుకొని నడిపిస్తోంది. కారణం రంగానికి- ఆనందాశ్రువులతో మాత్రం కాదు- దుఃఖాశ్రునయనాలతో.

"ఎందుకుతల్లీ అలావున్నావు!" అడిగింది బ్రాహ్మణపల్లిని - చెల్లెలిగా నిత్యం వ్యవహరించే ప్రకృతి.

"............" ఆమె మాట్లాడలేనంత బరువుగా, బాధగా హృదయం కుంగదీసింది.

"చెప్పవేమమ్మా అంత మౌనంగా వాపోవడానికి ఏ కష్టం కాటుదిందీ?" పైట పట్టుకొని వచ్చే ప్రకృతల్లాముందు కొచ్చి బ్రాహ్మణపల్లికి ఎదురు నిలబడి మళ్ళీ ప్రశ్నించింది.

"ఏం లేదమ్మాయి. ఇదో ఈ బుడతలిద్దరూ నైజాం

నవాబు మీద యుద్ధం చేయడానికి బయలుదేరిపోతున్నారు" అన్నది చాల నిదానంగా వేయేళ్ళ వృద్ధురాలిలాగా.

"ఆ! అలాగా!.....అయ్యోరాత! ఈ పసికందుల్ని ఆ రజాకారు చిరుతపులుల నోటి కందించను నీకు చేతులెట్లా వచ్చాయమ్మా" అడిగింది నొసలు విరుస్తూ వయ్యారంగా, విడ్డూరంగా, వింతగా పకృతి.

"కష్టమేనమ్మా, నాది కన్న కడుపే! వీళ్ళని పంపించాలంటే కడుపు తరుక్కుపోతుంది. కాని తప్పదు. మాతృదేశ విముక్తికి యుద్ధంలో వాళ్ళు పాల్గొనాల్సిందే! ఇక్కడ కడుపుతీపి, సొంత ఆలోచన అడ్డు రాకూడదు. అది వాళ్ళంతట వాళ్ళే వెళతామని పట్టుపట్టారు! నేను వద్దనదలచలేను. నాకు ఇష్టంకూడా..." అంటూ కడుపులో గూడు కట్టుకుంటున్న కటికి దుఃఖం బయట పెట్టిందామె.

"ఎంత పిచ్చిదానవమ్మా! ఎంత దేశం, స్వాతంత్ర్యం అయితేమాత్రం పిల్లల్ని చేజేతులా గంగలో దోసేవాళ్ళెవరన్నా వుంటారా...నాదేం పోయిందిలే! నే చెపితేమాత్రం నువ్వు వింటావా?...ఇంతకీ ఆ పసికూనలు ఏం చేస్తుంటే పట్టకొస్తున్నావు?

"ఇదుగో ఈ నారాయణ రెడ్డి వీధిబళ్ళో అయిదవ తరగతిచదువుతున్నాడు. ముందు సంవత్సరం మధిర పెద్దబడికి పంపిద్దామనుకుంటున్నా. వీడు - ఈ పిచ్చిరెడ్డున్నాడే- వీడు నాలుగో తరగతి చదువుతున్నాడు. మొదటినుంచి లాగులు కడుతున్నాడు. ఇప్పుడిప్పుడే పక్కలో వంటేలు

పోయకుండా పడుకుంటున్నాడు..." అంటూ ఆమె వెక్కిళ్లు పెడుతూంది కడుపులో బాధ దిగమింగలేక.

"సరేలేమ్మా నేను వెళ్ళొస్తా...పొద్దుపోయింది. కాస్త తల వాల్చాలి...నీ పిచ్చి నీకే ఆనందం. ఒకరు చెపితే వింటావా పెడతావా..." అని దీర్ఘిస్తూ ప్రకృతి నిష్క్రమించింది.

నెలబాలుడికీ వెన్నెలలో, వెలుగులో బ్రాహ్మణపల్లి చిట్టి తనయుల్ని సంగ్రామానికి సాగనంపుతూంది.

* * *

పిచ్చిరెడ్డి, నారాయణరెడ్డి దళాలలో చేరిన కొద్ది కాలానికే వృద్ధ డ పిండాలయ్యారు. కొరియర్లుగా కొన్నాళ్లు పనిచేశారు. దళ సభ్యులుగా చాలకాలం చేశారు. చూసి రమ్మంటే కాల్చి వస్తున్నారు. ప్రజలు ఈ బాలవీరుల్ని చూసి వుప్పొంగి పోతున్నారు. పార్టీ చెప్పరానంతగా గర్వ పడుతోంది.

మధిర తాలూకాలో కొన్నాళ్ళు దళకమాండర్లుగా పని చేసింతర్వాత, వీరిద్దర్నీ ఇల్లెందు తాలూకా పార్టీ పంపించింది.

ఈ తాలూకాలో ఇద్దరూ చెరోవేపు వుంటూ ఆ ప్రాంతం చూస్తూన్నారు. ఆ ప్రాంతీయ కమాండర్లుగా వుంటున్నారు. ఆ ప్రాంతాలలో భూములు పంచారు. రజాకారు పురుగులు తిరగకుండా చేశారు. మిలిటరీ అడుగు జాడలు పడకుండా, కనపడకుండా చేశారు. పంచాయితీ ప్రభుత్వం మూడు పూవులు, ఆరు కాయలుగా ఎదిగేట్టు వెలిగేట్టు చేశారు.

కొత్తగూడెం, నైర మధ్య రోడ్డుమీద నిజాం మిలిటరీ వ్యానులు, ప్రభుత్వ వుద్యోగులు, బస్సు - నారాయణరెడ్డి దళంవల్ల నడవటంలేదు. రోడ్డుమీద ప్రయాణంచేసే లారీలు, బస్సులు పార్టీకి పన్నుకట్టి తిరుగుతున్నయి. నారాయణరెడ్డి దళం లారీలమీద ఒక వూరినుంచి మరోవూరికీ, ప్రాంతానికి ప్రయాణం చేస్తూంది; సంచారం సాగిస్తూంది.

పిచ్చిరెడ్డి ప్రాంతంలోకూడ నిజాం ప్రభుత్వంలేదు; పన్నులు లేవు; మిలిటరీ జబర్దస్తీ లేదు. అంతా దళం ఆధిపత్యాన, పార్టీ ఆధ్వర్యాన, పంచాయితీ కమిటీల నాయకత్వాన ప్రభుత్వం - ప్రజా ప్రభుత్వం అఖండంగా సాగిపోతోంది.

ఈ రెండుదళాలు నాశనం చేయను పెద్దపెట్టున కదిలి వచ్చిన నిజాం మిలిటరీని, మూడువందల గుర్రాలను - పిచ్చిరెడ్డి, నారాయణరెడ్డి తిప్పికొట్టారు. అజేయ ప్రజానాయకులుగా దేదీప్యమాన ప్రభలు విరజిమ్ముతున్నారు.

* * *

నాల్గురోజులున్నుంచి పార్టీ చర్చల్లో మునిగి తేలుతూ నారాయణరెడ్డి, పిచ్చిరెడ్డి, ఈ లచ్చగూడెం అడివిలో — వూరిపాకలో ఏకాంతంగా వుంటున్నారు. అడవి చాల దట్టమైంది. పచ్చని హిమంతరుతువు ధరించడంవల్ల అద్భుతమయిన అందంగా వుంది.

“హే హే...హైరో...హైరో”

“మిలిటరీ కామ్రేడ్!”

“ఇంకెక్కడికి పోతా రుండండిరా కొడకల్లారా...”

అంటూ మిల్టరీ చీకట్లో-నిద్రలోవున్న నారాయణరెడ్డి, పిచ్చిరెడ్డిలమీద పడ్డారు; పట్టుకున్నారు పాకపక్కన కాసింత చప్పుడవగానే నారాయణరెడ్డి ప్రమాదం పసికట్టి లేచాడు. పిచ్చిరెడ్డిని లేవగొట్టి తప్పుకోను ఇద్దరూ ప్రయత్నిస్తున్నారు. చుట్టూ మాటు కూర్చున్న మిల్టరీ పోనివ్వలేదు. పట్టుకుంది. ఆయుధాలు విప్పదీసి, ఏ భాగానికి ఆ భాగం విడదీసి-ఏం అపాయం లేదనే వ్యూహంతో - నంచిలో దాచిపెట్టారు. అంచేతే నిరాయుధంగా, చేతులు వూడిపోయిన వారికిమల్లే వున్నారా మహావీరులు.

ఇద్దర్నీ మిల్టరీ చిత్రహింసలు పదిహేనురోజులు పెట్టింది. ఒక్క రహస్యం బయటికి లాగలేకపోయింది. హింసాకాండతో శవతుల్యమయిన పిచ్చిరెడ్డి, నారాయణరెడ్డిలను కమ్మం నరక కూపం (నైజాం కాన్‌సెంట్రేషన్ క్యాంప్)లో పడేసింది

యాక్షనుగాలి వీస్తోంది. యూనియను ట్యాంకుల ధ్వని నైజాం మిల్టరీ, రజాకార్ల గుండెలమీద ప్రతిధ్వనిస్తోంది. పిరికి పందలయిన రజాకార్లు, నైజాం మిల్టరీ భయంతో, ద్వేషంతో, కసితో అమాయక ప్రజలను విచ్చలవిడిగా పైనపడి హత్యలు చేసున్నారు జైళ్ళలో, క్యాంపుల్లో వున్న వీరుల్ని తీసికెళ్ళి మందలు మందలుగా కాల్చి కాకులకు గద్దలకు గుట్టలుగా పడేసున్నారు; పారేస్తున్నారు.

“హు! హుండి! గోతులు తీయండి” అంటూ హుంకరించి హుకుం జారీ చేస్తున్నాడు మిల్టరీ జమేదారు పిచ్చిరెడ్డి, నారాయణరెడ్డిలను.

"మాచేత గోతులు తీయించడానికి నిన్ను పుట్టించిన దేవుడు దిగిరావాలి! మేం బొందలు తీయం... మీ చేతుల్తో మీ నాశనాన్ని కొని తెచ్చుకుంటున్నారు. మీ రోజులు దగ్గర పడ్డాయి. చేతికి దొరికిన శత్రువుల్ని, సైనికుల్ని, అమాయిక ప్రజల్ని-ఇలా హత్యలు చేసే ప్రభుత్వం ఏదీ నిలవడం కల్ల. మీకు పతనం తప్పదు! మీ దుర్మార్గం, దోపిడి, ద్రోహం, హత్యాకాండ—ఇపుడయినా తగ్గించండి" అంటున్నాడు నారాయణరెడ్డి.

"అబ్బో! మహా నీతులు చెప్తున్నావే! బద్మాష్!! ఊ...మీరు తీయండిరా గోతులు" అంటూ పక్కని నిలబడి వున్న సలభయిమంది మిల్టరీ, రజాకార్లకు ఆర్డరిచ్చారు. వాళ్ళు పోయి పలుగు పారల్తో గోతులు రెండు తవ్వ తున్నారు.

"మీ రాక్షసం హద్దుపద్దు లేకుండా పోయినందు వల్ల తాత్కాలికంగా ప్రజలు నష్టకష్టాలకు లోనుకావచ్చు. కాని దీంతో తుదకు సర్వనాశనమయ్యేదీ నామరూపాలు లేకుండాపోయేది మీరే! అది జ్ఞాపకం వుంచుకోండి! ప్రజలు అజేయులు! పార్టీ అఖండమైంది! జయం పార్టీది! మీ దుర్మార్గానికి గెరిల్లాలు శిక్షలువేసే రోజు వస్తూంది......" అంటూ మూల్గుతున్నాడు పిచ్చిరెడ్డి.

"ఏమిరా, ఏమన్నావ్..." అని పళ్ళు పట పట నూరుతూ వచ్చి "ఠప్ ఠప్" మని పిచ్చిరెడ్డి తలమీద, వీపుమీద రైఫిలు తిప్పి జమేదారు బాదుతున్నాడు. "ఊ... చూస్తారేంరా, వీళ్ళని చితకపొడవండి" అని పక్కనున్న

నల్గురు మిల్టరీవాళ్ళను వురికొల్పుతున్నాడు. కాళ్ళు చేతులు విరిచి కోళ్ళగుదెకట్టిన నారాయణరెడ్డి, పిచ్చిరెడ్డిలను పప్పు పప్పుగా చితకగొడుతున్నారు. అసలే నీరసంగా, నిస్తేజంగా వున్న వాళ్ళు కమిలి కళేబరాలుగా మారారు.

"తాం తాం తాం తాం...తాం..."

"కమ్యూనిస్టుపార్టీ...జిందాబాద్"....."కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్"

ఒకేసారి రెండు గోతులలో నారాయణరెడ్డి, పిచ్చిరెడ్డిలను నిలువు లోతు పెట్టి పై నుండి కాల్చింది...వారిద్దరూ మృత్యువును కౌగలిస్తూ నినాదా లేకకంఠంతో ఇచ్చారు. వారిపైన ఆ తీసిన మట్టి పోసి మిల్టరీ వెళ్ళిపోయింది! ఆ బాలవీరులు-గాదె నారాయణరెడ్డి, గాదె పిచ్చిరెడ్డి - విప్లవ మూర్తి రెండు నేత్రాలు, హస్తాలు-నేలతల్లి వొళ్ళో సుదీర్ఘ నిద్రలో మునిగి తేలుతున్నారు!!

